# అందియకత

## (శిలప్పదికారం)

రచన:

శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి



ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1957

శ్రీ ర స్తు

# అందియకత

## (శిలప్పదికారం)

శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారిచే
రచియింపఁబడి

తిరుమల-తిరుపతి దేవస్థానం బోర్డు అఫ్ ట్రస్టీస్ వారి తరఫున
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు
శ్రీ చెలికాని అన్నారావు, బి. ఏ., వారిచే
ప్రకటింపఁబడినది.



తిరుపతి
తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాక్షరశాల
1957

శ్రీరస్తు

# అందియ కత

## విషయ సూచిక

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 9 | 22 | కట్టిప | కట్టింప |
| 11 | 6 | లందుఁ | లందు |
| 12 | 7 | వర్షి-వినయ | వర్షుఁ-డనఘ |
| 18 | 15 | టయు | టయ |
| 27 | 22 | అధమము | అధమములు |
| 38 | 11 | ధాస్య | ధాన్య |
| 41 | 19 | మోదించి | మోదింప |
| 43 | 14 | త్రోఁప | తోఁప |
| 47 | 14 | బ్రేను | బ్రేమ |
| 50 | 8 | జలువు | జలుపు |
| 56 | 7 | కచ్చుల | కుచ్చుల |
| 88 | 14 | ద్రోయఁ | ద్రోయుఁ |
| 106 | 21 | పబ | బని |
| 141 | 19 | నెంజలి | నెంజిలి |
| 158 | 22 | లేని | లేచి |
| 163 | 23 | వద్ధతి | పద్ధతి |
| 166 | 18 | వురి | పురి |
| 170 | 22 | రేపుల | రేవుల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 174 | 11 | వస్తుపులు | వస్తువులు |
| ,, | 27 | చించింతించు | చింతించు |
| 179 | 5 | డండమ్ము | దండమ్ము |
| 187 | 18 | జేగురు | జేగుఱు |
| 189 | 18 | యెల్లియ | టొల్లియ |
| 194 | 14 | లేద్దైనను | లేనిదైన |
| 197 | 13 | బల్కి | పల్కి |
| 200 | 9 | దాక | దాఁక |
| ,, | 12 | ంఁ | ఁ |
| 201 | 2 | నడచిన | ననిచిన |
| ,, | 3 | లాప | తాప |
| 202 | 10 | మధుర | మధురఁ |
| 203 | 11 | నొసఁగుచు | నెసఁగుచు |
| 213 | 7 | కోప్పెరుందేవి = | పట్టపురాణి |
| 217 | 11 | యండాక | యందొక |
| 219 | 5 | వతుల | పతుల |
| 228 | 16 | చరియంగ | చదియంగ |
| 232 | 2 | దివిక | దివిజ |
| 269 | 15 | నిలిచియు | నిలిచి |

# విజ్ఞప్తి

ఇమ్మహాకావ్యము తెనిఁగించుట నావంటివాని కలవిమీఱి
పని. కంబరామాయణ పీఠికయందు మదీయహితైషులు శ్రీడాక్ట
కట్టమంచి రామలింగారెడ్డిగారు మణిమేఖలను శిలప్పదికారమున
నీవేల తెనిఁగింపవైతివను సూచనతో మందలించియున్నారు. వా
కోరిక దీర్ప దృఢచిత్తము గలవాఁడనై శిలప్పదికార మామూల
గ్రము పరికించు సరికి నా యత్నము సర్వదా విఫలమే యనుశం
పొడమఁగా నా యోపమిని వారికిఁ దెలిపితిని. ఎందెందు నాక
శక్తి చాలదని వివరించితినో, అందం దనుసరింప వలసిన విధా
ముల సూచించి ప్రోత్సహించిరి. వారి యాజ్ఞయు, విధానమున
శిరసావహించి రెండుప్రకరణములు వ్రాసి, మూఁడవది వ్రాయ
చున్న తఱి వారి పరలోకయాత్ర నా చెవులంబడి నిస్తబ్ధుంజేసినది
వ్రాఁత యాఁగి యేడెనిమిది మాసములు కడచిన పదపడి యెట్లేని
పూనిన కార్యము పూర్తి కావించుటయే వారి యాత్మతృప్తి కార్య
మని నిశ్చయించి యిప్పటికి ముగించితి. వారి యాత్మకు సర్వ
లోకేశ్వరుఁడు సర్వదా తృప్తియొసఁగుఁగాత.

ఈ శిలప్పదికారమునకు ‘ అందియ కత ’ యని పేరిడితిని
ఇయ్యది ద్రవిడ వాఙ్మయమున శిరోరత్న మనఁదగిన మహా
కావ్యము. ఇందు కథకంటె నాకాలమందలి సంగీతమునకు
జైత్రజాతీయ నటనములకు ప్రాముఖ్య మొసఁగఁబడి యున్నది
ఆ నటనములు యథామాతృకముగాఁ దెనిఁగింపనగుఁగాని సంగీత
మట్లు కాదు. ఆకాలపు పద్ధతులకు నీకాలపు పద్ధతులకు సంబం
ధము చాలవఱకుఁ గానరాదు. అది దేశి, ఇది మార్గి యని
యంతతో జాఱుకొనవచ్చును. అప్పటి శ్రుతి రాగ తాళ విధు
లిప్పటి విధులలోఁ గానరావు. అప్పటి వీణావాదన పద్ధతి చలటాటు
నుండి యచలటాటు పద్ధతికి దారిచూపిన దనవచ్చు. నాట్యాభి

నయపద్ధతు లందంత యెక్కువ చిక్కు గానరాలేదు; కా
యప్పటి నటనములిప్పుడున్నవా యను సందియముపుట్టింపకపోదు
ఆ పరిభాష వేఱు. ఇప్పటివి కొన్ని యప్పుడు సంకరములుగన
అప్పటివి కొన్ని యిప్పుడు సంకరములుగను కానవచ్చుచున్నవి.

సప్తస్వరములకు క్రమముగా కురల్, తుత్తం, కైక్కిళై
ఉళై, ఇళి, విళరి, తారము లని పేళ్ళు. అప్పటి కాలపు భూవి
విభజన మిట్లుండె :—

| | క్షేత్రము | వివరము | అధిదేవత |
|---|---|---|---|
| 1 | కుఱింజి | పర్వతము, తత్ప్రాంతము | గుహుఁడు |
| 2 | ముల్లై | అడవి, తత్ప్రాంతము | విష్ణువు |
| 3 | మరుదం | మాగాని | ఇంద్రుఁడు |
| 4 | నెయ్దల్ | సముద్రము, తత్ప్రాంతము | వరుణుఁడు |
| 5 | పాలై | అడవి, పర్వతములు, కఱవుచే పరిస్థితి చెడినది | సూర్యుఁడు దుర్గ |

అచ్చటచ్చటి శ్రుతిగీతాది సంగీతపరిస్థితులు, భావముల
భిన్నములై జాతీయనటనములును వెవ్వేఱు పరిభాషలతో నుండె
కొన్ని యటనట వివరించియుంటిని. నాకుఁ గలిగిన తలదిమ్మ
చదువరులకుఁ గలిగించు తలంపు లేదు. కావున నీ వివరమ
లింతతో విరమించుచుంటి.

ఈ తలదిమ్ముచే శ్లేష్మమునం బడ్డ యీఁగవలెఁ గాక
తేనియం దగులువడ్డ యీఁగయ్యైతి. ఎంతవఱకిందు కృతార్థుఁడ
నైతినో తెలుపఁదగు భారము విబుధ వితతికి వదలితి. దొసఁగు
లెన్నేని దొరలియుండవచ్చు. తెలిపినవారియెడ సదా కృతజ్ఞుఁడను

ఖరఫాల్గున బహుళ పంచమి
భానువారము, 16—3—1952.

బుధవిధేయుఁడు
పూతలపట్టు శ్రీరాములురెడ్డి

ఓం

శ్రీ ర స్తు

శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీ రామచంద్రాయ నమః

# అందియకత్తె

మంజరి॥ కుణవాయి లను పేరి - గుడిలోన నమరి
రాజభోగంబుల - రమణఁ ద్యజించి
యుఱిదిమైఁ దపియించు - యువరాజ మునికి
నెత్తమలను వసి-యించు నాటవిక
జనులు కేల్మోడ్చి య-చ్చట నొక్క పైఁడి
వన్నియ పూలతో - వఱలిన వేఁగి
నీడయందొక చన్ను - నీఁగిన యువతి
సౌందర్య గౌరవ-సరణి నొప్పారు
గరితను చేరి త - త్కాంతుని చూపి
యింద్రుఁడా పడఁతి నిం - పెసఁగు మర్యాద
తో విమానంబునఁ - దోడ్కొని చనుట
కనులార మేమెల్లఁ - గాంచితి మంచు
వినిపింప నాతఁడు - విస్మయమందె
అయ్యెడ నచటికి - నతిగౌరవమున
విచ్చేసినట్టి ద్రా-విడ వాగ్విదుండు

[1]శాస్త్ర యవ్విషయంబు - సాకల్యముగను
తెలియుదు ననుచు నీ - తెఱఁగునఁ బలికె
చోళదేశంబున - సురుచిర భోగ
భాగ్య గౌరవములఁ - బ్రథిత యశంబు
కడలకుఁ బఱపు [2]సం-గమ పట్టనమున ౨౦
వఱలు కోవలుఁ డను - వణిజుఁ డయ్యూర
నటన సమస్త జ-నంబుల వలన
నభినుతిఁ గన్న వే-శ్యా లలామంబు
మాధవి వశుఁడై స-మస్త సంపదలఁ
గోల్పడి కన్నగి - కులపత్నితోడ ౨౫
నెందేని చన నెంచి - యేఁగు వాఁ డాలి
కాలి యందియ నమ్మ-కము సేయనెంచి
సంగీత విద్యా వి-శారదుండైన
పాండ్యుని మధుర లో-పలఁ బ్రవేశించె
అట్టు లయ్యందియ - నతఁడు చేనూని ౩౦
నగర వణిగ్వీథి - నడచుచు నుండి
యెదురైన యగసాలి - నిదిచూడు మనుడు
వాఁడది గని రాజ-పత్నికిఁ దక్కఁ
దక్కొరులకుఁ దాల్పఁ - దగనిది గాన
మా రాజునకుఁ దెల్పి - మఱి వచ్చుదనుక ౩౫

---

1 చాత్త్రఞ అని అఱవము.

2 చోళుల రాజధాని. దీనికి కావేరి పూమ్పట్టనము, పుగారు అనియుపేళ్లు.

నిందుండుమని యేఁగి - నృపుఁ గాంచి వాఁడు
మున్నపహృత మహా-మూల్యమౌ పాద
కటక మొక్కన్యని - కయి నుంటఁ గాంచి
వచ్చితి ననుడుఁ బూ-ర్వపుఁ గర్మఫలముఁ
గాంచు నదను గానఁ - గడఁగి యా నృపుఁడు
పూర్వాపరంబులు - పోల నారయక
తనకడ నున్న కొం-దఱు సేవకులను
గాంచి యా దొంగను - ఖండించి వాని
చేనున్న యందెఁ జె-చ్చెరఁ దెండు పొండు
మసలకుఁ డంచుఁ బం-పఁగ వార లరిగి
యాతని ఖండించి - యందియఁ దేర
నవ్వార్త చెవిఁ బడ - నాతని పత్ని
దయితుని కడకేఁగి - తద్ధ్వితిఁ గాంచి
తరువు త్రుంగిన తీఁగ-కరణిఁ దల్లడిలి
గతిదూలి మతిమాలి - కన్నీరు గార్చి
యుత్తమ సతి యాట - యొగి దిటవూని
నృపుఁ డట్టులే నిట్టి - నిలువునఁ గూల
ముత్యాల సరములు - పొలుచు వక్షమున
నెడమ స్తనం బూడ్చి - యూడిచి వైచి
యందుండి పుట్టిన - యగ్నికి మధుర
నింధనముగఁ జేసి - యెల్ల జనముల
పొగడితలం గొన్న - పూఁబోణి యామె

యని శాస్త్ర వచియింప - నాతఁ డాశ్చర్య
మగ్న మానసుఁ డయి - మఱి విధి కుడువ
వాల మంటిరి గదా ? - ఘన గుణ గణ్యా ! ౧౦
ఆ విధి యెయ్యది - యానతిం డనుచు
యువ రాజడుగ శాస్త్ర - యోగి నిట్టు లనియె
స్థిర సంపదలచేతఁ - జెలువొందు చుండు
మధురా పురమున సు-మా మహేశ్వరుఁడు
వసియించు రజత స-భా మంటపమున ౧౫
నిద్రింప నొక రేయి - నిలిచిన యప్పు
డధిక దుఃఖిత యగు - నంగన యెదుట
మధురాధిదేవత - మాన్య భావమున
సన్నిధానము చేసి - సరసను నిలిచి
కొమ్మ ! నీ యెక్కుడు - కోపాగ్ని నొకట ౨౦
నీ పయోధరముపై - నెగడఁ జూపితివి
అనుభవింపఁగఁ దగి-నట్టిద యైన
కర్మవిపాకంబుఁ - గదియ నానితిరి
పూర్వ జన్మమున వి-భునితోడ నీకు
భువిని విఖ్యాతమై - పొలుచు కళింగ ౨౫
భూమిని గల సింహ - పురమున వెలయు
సంగముఁ డను వాని - సతి యిచ్చు శాప
మీ భవంబున నిట - నిట్టు లొందితిరి

నాతి ! నేఁటికిఁ బదు-నాలవ నాఁడు
మునిమాపు వేళ వి-భుని గాంతు బొమ్మ ౭౦
ఆతఁ డమర రూపుఁ-డై కాన వచ్చు
మానవదేహుఁడై - మఱి కానరాఁడు
అని యానతిచ్చు న - య్యభి భాషణంబు
వింటి నే నట-నని విన్నవించుటయుఁ
బార్థివుల్ తమ పరి-పాలన విధుల ౭౫
ధర్మంబునుండి సుం-తయు జాఱిరేని
ధర్మదేవతయె త-త్పతుల పాలిటికి
మృత్యుదేవత యయి - మీఱు ననుటయుఁ
దేట కీర్తిఁగల ప-తివ్రతా మణుల
మర్త్యులేగాక య-మర్త్యులు గూడ ౮౦
విమల మానసముల - వినుతింతు రనుట
యెట్టి వారికి నేని - యెంతేని పూర్వ
కృత దుష్కృతంబులు - ప్రీలక వచ్చి
కుడిపించు ననుటయుఁ - గొఱలేని పూర్వ
విధి యందె రూపున - వెలసెఁ గావునను ౮౫
కావింత మందియ-కత యను పేర
నొక్క కావ్యంబని - యువరాజు పలుక

వ॥ ఇవ్విషయంబు విషయత్రయంబున కధినాథులైన డరాజత్రయంబునకుం దెలియం దగియుండుంగావున మీరలు రచియింపఁ దగుదురన,

కన్నగి కోవలుల వివాహంబును, పెద్దలు వారిని గార్
స్థ్యంబు జరుప వేఱుగ నుంచుటయు, నృత్యమయూరి యన
మాధవి రంగము నలంకరించుటయు, సాయంసమయ విశేషం
బును, ఇంద్రోత్సవంబును, సముద్రస్నానంబును, తీరకుసుమి
వనవిహారంబును, మాధవీ కోవలుల పాటలును, వసంత
మున వియోగమందిన మాధవిచింతయు, కన్నగి దుస్స్వప్న
బును, దేశక్షేత్ర సందర్శనంబును, వనదర్శనంబును, వేఁటక
యల నాట్యంబును, మధురాప్రాంతమందలి పల్లియలో కన్న
కోవలులు విడియుటయు, కోవలుఁడు మధురం గాంచుటయు
న్నగి యిల్లడయు, కోవల వధంబును, గొల్లతల యాటయు
భర్తృ మరణంబు విని కన్నగి దుఃఖించుటయు, పౌరులు పడఁ
హారు తిరుగుటయు, పాండ్యునితో న్యాయవాద మొనరించుటయు
రాజపత్నిం గాంచి ప్రతిన పలుకుటయు, మధురను దహించుటయు
గరాధిదేవత పూర్వగాథ వినుచుటయు, కొఱవతల యాటయు
రరాజు పర్వతమును దర్శించుటయు, శిలాప్రతిమం జెక్కించు
యు, గంగాజల స్థాపనంబును, ప్రతిష్ఠయు, స్తుతియు, వరద
ంబు నను ముప్పది విషయంబులు గద్యపద్య మయంబుగ
హాకావ్యంబు యువరాజస్వామి రచించి వచింప మధురాపుర
ణిజుండు శాస్త్ర వినియె.

ఇయ్యది కథాంశము.

## మహిమావ్యాప్తి

నాఁటంగోలెఁ బాండ్యదేశంబు వానలేక వరటి యాధివ్యాధి
బాధల నలంగుచుండఁ గొర్కై యను నగరమున నుండిన పాండ్య
రాజ వంశజుండు వేవు రగసాలె వాంద్ర బలియొసంగి హోమాది
శాంతిక్రియలు గావించి [1] పత్నిదేవత కుత్సవంబులు నడప దేశ
మెల్ల యెడల మంచి వానలు కురిసె. కఱవు తొలఁగె. ఆధివ్యాధు
లంతరించె.

అది విని [2] కొంగుదేశ యువరాజులు కోశలు తమ దేశ
మున నుత్సవములతో శాంతిక్రియలు జరపుటయుఁ గొఱఁత లేక
వాన కురిసి దేశము సస్యశ్యామలమై సుభిక్షమైనది.

అది విని శరధిపరిఖంబగు లంక కధినాథుండగు గజ
బాహువు తన దేశమంతట బలిపీఠంబులు మున్నుగ నమర్చి
పదపడి యాలయము నిర్మించి చెడుగులఁ దొలఁగించి వలయు
వరంబులు పత్నీదేవత యొసంగు నని నిశ్చయించి కటకమాసం
బున మొదలిడి ప్రతివత్సర ముత్సవంబులు సేయుచుండ వర్షము
పుష్కలముగాఁ గురిసి యయ్యది ధనధాన్యసమృద్ధి గల దేశం
బయ్యె.

అది విని పెరుంగిళ్ళి యను చోళరాజు ఉఱైయూర సీమె
పత్నీ దేవత గావున నెట్టి వరములనైన ననుగ్రహింపఁ గలదని
తలంచి దేవళంబుఁ గట్టించి నిత్యోత్సవపూజ లొనర్చుచుండె.

---

1 ఈ పత్నిదేవత మారియమ్మ (వర్షదేవత) యను పేర నేఁటికిని దక్షిణ
దేశమందెల్లెడలఁ గొనియాడఁబడుచున్నది. తెనుఁగు దేశమందును చోళుల కాల
మునఁ గొన్ని కన్నగి దేవాలయములు కట్టిపఁబడిన వనియు నవి నానాఁట గనక
మహాలక్ష్మి ఆలయము, కనక దుర్గాలయములను నిట్టి పేరు లొందెనని కొందఱ
భాశయము.

2 కోయంబుత్తూరును, సేలముజిల్లాలో కొంతభాగమును చేరినది కొంగు.

# ౧. పుగారుకాండము.

## ౧. స్తుతి.

ఆ.వె॥ చంద్రుని వినుతింతుఁ - జంద్రుని వినుతింతుఁ
జోళు చలువ గొడుగుఁ - బోలి లోక
మున నృపు జల్లఁదనము - కనికరించుటచేత
మనసునందు సుఖము - మలసి యాడ ॥

ఆ.వె॥ సూర్యుని వినుతింతు - సూర్యుని వినుతింతుఁ
జోళునాజ్ఞ చక్ర - మోలిఁ దిరుగు
లలిని కనక గిరిని - వలఁగొనుచుంటచే
మనసునందు పరువు - మలసి యాడ ॥

ఆ.వె॥ వానను వినుతింతు - వానను వినుతింతుఁ
జోళరాజునీవిఁ - బోలి యెలసి
యెగువ చోటినుండి - దిగుచు నుండుటచేత
మనసునందుఁ బ్రేమ - మలసి యాడ ॥

ఆ.వె॥ అందమగు పుగారు - నభినుతింతును భక్తి
జలధి మేఖల యగు - జగతి యందు
కొలము పొరిది విభుఁడు - కొమరారుచుంటచే
మనసునందు గురుత - మలసి యాడ ॥

ంమును హిమాలయమును - మహిత గౌర
ం గాలు గదల్పని - ప్రాంత కాంపు
ొప్పారు చుండు పు-గారు పురియు
ోం దొల్త జనియించి - స్థిరతం గాంచి
వని వచింతురుగాని - యురు గుణాఢ్యు ౯

గలుగుట దాని ల-యంబుం గూర్చి
రధిక విజ్ఞాన సం-పన్న [illegible]
ాకంబు నాగంబు - గ[illegible] యశము
మును గల సంగమ - స్థలమునందు
బోల్దానధారల - వఱలు కేలు ౧౦

ుహానావికుని శీల - కులమునందు
ు విరిలత బంగరు - బొమ్మ యనంగం
పంద్రెండు దాంటిన - వయసు గలది
వాసినీ స్తుతిపాత్ర - కమ్రరూప
కమనీయ రూపంబు - నెనయు ననియు ౧౫

లంక యరుంధతి - నెఱి చరిత్ర
నియత చరిత్రతో - నెనయు ననియు
లు నుతింప నొప్పిన - వర గుణాఢ్య
నామంబు కన్నగి - యంద్రు జనులు
రంబున గొప్ప భూ - దారు చోళు ౨౦

వంశమున వార మసుకొను - వారితోడ
మాఁగు సంపదలం దుల - దూఁగు వాఁడు
ధర్మమార్గాన వచ్చిన - ధనము బీద
జనుల కుపయోగపఱచు సు-స్వాంతుఁ డతఁడు
ధరణిని [1] నిధి ద్వయాఢ్యుఁ డ౯ - బిరుద మంది

నాతఁ డొప్పు మహాసార్థుఁ - డనఁగ నతని
తనయుఁ డూన షోడశ వర్షి - వినయ గుణుఁడు
భువి నడంగించు కీర్త్తి గౌ-రవ ఘనుండు
విమల చంద్ర బింబాస్యలు - వీణ నణఁచు
కంఠ సంపద గలవారు - కడఁకఁ జేరు

మహిత కోమల మహిళా స-మాజ మందు
కనులకుం గానవచ్చెడు - కంతుఁ డనుచుఁ
బొగడఁ బడు సుందరాంగుండు - పూత గుణుఁడు
కోవలుం డను పేరిచేఁ - గొఱలు వాఁడు
వారి తలిదండ్రు లొకనాఁడు - వాంఛ చెంది

పెండ్లిసేయ వేడుకపడి - పెద్ద యేన్గు
మీఁద నెక్కించి పెద్ద ము-త్తైదువులను
నగర మంతట మంచి ల-గ్నంబుఁ దెలుప
నంత మంగళ వాద్యంబు - లదర మ్రోఁగె
భేరుల యులివు మిన్నంట - బెరసి మొరసె

---

1 ఇహపరములకు వలయు నర్థసంపన్నుఁడు.

శంఖకాహళాదికముల - సద్దు లొరసె
రాచ మెఱవడికిం బలె - రాణయొప్పఁ
దెల్ల గొడుగులు మిక్కిలి - యుల్లసిల్లెఁ
దాళి బొట్టూర వలగొని - తరలి వచ్చె
తారహారముల్ గల బోదె - లారు హీర ౪౫

మణుల కంబము లొప్పారు - మండపమున
నీల పట్ట వితానంబు - నీడ ముత్త
కాయ మానంబునందు బం-గారు పీఁటఁ
గలువతేఁడు రోహిణిఁ గూడి - మెలఁగు వేళ
వృద్ధుఁడగు పురోహితుఁ డట - వేద విహిత ౫౦

పద్ధతిని కార్యము లొనర్ప - నిద్ధ గుణుఁడు
కోవలుఁడు కన్నగిని పెండ్లి - కోరి యాడి
యగ్నికార్యంబు నెఱవేర్చ - నయ్యదనునఁ
గాంచు వారల కను నోము - లెంచఁ దరమె ?
కమలగంధులు చందన - గంధులు విరిఁ ౫౫

బోండ్లు మెఱుఁగుఁబోండ్లును స్తుతి - పూని సేయు
గాయనీ తతి క్రేఁగంటఁ - గాంచు వారు
నైన యౌవతం బొకవంక - నగురు ధూప
ములను గలవారు మాలికల్ - గలుగు వారు
గంధవాడియును పన్నీరు - గలుగు వారు ౬౦

సంతసము తొలఁకెడి పూప - చనుల వారు
కేల దీపముల్ గలవారు - పాలికలను
గొన్న వారు మంగళ పూర్ణ - కుంభములను
కొన్నవార లలంకృతుల్ - గొన్న వారు
నగుచు నగుమొగములతోడ - వగల తోడఁ ౧౫

గార్యములఁ జాలుగొను ప్రౌఢ - కాంత లలర
అలరు విరులను తుఱుము వే-నలులతోడ
నందమగు స్వర్ణ లతలన - నలరు వారు
వనిత తనప్రియుఁ గంటిచే - మనసు చేత
నెడయ కుండుఁ గాత మనుచు - నీతఁ డీమె ౨౦

యెడద నుంచిన చే చలి-యింప నీక
యొప్పుచుం దమ యొద్దిక - కొక్క కొఱఁత
లేక చిరకాలము సుఖింత్రు - గాక యనుచు
వేలుపుల పేర దీవించి - విరులు సల్లి
శాస్త్ర పద్ధతి వారల - శయన గృహము ౨౫

చేర్చి బంధు జనము సంత-సించి రంత,

ఇవ్వల మంచుకొండ పయి నెత్తిన వ్యాఘ్రపతాక మెల్లఁగా
నువ్వల మేరువందు వల నొప్ప దిటంబుగ నిల్పుఁగాక పై
నెవ్వలఁ బోరఁ గిన్క వహియించు నరాజి ధరించు చోళ రా
జవ్వల నడ్డులేని తన యాజ్ఞ గవించును గాక నిచ్చలుఽ॥

## ౬. గృహస్థధర్మము

మంజరి॥ కలముచే బండిచేఁ - గలిగెడి కలుము
లొసఁగు క్రౌంచదేశమ్ము - లొక్కచోఁ జేరె
నేమొ యనంగ నొ-ప్పెసఁగు ధాన్యములు
జలధి పరీత భూ-స్థలి జను లొక్క
యెడఁ జేరఁ బోషింప - జడియని పాఁడి
పంటలు గలిగి స-త్పథ గాములైన
రాజులు గూడి కో-రఁగఁ దగు కల్మి
పెంపారు వణిజుల - పేర్మిచేఁ గీర్తి
పొలిచిన సంగమ - పురవరమందు
పర కులాచార సం-పన్నులౌ పౌర
ధనవంతులకుఁ బగు - ధర్మ మార్గమునఁ
గలిగిన ధనము పా-త్రులకు దానమ్ము
చేసి తత్ఫలము భు-జింపఁగాఁ బుట్టు
నుత్తర కురుభూమి-యొ యిది యనఁగ
నొప్పు నప్పురమున - నున్న యేణాక్షి
తత్ప్రియుండును నేర్పు - దనర మయుండు
నిర్మించెనో యన - నెగడిన యేడు
నియువుల మేడలో - నెలకొను పట్టె
మంచంబుపై నున్న - యంచిత మైన
యంచ తెక్కల పాన్పు - నందున్న యెడను
వన్నెల కలువల - వనజాతములయుఁ
దక్కు నీటి పువుల - తావి భుజించి

మొగలి పొదల నుండి - మొల్లల నుండి
విరి గురివెంద సం-పెఁగ పొదరిండ్ల
తావిఁ ద్రావుచుఁ ద్రేన్చి - తను సుమధ్యమల

క్రొమ్ముడి గంధంబు - గొనఁగ నేఁకరుచు
చొరఁ ద్రోవ గానక - సుడియుచు నున్న
తేంట్లతోఁ గై సేఁత - తీరుగా నున్న
జాలకంబుల త్రోవఁ - జన్న సుగంధ
మంద పవనుఁ గాంచి - మఱి యుత్సహించి

కాము మతిశయింపఁ-గా మెట్ల నెక్కి
యెడమచేఁ జెఱకు వి-ల్లింపారఁ బట్టి
కుడిచేతఁ బూల ము-ల్కులఁ గటి తటిని
మొగ్గ కటారి ని-మ్ముగఁ దాల్చి మరుఁడు
నివసించుచుండు వె-న్నెల మేడఁ జేరి

తేఁటు లానఁగఁ దగ్గ - తీరునఁ బఱపు
పరిమళ కుసుమ త-ల్పంబున నుష్ణ
శీత కరులు చేరు - చెలువునఁ జేరి
రంతఁ గోవలుఁడు ల-తాంగి భుజముల
స్తనములపై నిక్షు-వును లతికయును

లిఖియించె నవల శి-లీముఖ వితతి
ధ్వని సేయ వెన్నెల - వలె విలసిల్లు
మల్లికా కుసుమ దా-మము తోడి నల్ల

గలువ మాలికయు నొ-క్కటి నల్లలాడ
సుఖియించి యిరువురు - చొక్కి మై మఱచి ౪౫

యొక కొంత యుండి య - య్యువిద మొగమ్ము
తనివి తీఱక కాంచి - తాత్పర్యయుక్తి
నింపుగాఁ గోవలుఁ - డిట్లని పలికె.

అమరులు సన్నుతింపఁ బ్రమథాధిపుఁ డట్లు శిరోవిభూషగా
నమరుపఁ దగ్గ గౌరవము నందిన యన్నెలరేక నీకుఁ బ్రే
మ మిగులు తోడఁ బుట్టువని మన్ననతోడ నుమామహేశుఁ డా
కమలజు నీకు నెన్నొసలుగా నొసఁగం దగువాఁడు కోమలీ! ౧

పోరికి గౌరవం బొసఁగు పోటరి వీరుల కాయుధంబులన్
గారవ మార నిచ్చుటలు క్షత్రియ పద్ధతి యౌట నీకు న
మ్మారుఁడు తుంట వింటి నొకమాడికి రెండుగఁ జేసి ప్రన్ననౌ
తీరున రెండు బొమ్మలుగ దిద్ది యిడం దగువాఁడు తొయ్యలీ! ౨

అమృతమున కీవు తోఁబుట్టు - వగుట చేత
నమరనాథుఁడు తాల్చు వ-జ్రాయుధంపు
నడుము నీ నడుముగ దిద్ది - యిడఁగఁ దగిన
వాఁడు గద! సింహమధ్యమ! - వనజగంధి! ౩

ఇటు లొక యించుకేని తగులేర్పడ కున్నను షణ్ముఖుండు నా
కటుతర దుఃఖముం గనులఁగాంచఁగఁజాలక కాంచుమంచుఁదాఁ
బటువుగఁ దాల్చు దీర్ఘమగు బల్లెముఁ జల్లని కొంతు లీసు నీ
బటువగు మోమున న్నయనపద్మయుగంబుగ దిద్దువాఁడగున్. ౪

॥ నీలమణి ప్రభల్ నెగడు నెమ్మిలు నీమయి చాయకోడి పె
న్నీల భజించి కాఱడవి కేఁగి ముడించెఁ బడీయ పింఛముల్
చాలఁగ మల్లలో విరియు చల్లని పూవుల క్రింప నల్వ తే
జీలవి దాఁగె నీదయిన చెన్నగు నెన్నడ కోడి సిగ్గుమై. ౫

॥ చిలుకలు గౌరవింపఁ దగు చెల్వము నొందమిఁ బిల్లఁగ్రోవియున్
జలనిధి వెన్న వీణ దాని జాసుగఁ జేర్చిన యట్టులున్న నీ
పలుకులు నేర్వఁగోరి యవి పాయక త్వత్కర మందనిల్చియీ
సొలుకక సాదనల్ సలుపుచున్నవి సుందర మందహాసినీ! ౬

॥ సహజ సౌందర్యమే లోక-జాలములను
గెలువఁ జాలియుండఁగ నలం-కృతులు చేసి
బరువు నెక్కించిరే కాక - తరళనేత్ర !
చెలులు గన్న ఫలంబేమొ - తెలియ లేము. ౭

॥ పలువిధములైన జడలు పై-వంగఁ దగిన
కొప్పునకు శుభంకరముగాఁ - గొన్ని పూలు
ముడుచుటయు కాక రాలెడి - పూల మాల
నుంచఁ బనులయ్యె తమలోన - నుండఁబోలు. ౮

॥ అగరు పొగ వేయుదురు గాక - తగు కురులకు
మృగమదము కూడఁ బట్టింపఁ - దగును వెన్న
దాని యెడ వారలకుఁ గల - తగుల మేమొ
యెఱుఁగ రాదయ్యె విమల పూ-ర్ణేందు వదన ! ౯

॥ తగ సురోజ తటములపై-ధాతు రసము
వ్రాయుటయె గాక ముత్తె స-రంబు గూడ

౨. గృహస్థధర్మము

బరువు గూర్పఁగ దానితో - వారికిఁ గల
తగుల మేమొ తెలియరాదు - చిగురుబోడి!

క॥ నెలఁబోలు ముద్దు మోమునఁ
జెలువుగ ముత్తెములఁ బోలు - చెమ్మట బొట్టుల్
గలుగ నలి నడుమడఁగ మే
ఖలఁ దొడిగిన వీరికేమి - కైవో తెలియన్.

సీ॥ మ జ్జీవ సర్వస్వ-మా! వలమురి ముత్తె
మా! యిక్షు ఖండమా! - మధువ! పైఁడి!
అరుదగు చిత్రమా! - హరువైన గంధమా!
అమృతంబ! జాతి ర-త్నమ! సుఖంబ!
మల యందు పుట్టని - మణియందునా? వీణ
యరయని సంగీత - మందు నేమి?
అంభోధిఁ బొడమని - యమృతమే యందునా?
యేమందు నని ప్రేమ - మెసఁగ నాడి

తే॥ కొమ్మ ప్రేమను తాఁ బంచు-కొని వియోగ
మనెడి పేరు లేకుండఁగ - ననుదినమ్ము
మోదవార్ధితరంగముల్ - మోఁదుచుండఁ
గొంత కాలమ్ము పోఁద్రోచెఁ - గోవలుండు.

మంజరి॥ అంత నాతని తల్లి-యార యోచించి
సాధు జనుల కుప-చారముల్ సేయ
నతిథి జనంబుల - నర్మిలి నోము

నభ్యాగతులఁ బ్రేమ - నాదరించుటకు
బంధు మిత్రులకుఁ దో-డ్పడఁగ గృహస్థ ౫
ధర్మముల్ తత్పర-తను నడపుటకు
నర్థంబుఁ గూర్పంగ - యశము నార్జింప
దాస దాసీజన - తతుల నొసంగి
వలసినంతకు మించి - వసుచయ మిచ్చి
ప్రేమమై వారల - వేఱుగా నునుప ౧౦
నిలుపాడి పరికించి - యిలు చక్కదిద్దఁ
బట్టుగాఁ గొన్నేండ్లు - పఱచెఁ గన్నగికి.

॥ పుడమి సమస్త సంపదలు భోగములుం బరువంబు నెన్న నిల్కాఢ్య గొనలేని వంచరసి కల్గిన యప్పుడ పెట్టి యానఁగా మడఁతియుఁ గోవలుండు రతి మన్మథులం బలె నింపు సొంపు గన్పడఁ బెనగొన్న పాఁపదుగ భంగిని పొందిరి ప్రేమసౌఖ్యముల్.

---

## ౩. రంగారోహణము

ంజరి॥ దేవతాత్మక మయి - దీపించు మలయ
మున వసించు నగస్త్య - మునివరు వలన
శపియింపఁబడిన ని-ర్జరనాథ సుతుని
తో నాట్య రంగమం-దున శాపముక్తి
గన్నది రంభాది - కాంతలయందు ౫

## ౩. రంగారోహణము

మహిమచే సుషమచే - మజీ నృత్యమందు
పేరొందు నూర్వశి - పృథివీ స్థలమున
మాధవి యనెడి రో-మడ(తియై పుట్టె
నామె వంశమున - మహా సుందరాంగి
మాధవి యను నోర్తు - మహిం( జనియించె

ఆటయుం( బాటయు - నందంబు ననెడి
మూట( గొఱ(త లేక - పొలుచు పూ(బో(డి
కయిదవ యే(ట దం-డియము పట్టించి
నటనంబు సేడేండ్లు - ననువుగ నేర్చి
పదియు రెండవ యేట( - బార్థివు నెదుట(

జదురున( జదురు మె-చ్చ(గ( జూప నెంచి

—: నాట్యాచార్యు(డు :

శాంతి వినోదుల- [1] జైత్ర జాతీయము
నటనముల్ తత్త దం-తర్భేద విభులు
బాగుగా నేర్చి నే-ర్ప వలంతి యగుచు(
బదునొకం డాటలు - పాటలు వాద్య
ముల నుత్తమ గ్రంథ-ముల యందు చదివి
ఆటల తెఱ(గులు - పాటల తీరు
తాళ లక్షణములు - తటి కొనుగోలు

---

1 జైత్రము :— రాజులు చూచునది (వేత్తియల్, అగం.)
జాతీయము:— తక్కినవారు చూచునది (పొదువియల్, పుఱం.)

సాత్త్వికాటులు నాల్గు - చందంబు లరసి
యభినయ హస్త ప-ద్ధతులు మున్నెఱిఁగి
రంగంబునందు తా-ర్మాఱు లేకుండ
నాట్యంబు నందభి-నయము సేయకయు
నభినయమందు లా-స్యంబు సేయకయు
సంయుతా సంయుత - సరణుల యందు
వ్యత్యస్త దోషంబు - పరఁగక త్రోచి
యుసిలోనఁ దెబ్బయు - నుసి దెబ్బ లోన
జైత్రంబు నందున - జాతీయ మేని
జాతీయ మందున - జైత్రంబు నేని
యొండొండఁ గూడ నీ - కుండఁగ నడపి
యాడ నాడింపఁ బే-రంది రంగంపు
నయము తెఱింగిన - నట్టువు తోడ,

—: సంగితోపాధ్యాయుఁడు :—

వీణ వాయింపంగ - వేణువు నూఁదఁ
దాళ మర్మము లెల్లఁ - దనరంగ నెఱిఁగి
స్థాయీ త్రయంబున - సౌరుగాఁ బాడ
భావ రాగముల సం-బంధంబు చెడక
తాళ గతుల పొందు - తాఱంగ నీక
నటనకు ననువుగాఁ - బటురీతిఁ గూర్చి
దేశభాషా పాండి-తిని వహియించి

## ౩. రంగారోహణము

దేశాంతరోక్తుల - తీరుల నరసి
పరదేశ సంగీత - పద్ధతు లెఱింగి
పాట యందలి కవి - భావంబు చెడక
నట్టువుని ప్రకృతి - నయముగా నెఱింగి
శాస్త్రోక్తముగఁ గ్రొత్త - సంగతుల్ గూర్చ
వివరింపఁ జతురుఁడై - విశద చిత్తుండు
స్థిర గుణంబులను సభ్య - చిత్త వీథులను
హాయువుగఁ దెలియు గీ-తాచార్యు తోడ,

—: కవి :—

ద్రవిడ జనంబు లా-రంగ నెఱుంగఁ
దగు సరళోక్తి నొం-దంగ వ్యాకృతియు
జాతీయముల తీరు - చక్కంగ నేర్చి
[1] శాంతి వినోదుల - సరణులు తెలిసి

మార్గగా దేశిగా - మార్చంగ నరసి
మఱి నాట్య నాటక - మహిత లక్షణము
లరసి గీతాచార్యుఁ - దనువుగాఁ గోరు
రాగ స్వభావంబు - రంజిల్ల భావ
బంధురత చెడక - పాటిల్లఁ జేసి

లఘు గురువుల సాఁగ - లాగఁ ద్రుంపంగ
నక్కఱలేక ల-యాను గుణముగ

---

1 శాంతి = శుద్ధ నృత్యము — జైత్రము.
వినోది = పాటతోడి నృత్యము — జాతీయము.

తమ విరోధులు తీయు - తప్పు టర్థముల
కెడ మీని శుభ వాక్కు - లింపారఁ గూర్చి
నాటకంబు రచించు - నయశాలి యైన
వశ్య వాక్యుఁడు కవి - ప్రవరుని తోడ,

—: మేళగాఁడు :—

ఆటయుఁ బాటయు - నాటకుఁ దగిన
భాషయు సంగీత - పద్ధతు లందు
భావంబునకుఁ దగు - పాట రాగంబు
రాగంపు మేళ క - ర్తలు వాని విధులు

తజ్జన్య భేదముల్ - తాళ గతులును
జాతు లంగంబులు - సరవి గ్రహించి
శ్రుతులు పెక్కైన నె - చ్చును తగ్గులేక
మేళవింపఁగ నేర్చి - మించిన వానిఁ
దగ్గించి తగ్గినఁ - దగ నెచ్చు చేసి

నయముగా వేణు వీ - ణా నాదములను
విన నింపుఁ గలిగించి - వేడ్కతోఁ జేతి
సైఁగ తోడన శ్రుతి - సంగతుల్ దెలిసి
కలుపుచో వెలితిని - గననీక కూర్చు
నెడఁ జేతిపని సభ్యు - లెఱుఁగ రానీని

మెలఁకువఁ గల్గిన - మేళకు తోడ

—: వైణికుఁడు :—

కడు రమ్యముగఁ జిత్ర - కల్పన సరణి
వంచన కల్పనా - పద్ధతుల్ చేయు
పాటల యొజ్జ వె-న్నడు నేర్పు గలిగి
ఆరోహణావరో-హణ వక్ర గతుల ౯౫

నంగుళు లాడించు - ననువున సూట
మూఁడు స్వర స్థాన-ముల జాఱు లేక
శ్రుతు లిరువది రెండు - సూటిగా నెఱిఁగి
పంచమస్వరముతోఁ - బాడంగ నేర్చి
రాగములందు వ-ర్జ్యకళా స్వరములఁ ౯౦

దెలిసి నట్టువఁ డేఁగు - తెరువు తీ రెఱిఁగి
తోడ్పడి కొఱఁతల - ద్రుతగతి తోడ
రాగంబుతో నింపి - రమ్యమౌ కరణి
నావర్తముం బాడి - యక్ష రాక్షరము
స్పష్టమౌ సరణి సు-చ్చారణ తెలియ ౯౫
వాయింప వలఁతి యౌ - వైణికు తోడ,

—: వైణికుఁడు :—

సరగ మధ్యమ నుండి - సప్తస్వరములఁ
గ్రమత నిమ్మడిఁ గూర్చి - వ్రాసిన పదియు
నాల్గు స్వరమ్ముల - నాలుగు సరులు
మంద్రంబుగా నేఁడు - మధ్యమ గాఁగ ౧౦౦

మిగులు పూడిటిఁ దార-ముగ నిల్పి పాడ
నదియు పో తగ [1] 'షాడ్జి' - యను జాతి యయ్యె
నొకటి తగ్గించి 'గా'-నుండి పద్నాల్గ
నయతఁ గైకొన్నను - 'నైషాది' యయ్యెఁ
బరఁగ 'రీ'నుండియుఁ - బదునాల్గు స్వరము ౧౦౯

లడరింపఁ 'ధైవతి' - యయ్యెను షడ్జ
మున నుండి పాంచమి - మొనసు నామెంచ
ధైవతాదిగను గాం-ధారి వర్తిల్లు
నట్లె పంచమి నుండి - యార్షభి యొప్పు
దీర్ఘస్వరంబుల - తీరుఁ జెడక ౧౧౦

మొదలి తుదిని స్వర-ముల పొందు చెడక
హాయిగాఁ బాంచమి - యాదిగా వీణ
పై సవ్యముగఁ దగు-పాటును త్రోవి

[1] వీని వివరణము

| తెలుఁగు పేరు | అఱవమున పేరు | మంద్రము | మధ్యము | తారము |
|---|---|---|---|---|
| షాడ్జి | శెంబాలై | మపధని | సరిగమ పధని | సరిగ |
| నైషాది | పడుపాలై | గమపధ | నిసరి గమపధ | నిసరి |
| ధైవతి | శెవ్వఴిపాలై | రిగమప | ధనిసరి గమప | ధనిస |
| పాంచమి | అరుంబాలై | సరిగమ | పధనిస రిగమ | పధని |
| మాధ్యమి | కోడిపాలై | నిసరిగ | మపధని సరిగ | మపధ |
| గాంధారి | విళరిపాలై | ధనిసరి | గమపధ నిసరి | గమప |
| ఆర్షభి | మేర్చెంబాలై | పధనిస | రిగమ పధనిస | రిగమ |

ఈ పద్ధతి చలటాటు వీణపై నచలటాటు పద్ధతి వాయింప
నువగుమన్నది.

పైని మాధ్యమి నుండి - పరికించి చూడ
నపసవ్యముగఁ వగ్గు - టరసి స్థానముల ౧౧౫
క్రమము చెడక ఘాప - గాంభీర్య సరణి
వాయింప వలఁతి యౌ - వైణికు తోడ

—: రంగస్థలము :—

గణ్యులౌ శిల్పులు - క్రమము పాటించి
రంగస్థలంబు నే-ర్పఱుపంగ నొక్క
[1] నిర్దుష్టమై యొప్పు - నేలను గుంత
త్రవ్విన యా మన్ను - తగఁ బూడ్చు నంత
సరిపోవు స్థలమును - చదును చేసికొని
పుణ్య పర్వతమునఁ - బ్రోదిగాఁ బెరిఁగి
కనుపు కనుపుఁ జేనఁ - గలిగిన వెదురు
సమ హృదయుని యంగు-ళముతోడఁ గొలిచి ౧౨౫
యిరువది నాల్గెత్తి - యేర్పడఁ గోసి
యేడు కోలల వెడ - ల్పెనిమిది పొడవు
నొక కోల యెత్తు వే-దిక యమరించి
రంగముపైఁ బల్క - లంగుగాఁ బఱపి
కంబాలపై నడ్డు - కఱ్ఱకు దిగువ ౧౩౦
పలకకు నాల్గు కో-లల నుండ నిలిపి
వాకిండ్లు రెండుంచి - వర రంగమందు

1 త్రవ్విన మన్నాగుంతలో నే పోయఁగా మిగులునది వ[illegible]బాల్, తగ్గునది
బాల్, అధమము. సరిపోవునది ఇషైప్పాల్ తగినది.

తగఁ [1] జతుర్వర్ణ ఘూ-తంబుల వ్రాసి
పై నిల్పి కంబాల-వలని నీడలను
రంగస్థలము పైకి - రాకుండు నట్లు ౧౩౫

సభ్యుల కడ్డుగా - జాఱంగ నీక
యిమ్మైన చోట్ల దీ-పమ్ముల నుంచి
యెడమ కంబము కడ - నేక ముఖముగ
కుడిప్రక్క ద్విముఖమై - కొఱలెడి తెరలు
చిత్రంపు మేల్కట్టు - చేర్చిన యట్లు ౧౪౦

పైనుండి దిగు తెఱ - పరిఢవిల్లంగ
ముత్యాల సరులును - పూల సరములు
మొగుదల నతి చిత్ర-ముగ వ్రేల విడిచి
మంగళ కరముగా - మనోజ్ఞకముగ
రంగారు చున్నట్టి - రంగస్థలమున ౧౪౫

—: తల కోల :—

శాత్రవు లని నప-జయమంది పాఱు
నపుడు లాగుకొనిన - యందమౌ తెల్ల
గొడుగు కామను చేతఁ - గొని కనులందు
పుఖ గడిగిన మణుల్-పొదిగి యా నడుమ
జాంబూనదపు ఱేకు - సొఱుగాఁ జుట్టి ౧౫౦

---

1 వజ్రదేహ, వజ్రదండ, వరుణ, రక్తకేశులు : బ్రహ్మ, క్షత్రియ, ...య, శూద్రవర్ణఘూతములు.

రాజమందిరమున - రాణ [1] జయంతు
గానెంచి పూజించి - ఘన రక్షచేసి
యుంచిన తలకోల - నొగి నాట్యగురుఁడు
మొదలుగాఁ గలవారు - పుణ్యజలముల
బంగరు కుండతో - వాద్యాల తోడఁ ౧౫౫
దెచ్చి నీరాడించి - తెలిపూలు చుట్టి
పలు దీవనలు చేసి - పట్టంపు టేన్గు
చేతి కొసంగి యం-చిత మతి తోడఁ
దోఁ గొని వాద్యముల్ - తోడ్తోడ మొరయ
నరపతి మంత్రి సే-నాపతి వేగ

మాత యాచార్యుండు - తో నరుదేరఁ
దేరిని వలఁగొని - తేరిపై నున్న
పాట పాడెడి వాని - వలకేల నిచ్చి
పురము ప్రదక్షిణం-బుగఁ జుట్టి వచ్చి
యాట పట్టునఁ జొచ్చి - యభిముఖముగను ౧౬౫
తలకోల తనరంగ - నిలిపిన యంత

—: మాధవి రంగము చేరి యాడుట :—

ఒడయఁ డాదిగఁ దత్త - దుచిత స్థలములు

---

1 జయంతుఁ డగస్త్యుని శాపమున వెదురై పుట్టి తలకోల స్థానమున
ము నీఁగినందున దానిని జయంతునిగా భావింతురు. శత్రురాజుల గొడుగు
యు శత్రుల నగరులోని కల్లయు రాజులకు; తక్కినవారికి మంచి
తమునఁ బుట్టినది.

మెఱయ నుండఁగఁ బ్రక్క - మేళంబు వారు
నిలువ వలయు చోట - నిలిచిన పిదప
మాధవి కుడికాలు - మఱి మున్నువెట్టి ౧౭౦
రంగంబునం గుడి-ప్రక్కను నిలువ
నెడమ కంబము కడ - వృద్ధ నటీ జ
నము చేర నందఱు - నాణెంబు గాఁగఁ
దాళంబు వడిసలు - తప్పక యొకటి
రెండు కాలంబుల - రెట్టించి వైచి ౧౭౫
దేవతాస్తుతి చేసి - తీర్పులు వైవ
జతగఁ బాడుచు నున్న - జంత్రంబు లెల్ల
వేణువు వేణువు - వీణియ దాని
ననుసరించి మృదంగ - మడరంగ దాని
ఘటము దానిని ఢక్క - గలసి ధ్వనించి ౧౮౦
గ్రద్దయము సీడయు - గతి నొంటి యుండఁ
[1] బంచ తాళముల ప్ర-బంధంబుతోడఁ
దాళ గతులు [2] నాల్గు - తప్పక చూపి
దేశి యాటకుఁ దగు - తీర్పులు తీర్చి
మంగళ గీత మి-మ్మడి పాడి యభిన ౧౮౫
యము చేసి భావ మిం-పారంగఁ దెలిపి
నాట్యంబు నృత్యంబు-నం జూపి తుదిని

1 రూపక, ఝంప, త్రిపుట, అట, ఏక తాళములు. ఇవి రూఢిలోనున్నవి.
2 అతీతము, అనాగతము, సమము, విషమము.

## ౩. రంగారోహణము

ఏక తాళమున ము-గించి యా రీతి
పంచ తాళముల ప్ర-బంధ మార్గమున
దేశిని చూపిన - తెలుఁగున మార్గి

నృత్యంబు నృత్తంబు - నెత్తి మర్త్యమున
నేక తాళము తుది-యైన వైశాఖ
స్థితి యందు యాడి పూ-ర్తిగఁ జేసి పిదప
నపరంజి విరిగొమ్మ - యాడిన పోల్కిఁ
దాండవ నాట్య నృత్తంబులు మూట

సభ్యులఁ బారవ-శ్యము నొందఁ జేసి
[1] విషయాది వైశిష్ట్య - విధులు పద్నాల్గు
తెలుఁగువడ నటించి - తెల్పెను గాన
నాట పాటల తోడ - నంప చందముల
కర్త్మహా పగిది నా-ట్యము చేసె ననుచుఁ

పార్థివుఁ డచ్చెరు-పడి రంగమందు
తల కొలి యను బిరు-దంబు నొసంగి
పచ్చల మాలతోఁ - బదినూర్ల నెన్మి
[2] వరతప్పు నైన బం-గపు టంకములను
బహుమతిగ నొసంగి - బహుగౌరవించె

---

1 విషయము, యోని, వృత్తి, సంధి, రసము, జాతి, సత్త్వము
శము, అభినయము, పాస్క-, వాక్చాతుర్యము, పద్ధతి, జాతీయము, తాం

2 అపరతప్పుకు 'పెళంజు' అని పేరు.

మరకత మాలనే - మనుజుండు వేయి
నెనిమిది టంకమ్ము - లిమ్ముల నొసఁగి
వైకొని మాధవి - కంఠమందుంచు
నతఁడపో మాధవి - కగు భర్త యనుచు
నొక చేటిచే నిచ్చి - యొగి ధనులున్న ౨౧౦
వాడలో నిలుపఁ గో-వలుఁ డది కొనుచు
వెలఁదితో మాధవి-పెండిలి యిల్లు
చొచ్చి దానిం గూడి - చొక్కుచు నామె
వలలోనఁ బడి మతి - పరటి కృశింప
శ్రీనిలయం బగు - గృహమును మఱచె ౨౧౫
పతిరత యగు తన - పత్నిని మఱచె.

౦॥ అలినీలాలక మాధవీ గణిక సమ్యగ్గీత సాహిత్య డో
లల రాజస్వుని తత్సభాసదుల నోలం గొట్టి యాడించి మె
ప్పుల నొందెం బదునొండు నాట్యముల సంపూర్ణాదిరాగంబులన్
లలితామోదక వాక్కులన్ జగములెల్ల న్మెచ్చ రంగమ్మునన్.

---

## ४. సాయం మహిమ

ంజరి॥ కరచాలనమున జ-గంబుల నేలఁ
గల చక్రవర్తియుఁ - గానంగ రాఁడు
చల్లని కరముల - చంద్రకుమారుఁ
డెచ్చట నున్నాఁడొ - యెఱుఁగంగ రాఁడు
యను చింత వలనఁ ది-శాంచిత ముఖము ౫

విన్నన గౌనఁ గల్వ - కన్నుల నీరు
జాఱంగ నొడలెల్ల - శైత్యంబు గ్రమ్మఁ
గడలి చేల పడంతి - కాంతుని గనక
పదిఁ గలంగుచు నున్న - యదనున యందు
పన్నులు చెల్లించు - ప్రజలు దుఃఖింపఁ ౧౦
బన్ను చెల్లింపని - ప్రజల లోఁగొనుచు
రాజ్యంబు నడపని - రాజు లేనదనఁ
జిన చిన్న మన్నీలు - శిరముల నెత్తు
పగిదిఁ బ్రోషితలు నె-వ్వఁగ యెక్కుడొందఁ
బ్రియులఁ గూడిన చెలుల్ - ప్రీతి వహింపఁ ౧౫
బిల్లనఁ గ్రోవుల - మొల్లలయందు
వల్లవు లళులు రా-వం బొనరింపఁ
దుమ్మెదలం బాఱఁ - దోలి మొగ్గలను
వగరు తావిని పిల్ల - వాయువుల్ దెచ్చి
వీథుల యందెల్ల - విరఁజిమ్ముచుండఁ ౨౦
దెఱవ లందపు మణి-దీపంబు లెత్త
నప్పట్టనమున సా-యంవేళ వచ్చె
పిన్న లయ్యును శత్రు-వీరుల నడఁప
వలఁతులౌ పాండ్యుల - కులపెద్ద యగుట
లానైన మింటఁ - చెల్లని బిల్ల దోఁప ౨౫
సంజ దోసము దూల్చి - సౌరైన పాల
పంటి కరంబులఁ - బరపి నక్షత్ర

రాజ్య మేలిన నిబ్బ-రపుఁ గీర్తియందు
పెరటిలోఁ బెరిఁగిన - విరజాజి మల్లె
మొల్ల విరుల పాను-పున యందు వలుఁద
పిఱుఁదుల మొలనూలు - ప్రిదులుచుఁ జెదరఁ
పండు వెన్నెల జన్మ-ఫలమందు పొడవు
మేడపైఁ బ్రియునకు - మే న్మె లనంగఁ
గలయిక యెడయిక - యలుకయు నొసఁగి
యెదురఁ జెదరు నలం-కృతి సవరించు
కొనుచు మాధవి పెను - కుతుకాన నుంద
తొలిదెసఁ బుట్టిన - పూపంబు తోడ
చలి దెస పులకండ-ములఁ దొలఁగించి
చలిమలఁ దోఁచిన - పంచన శిలను
వలమలఁ బొడమి శ్రీ - వాసించు గంధ
కజ్జతోఁ దీసిన - కలపంబు నలఁది
[1] లేఁదూండ్లు తమ్ముల - పూదళములను
తెల్లని కలువలు - నల్ల కల్వలను
చివురులు ముత్యాల - చేరులు గంధ
వాడి చింది కలిసిన - పూల పానుపున
మందమారుతము చే-మలఁగి విరాళి
పొంగారఁ బ్రియుల తొ-మ్ముల వ్రాలి సురత

---

1 చలికాలమున చందనము వీడి అగురు పొగ నిచ్చగించుటయు వ
కాలమున పొగ వీడి చందన చర్చ నిచ్చగించుటయు నాచారము.

సుఖమునఁ జెలువలు - చొక్కుచు నుండ
రంగారు కాళ్ళు పా-రాణిని వీడఁ
గటియు జీరాడు మే-ఖలఁ దొలఁగింప ౧౦

చెలువారు మోమును - చెమ్మట లీఁగఁ
గడు వాలుఁగన్నులు - కాటుక మఱపఁ
దీరైన ఫాలంబు - తిలకంబు జార్ప
సౌరైన కురుళముల్ - సంస్కృతి నీఁగఁ
గుచతటంబులును గుం-కుమ పూఁత మాన ౧౫

తాళి బొట్టుం దక్కఁ - దక్క కై సేఁత
లొల్లక కమ్మల - నొగి ధరింపమిని
చెలువంబు చెడు వట్టి - చెవులతోఁ జేష్ట
చెన్ను వేడుకలేక - కన్నగియుండె
బ్రియు లెడఁబాయఁగా - వెగడొందు చెలులు ౨౦

కనువారి కన్నులు - కన్నీరు కార్ప
నూఁదు క్రోవులన ని-ట్టూర్పులతోడ
ముడిఁగి వెన్నెల బయల్ - విడిచి హేమంత
మునకుఁ దగిన చోట్ల - ముసుకొని యుండి
తెమ్మెర వెన్నెల - తెలియరాకుండ ౨౫

జాల కట్టుల మూసి - స్తనముల మీఁదఁ
గలప మలందక - కంటసరంబు
లొల్లక పూఁబాను - పొల్లక పుంజుఁ

బెసఁగిన తెలిపిట్ట - పెట్ట విదుర్చ
కడుపున క్రింది యాఁ-కలఁ జేర్చి కూర్చు
పొప్పపై మై వ్రాల్చి - పవ్వళింపకయుఁ
బ్రియులతో నెయ్యంపుఁ - బెలుచ వహించు
నెడఁ బోలె ముత్తెమ్ము - లెగఁజిమ్మి చెవుల
నున్న కుండలముల - నూడ్చి కలంగ
కున్న యుల్లంబుల - నుడికించి కన్ను
దెఱువు చేసి మరల్చి - కొఱఁతల నెంచి
కడలేని చింతతోఁ - గన్నీరు కార్ప
సంచనడక లల్లి - యగరు గందమ్ము
తేనె తావుల తమ్మి - తేట మొగమ్ము
కప్పు టిసుక కురుల్-గల కొల నింతి
మధువాని తేంట్లు స-మ్మతిఁ బాడుచుండ
నవురైన కువలయ - నయనమ్ము లార్ప
పులుఁగుల రొదలను - మురజమ్ము తోడ
జెక్కల నార్చుచుఁ - గుక్కుటమ్ములును
సంకు పుర్వులు నూరి - జనముల లేపఁ
దెఱసంజ నుండియుఁ - దెలవాఱు వఱకు
క్షణమైన నిద్రకుఁ - జనక పూవిల్తుఁ
డిక్షు శరాసన - మ్మెసఁగ ధరించి
తిరుగుచుండుటచేతఁ - బురమెల్ల నపుడు
మేటి రక్షణముచే - మించి వెలింగె.

ఉ॥ కూడిన వారికెం జలువ గూరిచి కూడని వారి పాలికిన్
వేఁడిమి గూర్చి సత్ప్రభుని వెల్లని యెల్లనిపోతె నొప్పి రే
ఱేఁడు జగంబులెల్ల నలరించి కుమార్గులఁ దూల్చి కోవలుం
గూడిన చెల్వకుం గెలివి కూడని కన్నగి కిచ్చెఁ దాపమున్.

---

## ఇంద్రోత్సవము

మంజరి॥ కడలి చేలము దొడ్డ - కరువ గుబ్బలును
ఏఱును ముత్యాల - పేరును మొగులు
కురులు గలుగు నేల - కొమ్మ మై మీఁదఁ
గప్పిన చీఁకటి - దుప్పటి వీడ్చి
విశ్వంబు వెలిఁగించు - వేఁడి వెలుంగు
తూరుపుఁ గొండపైఁ - దోఁచి దీర్ఘముగ
విరిసిన కరముల - వెరవారఁ బరపె
సోవరుల్ కైసేఁత - యొప్పారు గదులు
హరిణాక్షములగు గ-వాక్షముల్ గలుగు
మేడలు మొగసల - మెడయెత్తి కాంచు
కన్నుల నవలికే - గఁగ నీక యాఁపు
నట్టి సుందరములౌ - [1] యవనుల యిండ్లు
కలము లొసంగెడి - ఫలముల వలనఁ

1 యవనులు = ఈజిప్టు, గ్రీసు మొదలగు దేశములనుండి వచ్చిన వ[ర్తకు]
లని వ్యాఖ్య.

దము జన్మభూమి వ-దలి వచ్చు నితర
దేశీయులగు జనుల్ - తివిరి పెక్కండ్రు ౧౫

కలిసి వసించు సా-గర తీర భూమి
యద్దకంబును సున్న - మగురు చందనము
విరులు గందవొడియు - విలిచెడి వారు
తిరిగెడి నగర వీ-థియుఁ బట్టు తోడ
సున్నితో నూలితో - నొగి నేఁత నేయు ౨౦

సాలీండ్ర వీదియుఁ - జందన మగురు
పవడముల్ ముత్తెముల్ - బంగారు మణులు
రాసులు పోసిన - రమణీయ వీథి
కాయధాన్యమ్ములు - [1] కలమ ధాన్యములు
రాసులు రాసులై - రాజిల్లు వీథి ౨౫

అప్పమ్ము లమ్ము వా - రుప్పమ్ము వారు
మధు వమ్ము వారు త-మల పాకు లమ్ము
వారలు పిట్టమ్ము - వారలు చేఁప
లమ్మెడివారు దా-రమ్ముల నమ్ము
వారలు మఱి [2] పంచ-వాసమ్ము లమ్ము ౩౦

వారలు నే యమ్ము - వారలు నూనె

---

1 కలమములు 8 విధములు: వడ్లు, రాగులు, ఆరుకలు, కొఱ్ఱలు, చామలు, ...లు, వెదురు వడ్లు, ఎఱ్ఱవడ్లు.

2 పంచవాసములు = లవంగము, కుంకుమ పూవు, పచ్చ కప్పురము, జాజి ..., ఏలకులు.

దాసీ జనమ్ము వా - ద్యములఁ గోవిదులు
వైతాళికులు రాయ - బారులు వేఁట
కాండ్రు రథులు మావ - టీండ్రు సారథులు
సేనాధిపతులు వ - సించు వేశ్మములు
పండితుల్ నిండిన - పాఠశాలలును
పొనరి చెన్నైన ప - ట్టన భాగ మమర
ప్రభువరు లిరుపుర - ప్రథన తలమ్ము
వలె నున్న యారెండు - పాయల నడుము
కొమరైన తోఁట ప్రాఁ - కులె కంబములుగఁ
గట్టంగఁ బడిన యం - గళ్లతో నొప్పి
కొనువారి సందడి - కొఱవడకున్న
తేపటి యంగళ్లు - మాప టంగళ్లు
గలిగినచోటఁ ద - గరు నెలఁ జిత్రఁ
జంద్రుండు కూడిన - ససి దినమందు
జయశాలి ముచికుంద - జనపతి కొనరు
నంకిలి తొలఁగ శు - భావలి చెలఁగ
నింద్రు ప్రేరణమున - నింపుమై వచ్చి
పూజలు గొను కాఁపు - భూతంబు గుడికి
వాకిట నొప్పారు - బలి పీఠమందు
గుగ్గిళ్లు పొంగలి - క్రొవ్వు టన్నంబు
భక్ష్యముల్ పూలు ధూ - పమ్ములు నుంచి
కేలు గూర్చు కొనుచు - గిర గిరఁ దిరిగి

ఖడ్గంబు గొడుగు మం - గళ లగ్నమందు
పయనింపఁజేసి యా - పలుసన్నైన
శత్రులఁ గొంతు నణ - సంతోష మదరఁ
గుల దేవతకు మ్రొక్కి - గురుసేనతోడ
నుత్తర దిశకుఁ దా - నెత్తిన నాఁడు
ఆవలఁ జననీక - యరివోలె నడ్డు
పఱచిన యాహిమ - పచ్ఛిఖరమునఁ
దన పులి పడగ నం - దము మీఱ నిల్పి
మరలిన యాచోళ - మహిపాలకునకు
వజ్రదేశాధ్యుఁ డు - పదగా నొసంగు
ముత్యాల చవికయుఁ - బూర్వ విరోధ
భావంబునం బోరి - పరువు గోల్పడుచు
నరిగా నొసంగు వి - ద్యా మండపమును
మిత్రుఁడైన యవంతి - మేదినీశ్వరుఁడు
గారవించి యొసంగు - తోరణ పంక్తి
పొన్నున మణితతి - పొదిగిన వైన
మేటి శిల్పులకు ని - ర్మింపంగ నరిది
యైనవి పరపీడ - నడఁగించు కొఱకు
వారి పూర్వులు సాయ - పడిన హేతువున
ప్రతిఫలముగ మయ - బ్రహ్మ నిర్మించి
యొసఁగిన యమ్మాఁడు - నొక్కచోఁజేరి
తరమిడ రాని పె - ద్దఱికము తోడ

విలసిల్లుచున్న య - ప్పృథు మంటపమును
ద్రొక్కువారలు పేరు - గుఱుతుగ చెక్కి
కట్టిన వాకిండ్లు - గలధాన్యరాసు
లరుగంచె కోట తా - ళముల కావలియు
లేనివియై దొంగి - లించు వారొక్క
తటిఁ గల్గిరేని యా - ధాన్యంపుఁబొదుల
మెడలు ద్రుంగఁగఁ దల - మీఁద నెత్తించి
యూరెల్లఁ ద్రిప్పించి - యొసఁగున పగటి
నెద దొంగతనము పే - రెంచినన్నైన
వణఁకు పుట్టించు స - భా మండపమును
గూనులు మూఁగలు - గుజ్జులు దీర్ఘ
వ్యాధులఁ గృశియించు - వారు దుర్బలులు
మునిఁగిన మాత్రానఁ - బూర్వదోషములు
తొలఁగ మేల్ రూపంబు - ద్రోఁపంగలేచి
వలగొని భక్తితో - వచ్చి కూర్చుండు
దివ్య మంగళ కర - తీర్థ మంటపము
వరులిచ్చినది తిని - వచ్చిన పిచ్చి
గలవారు సంజాని - ద్రానెడివారు
క్రూర సర్పము కాటు - గొన్నవారలును
దయ్య మావేశింపఁ - దల విరియంగ
నుగ్ర దృష్టులఁ జూచి - యురియాడువారు
సేవించి యొక ప్రద - క్షిణము సేయుటను

రావళ్లఁ దొలఁగించు - జాతి మండపము
దొంగ తపసి రూపు - తొడిగిన వారు
పతులను కికురించి - పరుగాడు సతులు
పరకాంతలను గోరు - పాప శీలురును
లోనఁ గుట్రలు సేయు - లుబ్ధ మంత్రులును
తప్పు సాక్ష్యము లాడు - దబ్బఱకాండ్రు
కొండియములు పల్కు - కుత్సిత మతులు
నాచేతి పాశంబు - నం జిక్కు వార
లని పట్టనము చుట్టు - నామడల్ నాల్గు
వినఁబడు నట్లుగాఁ - బెద్ద గొంతెత్తి
యఱచి యవ్విధము సే - యఁగఁబూను వారి
బంధించి పొరలించి - వాతఁబెట్టు కొను
భూతమ్ము వసియించు - పురి చదుకమున
నరపతి దండంబు - పొరపాటు గొన్నఁ
బ్రభుధర్మ సభఁ బక్ష - పాతంబు గొన్నఁ
గన్నుల బాష్పముల్ - గార్చు విచిత్ర
ప్రతిమ యొప్పారిన - భవ్య మండపము
పెద్దవారలచేత - వినుతింపఁ బడిన
యైదు మండపముల - నర్చనల్ సేసి
మఘవు గుడిం గల్గు - మంగళభేరి
దంతిపై నుంచి చా - దంతి యున్నట్టి

గుడికేగి పండువు - తొడఁకుప తుదియుఁ
వెలిపి కల్పిత మున్న - దేవళంబునకు
ముంగిలి కడ నష్ట - మంగళ యుక్తి
వాద్యగోష్ఠి చెలంగ - ధ్వజము నెత్తించి ౧౬౫
పగడపుఁ గంబముల్ - పరఁగంగ నిలిపి

మరకతములు వజ్ర - మణులు పొదిగిన
యడుసు పలక నిల్పు - హైమ వేదికలు
గల మేడ వాకిండ్ల - కడలఁ బొంబొన్ను
తసరు దంతములు ము - త్యాల జాలరులు ౧౭౦
మకర తోరణములు - మలయు బంగారు

పూర్ణ కుంభములును - మొలక పాలికలు
ప్రతిమల చేతి దీ - పములు విచిత్ర
కేతనములును రా - గిలు చామరములు
విలసిల్లి విరివారు - వీథుల నిండి ౧౭౫
అవనిప సుతులు సం - చాయమ్ముతోడ

రా వణిక్సుతులు తు - రంగ మదేభ
జవనాశ్వయుత రథ - చయముపై నెక్కి
సహృదయులై కూడి - చనుదెంచి యచట
రాజును విజయ వా - గ్రాజి నుతించి ౧౮౦
వేయు నెన్మండ్రు రా - ద్వీభుల మస్తముల
మోయించి తెచ్చిన - పుష్ప ధాతువులు
నిండిన కావేరి - నీరంబు హేమ

ఘటములతోఁ గొని - కడు భక్తితోడ
ఘూచరుల్ విశ్రాంతిఁ - బొందుచుఁ జూడ ౧౮౫
ఖేచరుల్ వెఱ గంది - కిట్టి వీక్షింప
వేల్పుల యెకిమీని - వెలయ నీరార్చి
యభవు నాలయము ష - డాస నాలయము
బలదేవు కోవెల - జలజాక్షు గుడియు
నద్రి భంజను గుడి - యగు వాని యంటు ౧౯౦
వేదోక్తముగ హోమ - విధులు వర్తింప
[1] నాలుగు తెగలైన - నాకుల [2] పదియు
నెనిమిది తెగలగు - నీడ్య దేవతల
కరమర్థి మఱి గల్గు - గ్రామ దేవతల
యుత్సవమ్ము లడరి - యొక వంక నడవ ౧౯౫
అర్హులు బుద్ధులు - నలరు నూళ్లందు
ధర్మ సంస్థాపన - తనరు శాలలును
పురి వెలుపలి గుళ్లు - పుణ్యస్థలములు
ధర్మవిదులు ధర్మ - తత్త్వంబు దెలుపు
నుపదేశ వాక్యంబు - లొక వంకఁ జెలఁగ ౨౦౦
తేరెక్కి రాజు బం - ధింపించి యుంచు
శత్రురాజన్యుల - చరణ శృంఖలల

---

1. వసువులు 8, ఆదిత్యులు 12, రుద్రులు 11, మరుత్తులుచేరి 33. 2. దేవ ముని కిన్నర కింపురుష గరుడ యక్ష రాక్షస గంధర్వ సిద్ధ చారణ విద్యాధర భూత భేతాళ తారాగణ ఖేచర భోగభూవాసులు.

౩. ఇంద్రోత్సవము

వదలింపఁడని యొక – వంక వాద్రువ్వ
గాయకుల్ వాదన – కాండ్రాట కాండ్రు
నాట వెలందులు – నాడుచుఁ బాడు
సంగీత మొకవంక – జనుల లోఁగొనఁగ
వాద్యముల్ రేయుయుఁ – బవలును కనుల
మూయక సర్వదా – మొరయుచు నుండు
పెద్ద వీడుల పిన – పిన్న వీధులను
ఉత్సవంబుల మోద – ముబ్బ గొనంగఁ
పొగడొందిన విశాల – నగరమ్ము నందు
విరహ వ్యథయె లేక – వేడ్కమై నొప్పు
మాధవితో నింటి – మల్లె మొల్లలను
విరజాజులను తోట్ల – వికసించి నట్టి
కలువలు చెంగలు – వలు పూర్చి కట్టు
మాలలతోఁ గాను – పుష్పంబు ద్రావి
పూఁదోఁటలోఁ బ్రేమ – బొంపిరి వోవ
విహరింప నెంచి తే – ద్దుఘుఁడు కోవలుఁడు
హాటమైన జేపటి – యంగడి వీథిఁ
బూల యంగళ్ళలోఁ – బొంచు తావులను
అగురు ధూపము గంధ – మతిశయ మంద
నగుచు నాటాడు జ – నమ్ముల తోడ
సరసమ్ము లాడుచు – షడ్జమ్ము నందు
పాడు గాయకులతోఁ – బల్లవ జనము

తో వీథిఁ దిరుగాడు - కోవలుఁ బోలెఁ —౨౨ః

పంచమస్వరమునఁ - బాడు తుమ్మెదల
తోడ వసంతుని - తోడను పంప
పవనమ్ము వీచు స - వ్వరవీథియందు
జలధరమును మోచి - శశమును వదలి
రెండుప్రక్కల రెండు - గండు పక్కియల —౨౩౦

నడుమను నువుఁబూవు - నడరంగ వ్రాసి
కొని యాకసంబునఁ - గ్రూర సర్పంపుఁ
బగ గలదని జంకి - పద్మ విరోధి
పుడమిపైఁ దిరుగంగఁ - బోలు ననంగ
అబ్జుఁడ౯ బాలమున - నమృతమ్మువోసి —౨౩ః

కాముండు పెంచు నా - కాశవల్లి యన
గొప్ప భూపతులకు - గుప్ప సంపదలను
చూపంగ లక్ష్మి యీ - సుందర పురము
చేరిన దనుచు యో - చించి మోదుగును
మొల్లల మజీ రెండు - నల్ల గల్వలను —౨౪౦

నువ్వుఁ బువ్వును చేకొ - నుచు మాఱు వేస
మూని నెచ్చెలి పోక - కుమ్మల మంది
నెమకుచుఁ దిరుగాడు - నీరేజ మనఁగ
ప్రభుశాసనము దాఁట - రామికి జంకి
జగతి జీవులఁ జంపు - సమవర్తి పురుష —౨౪ః

వేషము మార్చి స్వ - వృత్తి వీడకయ

సిగ్గరి వేసమ్మొ - చిఱు నగుమొగము
వీణను బోలు నిం - పితపుఁ బల్కులును
తెలవ తనం బొంది - తిరుగుచుండె నన
మదనుని పెనుసేన - మార సంగరము ౨౫౦

నొనరించి యెదు రొడ్డి - పెనఁగంగఁ దాము
వ్రాసిన యవి తమ - వక్షమ్మొ లందు
ముద్రలు గొన్న య - మ్మొనగాండ్ర తోడ
వసియించి ప్రేమ సే - వలు సేయు సతుల
యందంపు మోముల - యందలి నల్ల ౨౫౫

కల్వల నోర్చిన - కన్నుల కొనల
జేగు ఱావిందుచే - నీఁగమి నింక
నీ భూమి యెల్ల మం - దీయంగఁ గలదె ?
యనుచు వ్రాన్పడి ప్రియు - లదరుచు నుండు
హర్యుత్సవంబు మ - ధ్యం దినమందు ౨౬౦

గంధ ధాతువులు లోఁ - గలవి వెల్వడఁగఁ
గదలు కల్వలఁ బోలు - కన్నగి కనులు
మాధవి కనులు క్ర - మంబున దిటవు
చెడ నీరముం గార్చి - యెడమయుఁ గుడియు
మోద విమోదముల్ - పొందంగ నదరె. ౨౬౫

---

## ౬. సముద్ర స్నానము

హరుగిరి మీఁద ను - త్తర దిశఁ గలుగు
విద్యాధర పురంబు - వెలుపల నుండు
పూఁదోఁటయందు కా - మున కర్చనంబు
పొలఁతితోఁగూడి స - ల్పుచు నుండినట్టి
విద్యాధరాన్వయ - వీరుఁ డొక్కరుఁడు ౫
దక్షిణ దిశయందు - తనరు కావేరి
పూపట్టనంబునఁ - బొలుపారఁ జలువు
నింద్రోత్సవంబునం - దిది తొలి దినము
దైత్యులు గుంపులై - దఱిసి యెదిర్చి
పురుహూతు పురమును - పులిఁ బోలెఁగాచు ౧౦
ముచికుందుతోఁ బోరి - ముమ్మరముగను
వంచనచేసి వి - భ్రాంతి గల్గింప
దానిఁ బోకార్చు [1] భూ - తం బింద్రునాజ్ఞ
ముచికుంద నగరానఁ - బూజలు గొనుచు
నెలకొని యున్నట్టి - నెలవున నున్న ౧౫

---

1. గరుడుఁ డమృతమును గొనిపోయినపుడు దానిని మరలఁ దెచ్చువఱ
నగరమును కాచు వారెవరని యింద్రుఁడు యోచించి ముచికుందుని పిలిపించి,
అతని కొక భూతమును సాయముగా నిలిపి వెడల నవ్వేళ నసురు లనేకులు వచ్చి
యుద్ధముచేసి యంధకారాస్త్రముచే ముచికుందుని కలఁతపఱుప నా భూతము
చీఁకటిం దొలఁగించె. అతఁ డసురులఁ దఱిమె. అవ్వల నింద్రుఁడరుదెంచి జరి
గిన దరసి యా భూతము నతని పురమగు పుగాఱును కాచియుండ నియమించె.

ప్రేపు టంగళ్లొప్పు - పెరిమఁ గాంచెదము
అసురుల వలన ము - న్నైన యుపద్ర
వంబులఁ దొలఁగించి - పాకారిఁ గాచు
పనికి ఫలమ్ముగా - వాసవుఁ డొసఁగఁ
జోళుల పూర్వ భూ - పాలుని వలన
భూమికిఁ దేఁబడి - పొలుచు ననర్ఘ
మణి నిర్మిత మపార - మహిమాన్వితంబు
లైన మండపముల - నైదింటిఁ గాంత
మట నారదుండు మ - హతి నింపు గులుక
వాయింప సంయుత - పద్ధతి మేళ
గత్తె గీతము పాడఁ - గా నింద్రు[illegible]
నిండార నూర్వశి - నృత్యంబు సేయ
లేదు గావున నెల్ల - లేఖులు వినుఁగు
చెంద [1] వీణ శుభంబు - చెడి భువిఁ బుట్టుఁ
గాక యూర్వశియు భూ - కామిని యగుచు

---

1. ఒకానొక తఱి నగస్త్యుఁ డింద్రసభకు రాఁగా నింద్రుఁడు వేడుక
టతోడ నూర్వశి నాట్యంబు సేయుఁగాక యనియె. అపు డింద్రుని కొడు
యంతుఁడు మరులుగొని యెదురుపడ నూర్వశియు వాఁడును పరస్పరము కాం
మించుటచే నామె యాటపాట తప్పె. దానితో వాద్యములు క్రమము తప్పె
ది యింద్రునకెఱిఁగింపఁగోరి నారదుఁడు తన వీణపై శత్రు (మూడవ, ఆఱు
స్వరము పలికించె. అది యంతయు నెఱింగిన యింద్రుఁడు నారదువీణ భూమి
ణాపీఠముగాఁ బుట్టునట్లును ఊర్వశి మనుజజన్మ మెత్తునట్లును జయంతుఁ
దురై పుట్టునట్లును శపించి, వారివేఁడి కోలున ముక్తియు ననుగ్రహించె.

జనియించుఁ గాకని - శపియించె నింద్రుఁ
డట్లౌట సూర్వశి - యన్వయ మందు
పుట్టిన మాధవి - పొలుపైన యాట
జరుగఁ గాంతము శచీ - జానిఁ బూజింత
మరుదేరుదమ సతీ! - యని బైలుదేఱి
హిమవంతమును వేల్పు - టేఱు సుజ్జయిని
వింధ్యశైలంబును - వేంకటాచలము
కావేరి పాఱఁగాఁ - గనుల పండువుగఁ
బంటలతో నిండి - పాల్వొంగు చుండు
చోళదేశంబును - చూపి యామీఁదఁ
బూల తోఁటలతోడఁ - బొలుపారు చుండు
సంగమస్థలిఁ జేరి - సరవిగ నింద్రు
నుత్సవంబును తన - యువిదకుఁ జూపి
తానుఁ గాంచుచు నుండెఁ - దత్పర మతిని
పద్మాక్షు నుతి చతు - ర్వర్ణ భూతముల
స్తుతియు మహౌషధీ - శుని వినుతియును
క్రమముగాఁజేసి ల - క్షణ యుక్తముగను
భైరవి యాడిన - భారతీ రంగ
మను శ్మశానంబున - యందు వేలుపులు
వినుతింప బడబాగ్ని - మొనయందు గలుగు
వైష్ణవాస్త్రమ్మునఁ - బట్టణ త్రయముఁ
గాల్చిన బూదిపైఁ - గాళి దావంక

నిలిచి కేల్దట్టుచు - నియమిత గతులఁ
దాళంబు వైవ భూ - త గణాధి నేత
యాడిన లోక భ - యద తాండవంబు ౨౫
భవుని సారథియైన - పరమేష్ఠి యెదుట
భారతి యాడిన - పాండరంగంబు
కంసు వంచనము నొ - క్కట నడంపంగ
హరి యాడినట్టి యా - యల్లి నృత్యంబు
బాణుని గెల్చిన - పట్టునఁ జక్రి ౬౦
తెల్లంబుగా నాడు - మల్ల నృత్యంబు
కంధి తరంగ రం - గమ్మునఁ దాఁకు
నసురు గెల్చిన కందుఁ - డాడు ధక్కాట
దైత్యు లాయుధము లె - త్తఁగ నీక చేయ
గొడుగును విప్పి యా - గుహుఁడు మున్నుంచు ౬౫
కొని వారి యెదుట నా - డిన గొడుగాట
మురవైరి బాణుని - పురవీథిఁ జనిన
తఱినాడు భాండ నృ - త్యంబును మఱియు
వెడవింటి వాఁడాఁడు - వేసంబు నూని
వేడుక నాడిన - పేడి యాటయును ౭౦
కినుక దైత్యు లొనర్చు - కికురు చేఁతలను
సైఁపక శాంభవి - సమర రంగమున
నాడిన మరగాళ్ల - యాటయు మఱియు

నసురుల యౌద్ధత్య - మడఁచి విభ్రమము
గలిగింప లక్ష్మి చ - క్కని బొమ్మ యగుచుఁ

బొలుపొంద నాడిన - బొమ్మ యాటయును
బాణుని యుత్తర - ద్వారంపు బయలఁ
గాఁపు పడఁతి వాల - కమున నింద్రాణి
కడఁకమై నాడిన - కాఁపుల యాట
తత్తదుచిత వేష - ధారణ మందు

పలుకులయందు స్వ - భావంబు నందు
ఆటలయందును - పాటలయందు
నిలిచి యెఱిగి పడి - నృత్యంబు సేఁత
లం దెల్లవార లౌ - ననఁ బాడి యాడు
[1] పదు నొకం డాటల - వహి గొంతు గాక

నాఁడు పూఁదోఁటలో - నర్మిలి నీకు
నెఱిఁగించు మాధవి - యిదె కాంచు మంచుఁ
దన పడంతుకకు వి - ద్యాధర వరుఁడు
చూపి తానును గాంచి - చొక్కుచు నుండె
ఇతరు లెఱుఁగు నట్టి - వితమున వేల్పు

---

1. పదునొకండాటలలో మహాదేవు రెండాటలు మొదటను తరువాత వెన్ను రెండాటలు, స్కంధునివి రెండు, విజయముకై యాడినపిదపఁ గామముచేఁ జె వడిన యనిరుద్ధుని విడిపింప వెన్నుఁడాడిన వినోద నటనములు, తరువాత కాము పేడియాట, దుర్గ లక్ష్మి యాడినవి క్రమముగా వచ్చినవి. ఇందు నిలిచి యాడు నవి ౬. పడియాడునవి ౫.

## ౬ సముద్ర స్నానము

లింపారఁ గనుచుండ - నింద్రోత్సవంబు
మాధవి వేసాల - మార్పు లాటలును
పాటలు ముగియుడు - భవసంబు చేరి
కోవలు వెగటు పోఁ - గొట్టఁ దలంచి
గంధాష్టకంబు సు-గంధ షట్కంబు
వగరుల తెగ లొక్క - పది విత్తులైదు
తెగలు ముప్పది రెండు - తెగల మూలికలు
నాన్చి కాఁచిన నీట - నలువుగఁ దావి
తైలమంటికొని తీ - ర్థం బాడి తేమ
యగురు ధూపము తోడ - నాఱిచి యైదు
పగుదుల మృగమద - పంక మలంది
లత్తుక పూసి వ్రే - ళ్లకు మట్టియలును
పిల్లాండ్లు వెట్టి యొ - ప్పిదముగఁ బాద
చాలకములు నూపు - రాలును పూన్చి
తొడలకు గుడిగిసి - తొడిగి జల్తారు
పావడ నీలంపుఁ - బయిఁట కుదిర్చి
విరి సిగ యను ముత్తె - పేరు పేరురము
నందు కంఠికతోఁ బ - సందుగాఁ బూన్చి
సందిలి దండలు - పొందుగాఁ గట్టి
రత్నాలు గల యప - రంజి గాజులును
పగడాలు జగడాలు - పరవు గాజులును
సన్నని పనిగల - సంకు గాజులును

మీను వాయి గలుగు - మెలిక యుంగరము
కెంపుటుంగరము ప - క్కియల విల్వంపు
గలిగి మెఱయు మర - కతపుఁదాకులును
గొలుసులు సన్నని - గొలుసులు సరడు
సరిపెనల్ మొదలైన - సరులు ముత్యాల
సరులతోడ నమర్చి - జవరన చేసి
కొక్కని ముత్యాల - కచ్చుల తోడ
మెడను వీఁపును మూసి - మిఱుమిట్లు గొలుపు
నింద్ర నీలమ్ముల - కింపారు నడుమఁ
జంద్రపాణి యను వ - జ్రమ్ముల మిగులఁ
జెక్కిన కమ్మలు - చెవుల ధరించి
పాపట బొట్టును - భాను చంద్రములఁ
బోలి పెంపారిన - పుల్లకములును
కుప్పెలు వేనలి - కుచ్చులు నాగ
పడగ మున్నగు మేలి - తొడవులఁ దాల్చి
కలయిక నెడయికఁ - గల సౌఖ్యములను
కోవలునకు నింపు - గూరఁ జూపుచును
తలిరుల సెజ్జ మా - ధవి చేరియుండి
పండుగ తుది నాఁడు - నిండు జాబిల్లి
పొడముడు నుత్సాహ - పూర్ణులై జనులు
కడలి నీరాడఁగా - వడిఁ జనుచుండ
తోయధి దరిఁ బూల - తోఁట వయ్యాళి

చనువేడ్క యిరువుర - మనములఁ బొడమఁ ౧౩౫
గొలఁకులలోఁ దామ - రలఁ బక్షి వితతి
వాయి విచ్చి విచిత్ర - భంగులఁ గూయఁ
గుక్కుట తతులు వే - కువను దెల్పంగ
దూరుపునం జుక్క - తోఁతెంచి యిరులఁ
దొలఁగింపఁ గాంచి కో - వలు తోడలేచి ౧౪౦
తగు నలంకృతులు చి - త్తము పొంగఁ దాల్చి
మేఘ హస్తుండను - మేటి యశమ్మొ
గొన్న యాతండొక్క - గుఱ్ఱమ్ము నెక్కఁ
గొల్లారు బండిలోఁ - గొమ్మ గూర్చుండి
మితిమీఱు సిరిగల - మేడల నిండు ౧౪౫
వీదుల నంగడి - వీదుల విరుల
సరులు కై సేసి పె - ల్చన దివ్వె లుంచి
పూలు గజిక వరి - మొలకలు చల్లి
నగల గల్లలలతో - మగువ లిట్టట్టు
తిరుగుచు నుంతు పె - న్దెరువులఁ గడచి ౧౫౦
ఉదధి యధిక ఫల - మొసఁగుట వలనఁ
బెంపొందు సంపదల్ - విలసిల్లుచుండు
మరువూరికి న్నడు - మన చని యచట
పడవ లొసంగు సం - పద లొందియున్న
పరదేశ జనులుండు - వాలుకావీథి ౧౫౫
ప్రకటన ఫలకముల్ - పరఁగుచు నుండు

ధాన్యాపణంబులు - తనరు వీథులును
వర్ణంబులును కల - పంబులు పూఁచు
సున్నంబు పెక్కువ - స్తువు లమ్మ వార
లెత్తిన దీపముల్ - హేమ కారకులు

పెట్టిన దివ్వెలు - పిట్టమ్మ వారి
జాణలి ప్రక్క దీ - పమ్ములు పెక్కు
వస్తువు లమ్మ చా - పల నేత్రలుంచు
దివ్వియలును పెక్కు - తెగల మత్స్యంబు
లమ్మెడి వారి ది - వ్యలు పడవలకు

రేవు చూపఁగఁ దేజ - రిల్లు దీపములు
దోనెలపై నుంచు - దొడ్డ దీపములు
భాషలు వేఱైన - పరదేశ జనము
పెట్టిన చిత్ర దీ - పికలును ధాన్య
కోష్ఠ రక్షకు లుంచు - కొన్న దీపములు

లెక్క యిడఁగ రాక - యెక్కడఁ జూడ
దీప మయంబుగాఁ - దేజరిల్లంగఁ
బిండి కలిపి నట్లు - విరిసి రహించు
సన్నని యిసుకపై - జాఱిన తెల్ల
యావగింజయుఁ దెల్ల - మరయంగఁ దగిన
స్థలమున జలజాత - ములు కంచెగాఁగ
వఱలిన క్షేత్రంబు - వలెఁ బొలుపారు
గేదఁగి కంచె గ - ల్గిన తీర భూమి

నొప్పారు తోఁటలో - నొగి నాటలాడు
తొయ్యలి కూటువ - తోఁ జేరి వారు ౧౮౦

సొరిది సొరిది గాఁగ - సొగసు పడంగ
నుంచిన శైలంబు - లొసఁగిన పంట
కడలి యొసఁగు పంట - కలిసి నిండారు
కలములు కదలు రే - వుల కడనున్న
వనముల యందు రా - ద్వరులు రాట్నుతులు ౧౮౫

వారి చుట్టములు వే - పారుల సుతులు
సతులతోఁ దత్సఖీ - జనముల తోడ
నాడెడి వారలు - పాడెడివారు
నిలిచిన చోట గుం - పులు గూడియున్న
చోటుల వారలఁ - జుట్టిన తెరయు ౧౯౦

మహిగాక యా స్వర్గ - మహిఁగూడఁ గీర్తి
కడుకొనఁ జేసిన - కరికాల చోళ
భూపతి నీరాట - పూర్ణిమ దినము
బహువిధ వేషముల్ - బహు కలకలము
గలిగి యాడిన మొక - గెలుపు దినంబు ౧౯౫

పోల్కిఁ గోలాహల - మునఁ బొలుపారఁ
గడలి గట్టుఁ బొడుచు - కావేరి సంగ
మస్థల మెల్లెడ - మనుజులు కాలు
నిలుప నెడము లేక - నిండిన నాల్గు
వన్నెల వారి దు - ర్భరమైన కలక ౨౦౦

ధాన్యాపణంబుల - దనరు వీథులను
పర్ణంబులను కల - పండ్లును పూలు
సున్నంబు పెక్కువ - స్తువు లమ్ము వారి
లెత్తిన దీపముల్ - హేమ కారకులు

పెట్టిన దివ్వెలు - పిట్టమ్ము వారి
బాణలి ప్రక్క దీ - పమ్ములు పెక్కు
వస్తువు లమ్ము వా - పల నేత్రయుంచు
దివ్వెయలను పెక్కు - తెగల మత్స్యంబు
లమ్మెడి వారి ది - వ్వెలు పడవలకు

రేవు చూపఁగఁ దేజ - రిల్లు దీపములు
దోనెలపై నుంచు - దొడ్డ దీపములు
భాషలు వేఱైన - పరదేశ జనము
పెట్టిన చిత్ర దీ - పికలును ధాన్య
కోష్ఠ రక్షకు లుంచు - కొన్ని దీపములు

లెక్క యిడఁగ రాక - యెక్కడఁ జూడ
దీప మయంబుగాఁ - దేజరిల్లంగఁ
బిండి కలిపి నట్లు - విరిసి రహించు
సన్నని యిసుకపై - జాఱిన తెల్లి
యావగింజయుఁ దెల్ల - మరయంగఁ దగిన
స్థలమున జలజాత - ములు కంచెగాఁగ
పఱిలిన క్షేత్రంబు - వలెఁ బొలుపారు
గేదఁగి కంచె గ - ల్గిన తీర భూమి

## ౭. తోట పాటలు

వ॥ చిత్రంపుఁ బనిగల చేల ముసుంగు దాల్చి సిగ నలరుల
తుఱిమి క్రొత్తపెండ్లి కూఁతుందోలె నలంకృతి నంది కఱ్ఱ గీ
ముడి నరము లను నాలుగు దోసంబులులేని వీణియను నమస్కా
పూర్వకంబుగఁ గై కొని [1]పగమిత్రము మున్నుగువాని నరసి లో వ్రే
వెలివ్రేల మీటి చూచి యారోహ ణావరోహణంబుల తీ రర
శ్రుతుల కనుశ్రుతులఁ జక్కఁ౦బఱచి యాలాపనంబుచేసి పాటకు
వగిన చందమునఁ దానము నడపి యింపుపుట్టించి గ్రామ మూర్
వల గరిమంబు వెలయించి యంగుళీకరణంబు సక్రమంబుగఁజూ
రాగదోషంబుల వర్జించి మరకత మణుల యుంగరంబులు తాల్చి
మృదువులగు వ్రేళ్ల రాగరసంబు చిలికించి కోవలుంగాంచి వీ
రాజ్ఞయిడుదానఁగాను. ఏ తాళమున పాడుట యని యెఱుఁగ వేఁ
వనని వీణ యందీయ నాతడు కొని కావేరిం బుగారుం గుఱియుం
కడలి యడవి ప్రాంతవాసుల జాతీయ గీతములఁ బాడఁదొడంగె.

॥ మాలిక దాల్చు నిండు నెలమాడ్కి వెలింగెడి ఛత్రమూను మా
చోళుఁడు దండము న్నడపి సూటిగ గంగను చేరబోవఁ గాం
. తాళము నొందవుల్ విసుఁగు దాలుప వయ్యది వాలుగంట్లకుల్
మేలి సతీత్వ భూషయని మీఱి సుఖింపుము నీవు కావిరీ.

॥ శూరుఁ డమోఘశాసనుఁడు చోళ నృపాలుఁడు మారరూపుఁడ
మ్మేరను దాఁటి ధీరతను మీఱి కుమారినిచేరఁ బోయినన్
పేరిమి కిన్కఁ నొందవది వీర సతీత్వ విలక్ష్మ మంత్రము కా
వేరి! సుఖింపు మమ్మ భువిఁ బెద్దల దీవనలంది నిచ్చలుల్.

1. శ్రుతికి నాల్గవ స్వరము మిత్రము, మూడవది ఆఱవది పగ.

॥ దున్నెడి కాఁపులు - దున్నల నెడ్ల న
దల్చు కోలాహల - ధ్వనుల బెరసి
చెవుల నెల్లప్పుడు - చెవుడు పఱచుచుండు
చెఱువు తూముల హోరు - మొరప మడరి
కూలంకషంబులౌ - క్రొత్త వెల్వలఁ గాంచు
బాలురకేకలఁ - బరిఢవిల్లి
దారి దోఁపిడి కాండ్ర - తీరున దొరకిన
వానిని గొని పాఱు - బహుళ రవము
వెలయ నతిశయించితివి కా - వేరి ! యట్లు
వఱలు చెన్నంగఁ గోట గా - వమికి హేతు
వైన వీరుల సమ్మర్ద - ధ్వాన మెలయు
చోళ సంపద గద ! నీవు - సుఖము గనుము.

॥ సారస నేత్రతో వరుణు సాక్షిగ నాడిన మాట పాడితో
జాఱిచినారలంచు ననఁజాలము గోలల మేము చంద్రముః
దారలఁ గాంచి సంకులని తారము లేయని సంభ్రమించి కా
సారము లెల్లఁ బూచు నెఱి సౌరగు నూరు పుగారు మాదగున్.

॥ వలపునఁ గాన్కలం గొనుచు వచ్చిరి వెన్కనె వార లిట్టు ల
స్యలవలె జాలి గొల్చ నిలుచుండుట గోలల మెట్లు కానఁగాఁ
గల మది స్త్రీల కన్నులకుఁ గంబు తరంగలఁ దోఁచు చంద్రుచే
నలరిన నల్ల కల్వలకు నంతర మారయలేక తేంట్లు సం
చలనము నొందుచుండు నెఱి సౌరగు నూరు పుగారు మాదగున్.

అలలకు వచ్చి శంఖచయ మచ్చటి బాలిక లాడ గీచు గీఁ
తలఁ జెఱుపంగ వారలు క్రుధం గొని యూడిచి వైచు నీలపుం
గలువలు సంజవేళఁ గడకన్నులకై వడిఁ గానరాఁగఁ గ
న్నులె యని నిల్చి చూచెడి జనుల్ గల మాపురమే పుగారగున్.

తెమ్మ గలట్టి యయ్యుసుక దిన్నెల శంఖకృముల్ పొనర్చు ప
ల్లమ్ములఁ బొన్న పుప్పొడి దళమ్ముగఁ గ్రమ్మిన యవ్వనమ్మునం
దమ్ములవైరి మండలమునం గల గండె లొనర్చు నొడ్డ వాం
త్రమ్మును వాడు వాఱిన స్తనమ్ములె తీర్పఁగఁ బోలు నియ్యెడన్.

పలలముఁ గ్రొవ్వుఁ గాంచి తినవచ్చెడి పక్షులఁ దోలఁ బూల రె
మ్మలఁ గొని తేంట్లు జుమ్మని ఝుమారముతో వడి తేవఁ ద్రోలు న
వ్వలనునఁ బూలఁ గుత్తి గొని వాసన నిండిన పూలతోఁటలో
పల నొక వేల్పుకన్నియ నవంతఁ జరించు టెఱుంగ నింతకున్.

ఈ పల్లెలో వల - వెండించు ముంగిళ్లఁ
బఱపిన పచ్చి చేఁ - పలను గావ
నలరుఁగొమ్మంగొని - వలసెన వేసంబు
ధరియించి కొలవృత్తి - మఱగినట్టి
బల్లెముం బోలిన - వాలుఁ గన్నులు గల
క్రొత్తయమ్ముఁడు వచ్చి - క్రుమ్మరు నని
తరఁగ తుంపురులచేఁ - దనుపారి యున్న యీ
విరిదోఁట యందు నే - నెఱుఁగ కుంటి
నెఱిఁగి యుండిన నిక్కువ - మిటకు రాను
వచ్చి వంతచేఁ గుందంగ - వలసె నిపుడు
చెలువుఁడా! చూచితే! మఱి - చిత్రరీతి
చూచి యెఱుఁగ నట్లుంటివో? - చూడకుందో? ౧౦

చ॥ కలఁక మఱుంగ మీను దుగ కార్ముకముఁ మొగులుఁ ధరించి య
ప్పొలపుల తేని చేష్టలను వారక కైకొని వచ్చు నిండువె
న్నెలగలమోము చందురుఁడౌ నిక్కముకాంచుఁడుమింటఁ బాము
నలుకున వచ్చి పక్కణము నందు వసించుచు నుండెఁ గాంచుఁడీ

చ॥ అల లరుదెంచి శంఖ వలయమ్ముల నార్వఁగఁ జేయ భీతి ని
ర్వలఁకులఁ బాఱఁ జూచు నెఱ వన్నియ చాఱల తోడి వాఁడి యీ
టెల వలె నొప్పు కన్నులు ఘటిల్లిన మృత్యువె బెస్తపల్లెలో
మెలఁత దనంబు నొంది కను మీటెడి నిక్కము దేరఁ గాంచుఁడీ

ఉ॥ ఎండెడి కంపుఁజేఁపలకు నేగెడి పక్షులఁ బాఱఁదోలుచుఁ
గొండొక తన్నుఁగాంచు జనకోటుల మానసముల్ కలంచుచుఁ
మిండల వేలుపో! సురల మెత్తయొ! యున్నది కాంచుఁడీవని
అండజయాన వాలకము నందిన దేవతయే! నిజమ్ముగఁ. ౧

చ॥ వనమున పుష్పజాలమున వాసిలు సైకత మందు నిల్చు కా
మినియు దొసంగు లేని తన మిస్సులు పీన కుచంబు లాస్య నో
ముని కుటిల భ్రువుఁ ములికి మోపిన విల్లు సలేఖ్యమై తటి
త్తున కెనవచ్చు కౌను నను తోరము సంకట పెట్టు చుండెడిఁ. ౧

చ॥ తరఁగలు తాఁకుగట్టు సికతాస్థలి విచ్చిన తావి పూవులుఁ
దరువులు నిండు తోఁటయు సుధా మధురోక్తులు నీలపుం గురు
ముఱవగు చంద్రబింబమును పోలిన మోమును గండుమీలఁ బో
మెఱవడి చూపులుఁ మదిని మిక్కిలి సంకట పెట్టు చుండెడిఁ

ఉ॥ తోయధి తీరముఁ విపుల తోఁట వికస్వర పుష్ప గుచ్ఛముల్
తోయలి యొంటిమైఁ దిరుగు తోయము మొక్కల లీలఁ గాన నొ
మాయని పండ్లు నిండు నెలమాడ్కిఁ బ్రకాశిలు మోము నెమ్మిమై
చాయయు లేవయస్సు గల చామ స్తనమ్ములు నఁ గలంచెడిఁ

మ॥ కడలిం జీవులఁ జంపి జీవనము వేడ్కం గాంత్రు నీయన్న లి
య్యెడ నాలోఁ గల జీవముం జదిపి హాయిం జీవికం బొంది తీ
వడఁగం బాఱక యుబ్బియున్న చనులో యత్యంతభారమ్ము లి
ట్లిడుమంగూర్పఁగృశించుమధ్యమునుతన్వీ! నీఁగుకోఁబోకుమీ

మ॥ చెడు నేత్రాల్గల జాలఁ బ్రాణివితతిం జెండాడు నీతండ్రి నీ
చెడు నేత్రాలను జాలఁ బ్రాణివితతిం జెండాడుచున్నావు నీ
మిడిమేలంబుగఁ దారహారములతో మిట్టాడు చందోయి చే
నెడరుంబూనె మెఱుంగుఁబోలు నడుమింతీ! నీఁగుకోఁబోకుమీ

మ॥ పడవల్ గైకొని జీవులం జదుపువార్ పద్మాక్షి నీవారు నె
వ్వడి వంపౌ కనుబొమ్మలం జదిపె దీవై నమ్మిన న్నీవు వే
వడియుం బేర్మియు నన్యులొందు నిడుమల్ భావింపకున్నావు
నడు మాచన్నుల మోవలేక నలియంగాఁ బాఱుటల్ కాంచవో

క॥ పగడంపు రోఁకలిం గొని
పగడంబులఁ బోలుకేలఁ - బటు ముత్తెములన్
వగ దంచు దాని కనుఁగవ
తొగలా ! యవికావు కావు - దుష్టము లౌరా ! ౨౦

క॥ అలలపయి నేఁగు హంసము
వలె గున్నగు పొన్ననీడ - వర్తించెడి యా
చెలువ కనులు క్రూరమ్ములు
తలఁపఁగ నవి మృత్యుదేవ-తా రూపమ్ముల్. ౨౦

తే॥ నీలపుం బూల గుత్తిఁ జే-లీలఁ బూని
యుప్పుఁజేఁపలకడ మూఁగు-చుండు నట్టి
పులుఁగులం దోలు సుందరి - వెలుపుఁ గనులు
బల్లెముల కంటెఁ గ్రూరంపు - వాఁడి గలవి. ౨౨

వ॥ అదటున నిక్కుచుం దిరుగు హంసము! యాట యలంత నొందియు
న్నది యగు దాని నెన్నడకు నారయ సాటియె కావు నీ నడల్
పదమున మూఁడు లోకముల మార్గాని గెల్చిన బంటదేడ? నీ
పదట మదేడ? పోకు బలవంతులతోఁ బగ సాగి వచ్చునే

వ॥ అనుటయు నతని పజ్జ వర్తిల్లుచు నా తోఁట పాట
విన్న హరిణాక్షి మాధవి, ఇతని మనమున నెలకొన్న తలంప
వేఱై యున్నది. స్వభావము మాఱినది. అని నిశ్చయించి యలుక
నందియు నెఱుకపడనీయక యడంచికొని తత్సంగీతంబునక
సమ్మతించినదియుంబోలె నటియించి యతని చే నున్న వీణియ
గైకొని తాను వేఱుద్దేశము గలదాని వలె నతనికిఁ దోఁచునట్ల
తోఁటపాటల యంగంబులచే వరుణదేవుని మేల్మి యతిశయిం
విను జనమ్ము లానంద పరవశత్వ మంద వీణతో శ్రుతికలిపి పాడ
దొడంగె.

చ॥ కెలఁకుల తుమ్మెదల్ నెగసి కేకలు వెట్టఁగఁ బూల పావడ
వలనుగఁ గప్పి నల్లనగు వాలుగ కన్నులు విచ్చి మెల్ల స
చలనముతోఁ జరించితివి సౌరుగ నట్లు చరించు నెల్ల నీ
చెలువుని యాజ్ఞయంచుఁ దెలిసెన్ సుఖియింపుము నీవు కావిరీ

చ॥ అరవిరి తోఁటల న్నెమిళులాడఁగ సొంపుగఁ బాడఁ గోకిల
మురువుగఁ గంఠమందు గల పూసరు లల్లలనాఁడ మెల్లన
జరగితి కావిరీ! యటులు చక్కన నీ చను నెల్ల నిక్కమే
నెఱిఁగితి భర్తృశాసనము నింతయు దాఁటమియే సుఖింపుమీ

ద॥ చెలువుని చోళదేశమున జ్యేష్ఠ సుపుత్రుఁగ నెంచి తల్లివై
వలనుగఁ బెంచు దొడ్డపని వారక సేయుచు నుందు కావిరీ
వెలయ సుఖింపుమా యటుల వీడక కాచుట ధర్మమార్గ ని
శ్చలుఁడగు సార్వభౌముని విశాల కృపారస మంచెఱింగితిꣳ

ద॥ శశిముఖి యెఱ్ఱనోటఁ గల చక్కని పండ్లను పోలకున్న నీ
యసదగు ముత్తెముల్ గొనుఁడి యంచుఁ జరించెడి తిక్కవోలె
మసమున వచ్చుచుంటి విది మానగరమ్ము పుగారు; ముత్తెముల్
పొసఁగఁగనిచ్చిపూసరులఁబొల్పుగఁగొందుముజట్టికాంద్రుగన్

ఉ॥ వంచన చేసి వీడు తమ భర్తల పోకడ చేతి గాజులే
కొంచక తెల్పుచుండుటలు గోలల మెల్లెలుఁగంగ నేర్తుమో
యంచను పూల పొన్నపయి నారసి చంద్రుగ నెంచి తుమ్మెదల్
సంచుగ నల్లి పూవులకుఁ జాగు పుగారు పురమ్మ మా దగుꣳ

సీ॥ అను వారల గెల్చు – నాసవముం బోలె
విధి దాఁగ కుండు మా – వీట నిట్లు
మందు లేకుండెడి – మరులు నొవ్విని మగు
వలకుఁ గల్గించుట – దెలియ మయ్య
తమ మట్టిగోడలఁ – దరఁగలు కరఁగింప
నిసుక వారుకొని పెం–పెసఁగఁ జల్లి
చంద్రాస్యముల మీఁద – జాఱ పగఱ్పుంటఁ
జొచ్చిన బల్లెమ్ము–చొప్పు నొప్పు
కన్నులం జలజల నీరు – కాఱుచుండ
సంభ్రమముం దిట్టుచుండెడి – చంచలాక్ష
లందు నిందుఁ జరించుచు – నలయు నట్టి
పట్టు మాది కావేరి పూ–పట్టనంబు. ౩౦

తే॥ తోడి పెంటితోఁ దగ నాట-లాడు నెండ్రిఁ
గాంచి పూఁదోఁటలో నన్నుఁ - గాంచి తెలివి
చెడఁగ నేఁగిన నాయకు - చేష్ట లేవొ
నెఱి కురులదాన! నేనింత - యెఱుఁగకుంటి. ౩

తే॥ తమ దయయు గుఱ్ఱముల తేరుఁ - దారు మమ్ము
మదిఁ దలంపకయే చేయి - వదలిరి కద!
అరవిపుల కొమ్మలార! యో యంచలార!
మఱచు వారి మనము కూడ - మఱవము కద! ౩

ఉ॥ అంగదఁ బెంచు సంజతఱి నశ్రులఁ గార్చుచుఁ గుందు నాదు క
న్నుంగవ వోలెఁ జింతను మునుంగక నిద్రిలుచుంటి కల్లు వ
తిం గల యబ్జినీ! మిగులఁ దీయని నీ కలలో శరుండు న
సంగడికాఁడు మీ వసుల జాడల రాఁడుకదా వచింపుమా. ౩

తే॥ పక్కివలె నేఁగు గుఱ్ఱాలఁ - బరఁగు తేరి
జాడ మొత్తముఁ దుడిచి యో - జడధి ఱేఁడ!
యన్యపక్షంబు చేరితి - వరయ కుంటి
నాదు వెత నేమి చేయుదు? - నేది దిక్కు? ౩

తే॥ వరుని తేరు వోయిన జాడ - యరయ రాక
పాఱుచున్న ప్రవాహమా! - భార్యతోడఁ
గలసి యాడెడి హంసమా! - యలరుఁదోఁట!
ఉదధి తీరమా! వలదన-కుంటి రేమి? ౩

తే॥ సంగడీని పెన్నరదము - చన్న త్రోవ
యరయ రానీక తుడుచుచుఁ - బఱచి తీవు
మిత్రముంబలె నున్నట్టి - శత్రువైతి
భువిని చిరసుఖి వగుము స-ముద్రరాజ! ౩

ఉ॥ ముత్తెపు సొమ్ములుం బగడపుఁ రశనఁ ధరియించి యెఱ్ఱ
డ్లెత్తఁటిఁ బండు భూమి నల లెల్లెడఁ బర్వఁగ నొప్పు నాయకా
యిత్తఱిఁ బొన్న తోఁటను రతీశుని యంపఱ చేతనైన య
క్రొత్తగు గంట్లఁ బుప్పొడిని గూరుట తల్లి యెఱుంగ నేమగున్

చ॥ పగడపు నోరు విప్పి మురిపంబగు ముత్తెపు నవ్వు చూపి వె
ల్లగువడి బెస్తపల్లె వలలాఱెడి ముంగిళులం దరంగముల్
మొగకొని గంతు వేలగల భూవర! కారునఁ బూచు బీర పు
జిగిఁగొను దాని యివ్వఁగల చిన్నెలు తల్లి యెఱుంగ నేమగున్

ఉ॥ కంపున ముగ్గి యద్ది తొలఁగం బువుఁదోఁటను చొచ్చి రాలు పు
గుంపుల తావులం గొని బుగుల్కొన వీచు కరళ్ళనొప్పు తీ
రంపు ధరేంద్ర! యచ్చెలి భరంబగు నొవ్వులపెన్పొ యొంద ని
ష్కంపువిధంబు తల్లి యెఱుఁగన్ మఱి దిక్కెదియో వచింపుమా

తే॥ కంజమిత్రుండు మఱఁగె జీఁకటులు పెరిఁగె
కనుల నశ్రువుల్ జరఁగె నా - మనసు విఱిగె
గాజు లూడుట, నిప్పులు - గ్రక్కు సంజ,
చెలువు దేశంబునందును - గలుఁగు నేమి ? ౪ం

తే॥ ఇనుఁడు క్రుంకెఁ జీఁకటి క్రమ్మెఁ - గనులు బాష్ప
ములను రాల్చె నీ నాయకు - భూమియందుఁ
గలదె సూర్యుని మ్రింగి రే - వెలుఁగు నుమిసి
మరులు గొలిపెడి యీ సంజ - మదిర నేత్ర! ౪

తే॥ కలకల మడంగె నశ్రువుల్ - కనుల రాలె
పూల జడదాన! నా ప్రియు - బ్రోలఁగలదె?
మృత్యువై నా యుసురు లూడ్ప - మేవి వచ్చి
మరులు గొలిపెడి యీ సంజ - మదిరనేత్ర! ౪

తే॥ మొగలికంచియతోఁటకు - మొనసి వచ్చి
మరులు గూర్చి మా యాటల - మంటఁ గలిపి
పోమె నొక్కరుఁ డా రీతిఁ-బోయి నతఁడు
చామ ! మన మనస్సును జీడు - శఠుఁడు కాఁడు. ౪

తే॥ కంధి తీర వనమునందు - కాల్వకడకు
వచ్చి దయచూపు మని నిల్చె - పన్నెలాఁడు
అట్లు వచ్చి నాతఁడు మన - హరిణ వీక్ష
ణముల మఱచెడి కఱటి యె-న్నఁడును కాఁడు. ౪

తే॥ హంస హంసితో నాడుట - యరసి నిన్న
వానినే కాంచుచుండిన - వాఁ డొకండు
నిలిచి నాతఁడు బంగరు - వెలుకవోలె
మనల విడిచి యెచ్చటికిని - మరలఁ డమ్మ. ౪

తే॥ హే భరద్వాజ ! మా తోఁట - కింక రాకు
మా యధికతాప మా చోళ-నాయకునకుఁ
దెలుపుదువొ యేమొ నిన్నెట్లు - తెలియనగును ?
కనఁగరాకు కనఁగరాకు - కనఁగరాకు. ౪౬

తే॥ అట్లు పాడి మాధవి మఱి - యలరు వ్రేళ్ళ
[1] షడ్జ గాంధారములు శ్రుతి - సరణి చేసి
యట్టి పద్ధతితోఁ గొంత-యదను పాడి
పయి నొక యపూర్వమగు పాట - పాడఁదొడఁగె. ౪

1. షడ్జశ్రుతి కలది - షాడ్జి, (శెంబాలై). గాంధార శ్రుతికలది - గాంధా
(విళరిపాలై).

కొమ్మలకును లతాం-గులకును దెలియ
పరభృతుఁడను సైన్య-పాలుండు దెలిపె
వనధి యాటను పుష్ప-వనమున నుండి ౧౫
యలుకతోఁ గోవలుఁ - డరిగిన యంత
నొంటిగ నేగిన - యుత్పల గంధి
మాధవి వేడుక-మై మేడ మీఁది
చంద్రశాలకు నేగి - సంపద గలది
కావున దక్షిణ - కంధి ముత్తెములు ౨౦
దక్షిణ శైల చం-దనము పునుంగు
శిశిరంబు కొఱకుఁ గై-చేసిన చనుల
పైఁ జేర్చి తొమ్మిది - పసుదుల నొప్పు
వాన మొదటి దగు - పద్మాసనమ్మ
వైచి కూర్చుండి య-పశ్రుతి లేని ౨౫
వీణియ కైకొని - వీనుల కించు
మధురగీతము పాడి - మై కొంత మఱచి
తన కుడిచేయి ప-తాక గా వీణ
మీటపై వైచి త-న్మృదు వామ హస్త
మందు నాలుగు వ్రేళ్ళఁ - బొందిక గాఁగ ౩౦
దండియపైఁ జేర్చి - తంత్రులఁ దడవి
[1] నాల్గు దోసంబులు - నయమార లేని

1. నాలుగు దోసములు :— ఇంపులేని శబ్దము (చెంబగై), మితి మీఱిన ౦ (అర్పు), అదరు శబ్దము (అదిర్వు), తక్కువ స్వరము (గూఢము).

[1] పదునాల్గు తంత్రులు - పరఁగు చకోట
మను వీణఁ గొనుచు మ-ధ్యమము షడ్జముగ
శ్రుతి గూర్చి [2] తోడు న-చ్చో శాఖ పగయు
చెలి యను నాల్గింటఁ - జెలఁగి రాగంబు
పుట్టు గుర్తులఁ గాంచి - పొందార షడ్జ
పంచమంబుల శ్రుతి - పలికించి యవల
సప్తస్వరమ్ము లె-సంగఁ బల్కించి
మధ్యము మొదలుగ - మధ్యము తుదిగ
షడ్జము మొదలుగ - షడ్జము తుదిగ
[3] కాఁపుల పాటలఁ - గల నాల్గు తెగల [4]
బాగుగా గమనించి - పలికించి చూచి
గమకంబు లందలి - క్రమములు చెడక
సాగించి యవల న-సంపూర్ణ రాగ
ములఁ బాడు నప్పుడు - కలఁగిన మదిని
పుష్పాస్త్రమున జగ-మ్ముల నెల్ల నేలు

---

1. వీణలు 4 వి. 21 తంత్రులు గలది భేరి వీణ.
   .. 19 తంత్రులు కలది మకరవీణ.
   .. 14 .. చకోటవీణ.
   .. 7 .. చెంగోట్టువీణ.

2. శ్రుతికి రెండవ స్వరము తోడు. ఐదవది శాఖ. మూఁడవది, ఆ...
...గ. నాల్గవది మిత్రము.

3. కాపుల యాట మరుదం. వేఁటరుల యాట పాలై. తీరవాసుల య...
...యిదల్, కానల్‌వరి. పార్వతేయుల యాట కుఱింజి. కుఱ్ఱుక్కు‌అవై. గొల్ల...
...యాట ముల్లై. ఆయ్చిక్కు‌అవై.

4. మ. మొదలుగఁ గలది. అగనిలై మరుదం. మరుదయాళ్.
   మ. తుదిగాఁ గలది. పుఱనిలై మరుదం, ఆగరి.
   స. మొదలుగాఁ గలది, అరుగియల్ మరుదం. చాయవేళర్ కొల్లి.
   స. తుదిగాఁ గలది, పెరుగియల్ మరుదం, కిన్నరం.

నసమానుఁడగు కాము-నాజ్ఞను తాను
పలు మొగమ్ములను నుతిం-పం దగు లేఖ
కోవలునకు వ్రాయు - కోరిక వుట్టి ౫౦

మాధవీ మల్లికా - మరువక చంప
కోత్పలాదిక పుష్ప-యుత దామ మందు
ముదిరిన తెల్లని - మొగలి రేకు పయి
కాంచన ముకుళమ్ము - కలముగాఁ గొనుచుఁ
బారాణిలో నద్ది - వ్రాయఁ దొడంగె ౫౫

జగమునఁ గల జీవ-చయము మొత్తమ్ము
మోదింపఁ గోరుచు - మురియుచు నుండు
జతలను గూర్చు వ-సంతుండు చూడ
యువరాజు గావున - నూరకుండండు
సంజయఁ గజముపైఁ - జనుదెంచు చంద్రుఁ ౬౦

డరయ సన్మార్గుఁడా - యతఁడును కాఁడు
కావున జతలుగాఁ - గలిసిన వార
లొక యింత కాల మూ-రక కడపినను
ఎడఁ బాసి నట్టి వా - రొక్కెడ మఱచి
రాకున్నఁ బ్రియమైన - ప్రాణ పంచకము ౬౫

నలరమ్ము తీయుట - యది క్రొత్త గాదు
ఎఱుఁగుఁడి మీరని - యఱువది నాల్గు
కలలను సేవించి - గానమ్ము నందు
విసుఁగొందు నాల్కతో - విరియంగఁ బాఱు
వలపుచే గొణుగుచుఁ - బలికిన పలుకె ౭౦

పలుమరు పలుకుచు - వ్రాసి ముగించి
వెలుకయా మేనితోఁ - దలఁపులు పరుగు
లిడు సంజవేళఁ బెం-పేది వసంత
మాలయణా చేటిని - మక్కువఁ బిలిచి
యీలేఖలో లిఖి-యించిన యర్థ
మెల్లఁ గోవలు మది - కెక్కంగఁ బలికి
యిటకుఁ దోడ్తెమ్మన - నేగి యమ్మగువ
రేవు వీథిని గల - కోవలు చేతి
కందీయ నతఁ డర-యక చేటిఁ గాంచి
యలకమ్ము తిలకమ్ము - నలరారు నల్ల
విల్లు నుత్పలమును - విరిమొగ్గ పూవు
దొండయు మేనుగాఁ - దొడరిన కాంత
కాంతి చెన్నారు మొ-గమ్మున మోద
భావమ్ముతోడ నా-పైఁ బ్రేమ యున్న
యంగునఁ జేయు ప్ర-త్యక్ష నటనము,
మొగులు మోయుచు నొచ్చి - జిగి విరియించు
తొగ తేనె యందు వా-లుగలు చరించు
ప్రేమసౌందర్యముల్- వెలయంగఁ బాగు
పొదిగిన పగడమ్ము - బాగొప్పఁ దెఱచి
తెలి ముత్తెముల నవ్వు - తేటను జూపి
రమ్మన వచ్చుచుఁ - బొమ్మన్నఁ బోవు
నల్లని కనుల క్రొ-న్ననఁబోఁడి యింపు

పెంపారఁ గావించు - వెలిదృశ్య నటన,
సంజ వచ్చుటఁ జేసి - సంకట మంది
చింతా జ్వరం బంది - చీకాకు పడెడి ౯౫

నా దైన్యముం గాంచి - నర్మిలి చిలుక
పలుకులు హంస న-డలు నెమ్మి చాయ
మఱుఁగు పడం జేసి - తెఱఁగైన దాసి
వాలకమునఁ జేయు - ప్రచ్ఛన్న నటన,
అందెలు నోర్విచ్చి - యఱవ మేఖలయు ౧౦౦

నార్వంగ నగల మో-యఁగ లేని కౌను
కలయది ప్రేమమ్ము - గల చూపు వోలెఁ
గాంచి వియోగమ్ము - కతమున నైన
నా పరితాపమ్ము - నోపికఁ గాంచి
వెనుక నిలిచి యాడు-ననునటనమ్ము ౧౦౫

విరి సరు లలకముల్ - కురులు ము త్తెముల
హారమ్ము గుబ్బలు - ప్రోదినిఁ బోలు
కటిని నొప్పింప వె-న్కన వచ్చి దాసి
జనములు నా యవ-స్థం దెల్పు నంతఁ
గలయిక కుత్కంఠ - గలుగు నా దీన ౧౧౦

వాకులు విని యందు - కాకువు చేత
వేఱర్థముం దీసి - వికట భావమ్ము
దీపింప నాడు ను-ద్దీపక నటన,

ఏ నిదురింపఁగా - నెడఁబాటు సైఁప
రాని దానివలె నా-రంగ మిత్రులకు
తన యొందు సంతాప-మును నొక్కి నొక్కి
నేర్పున వెలయించు - నిగదిత నటన
కాన వచ్చిన చెలి-కాంద్రకు సంఁ
తాపము చూపిన - దర్శన నటన,
పలుమఱు నెదుటఁ దాఁ - గలఁత నొందంగ
వారు తేర్చిన సమా-శ్వాస నటనము,
ఆటవెలందియే - యగుటచే దాని
కవి గౌరవ మొసంగు - నవె కదా ? యనుచుఁ
జెలువ చెల్వుగ వ్రాయు - శ్రీముఖ మ్మటులు
చెలువుండు ప్రతిఘటిం-చినఁ జింత నొంది
వాడిన మోముతో - వాసంత మాల
విస విసఁ జని మాధ-వికిఁ దెలుపంగ
మాపటివేళ రా - మనసు రా కున్న
తేపటి వేళఁ దే-రిమిఁ గాంతమంచుఁ
గలఁగిన మదితోడ - నలరుఁ బానుపునఁ
జేరక వేఱొక్క - చిఱుసెజ్జఁ జేరి
పడి యుండె నచ్చెలి - వగ యగ్గలింప.

తే॥ తీయ మామిడి గుత్తులు - తేనె జార్పఁ
దనియఁ గంకేళు లడర గెం-దమ్మి లలర
మరుని కైదువుల్ నిండిన - మాధవమున
మా చెలి మనమ్ము నేఁ డెట్లు - మఱుఁగునొక్కొ!

నెయ్యపుఁ గిన్క వేఱ శయనించిన వారలు లెండు లెండహో
చయ్యన నంచుఁ గోకిలలు చాటెను మన్మథు నాజ్ఞ; ఎల్లచో
నెయ్యెడ వీడకుండు చెలి యియ్యెడ వ్రాసిన లేఖఁ దోఁటలో
నొయ్యనఁ బాడు పాటలకు నూర్చిన నాయక! కాంచుమా వెసన్.

---

## ౼ స్వప్న వృత్తాంతము

గీ॥ అతి విశాలమైన పుగారు - నందు వాడ
ముంగిళుల వరిమొలకలు - మొల్లవిరులు
చల్లి దీపమ్ము లుంచి యా - సంజవేళ
రేయి కొాక వేసమును పుర-స్త్రీలు తొడుగ
తొల్లి మాలతి యను విప్ర-తోయజాక్షి ౫

సవతిబిడ్డకుఁ బాల్వోయు - సమయ మందు
నిసుగు క్రక్కి వెక్కుచు మర-ణించు నంత
సవతి సడివెట్టి నిందింప - సాగు ననుచు
మృత శిశువు నెత్తికొని కల్ప-వృక్ష మున్న
యాలయంబు నైరావ ణేం-ద్రాలయములు ౧౦

నందమై యొప్పు బలదేవ-తాలయమ్ము
నర్క దేవాలయమ్ము చం-ద్రాలయమ్ము
గుహుని గుడియుఁ గైలాసేశు - గుడియు నరుహు
దేవళము శాతవాహను - దేవళమ్ము
మొదలుగాఁ గల యన్నింట - మొనసి చొచ్చి ౧౫

దైవతములార! మమ్మిప్డు - దవిలి యున్న
దుఃఖమును తీర్పుఁడని వేఁడి - తుదకు విసివి
పఱచి యొక్క పాషండ వి-ద్వాంసు నాల
యమున కేగి సాఁగిలి యభ-యమ్ము వేఁడ
నొక్క వికృతంపుఁ బొలఁతి రూ-పొంది యామెఁ
గాంచి యో పుణ్యరూపిణీ! - కఠిన తపము
సలుప కుండు వారికి దేవ-తలు వరమ్ము
లీయ రిది నిక్కమని పల్కి - యింతి చేతి
కుణపముం జూతమని లాగి-కొని బిరానఁ
గాటి కోటకుఁ గటికి చీఁ-కటిని చేర
నచటి డాకిని కైకొని - యట్టె మ్రింగె
పిడుగు చప్పుడు విన్నట్టి - పెట్ట నెమిలి
పగిది మాలతి వెక్కి యే-డ్వంగ శాస్త్ర
యమ్మ! చింతింప కింటికిఁ - బొమ్మ పోవు
త్రోవ నొక చెట్టునీడను - దొరకు నీకు
బిడ్డఁ డని పల్కి తానె యా-బిడ్డ రూపు
దాల్చి యుండ నయ్యింతియు - దానిఁ గొనుచు
నక్కన నడంచుకొని పోయి - యమ్మ కిచ్చె
జనని పెంచ బిడ్డఁడు బ్రహ్మ - చారి యగుచు
విద్యయందు వినికి యందు - విద్వ దర్కుఁ
డగుచు భాసిల్లి తలిదండ్రు - లంతరింపఁ
బాలివాండ్రతోఁ గూడ జీ-వనము గడపి

తల్లిదండ్రులకుం జేయఁ - దగిన కృత్య
ములను నెఱవేర్చి భార్యతోఁ - గలిసి యుండి
యొక్క తఱి దీనిఁ గాంచుమ - యువిద యనుచు ౪౦

దివ్యదృష్టి యొసఁగి నిజ-స్థితిని చూపి
యజరమైన యునికి యిది - యంచుఁ దెలిపి
నా గుడికి రమ్మ యనుచు నా-నతి యొసంగి
చనఁగ దేవంతి, నా భర్త - చనియెఁ దీర్థ
యాత్ర చేయంగ నను వీడి - యతఁడు మరలి ౪౫

వచ్చుఁగా కిచ్చటికి నని - యిచ్చగించి
దేవళము చేరి యచ్చట - సేవ సేయు
చుండి నట్టిది, తన మది - నురు యశస్సు
గలుగు కన్నగికిఁ గొఱఁత - గలిగె ననుచుఁ
గడఁక దేవళమునఁ జేరి - గఱిక వడ్లు ౫౦

చల్లి సేవించి యామె క్ర-చ్చఱ హృదీశు
బడయుఁ గాకని కన్నగి - కడకు నేగి
క్రన్న నీ భర్తఁ బడసెదు-గాక యనుచు
దీవనలు సేయఁ గన్నగి - తృప్తివడక
నీవు పలికిన యట్లు నా - జీవితేశుఁ ౫౫

గలియుదున యేనియును కన్న - కల కతమున
మనసు కలఁతవాఱిన దోట - గొనిన దనుచు
స్వప్నవృత్తాంత మిట్లని - పలుకఁ దొడఁగె

అమ్మరో! మేము క్రొత్త పు-రమ్ము చేరి
యుండ నచ్చట సుంతయు - నొనరఁ దగని
యొక్క నిందను మోపి రా - యూరివారు
కోవలున కొక్కయాపద - కొఱలె ననుచు
విన్న యంత సేనాపుర - విభుని కడకుఁ
జేరి న్యాయము విన్నవిం-చితిని దాన
రాజుతోడ నా పురి కుప-ద్రవము గలిగె
నప్పు డొక్క క్రూరావస్థ - యడరె మాకు
విన్న నీకును నవ్వాద-వించు నిజము
అనుడు దేవంతి యిట్లను - నతివ! నీవు
తొల్లి జన్మంబు నందు నీ - వల్లభునకుఁ
జేయఁ దగిన వ్రతమ్ములఁ - జేయ లేమి
దానఁ దొడరు దొసఁగు నీకుఁ - దప్పఁగాక
సంగమ స్థలి చెంగట - రంగు మీఱు
వనము నం దిందుకుండంబు - భానుకుండ
మనఁగ రెండుతీర్థము లుండు - నందు క్రుంకి
చేరువం గల కోవెలఁ - జేరి మదన
దేవుఁ భక్తిఁ బూజించిన - తీవఁబోండ్లు
తమ పతుల నెడఁబాయ కీ - ధరణి యందు
పొలుపు గాంచి యవ్వల భోగ - భూమియందు
జనన మందుదు రచటికి - మనము గూడ
నొక్క నాఁడేగి వత్తమా - యువతి! యనుచు

బలుకు దేవంతిఁ గాంచి యో - చెలువ చెలువుఁ
దక్క నితరు సేవించుట - తగదు మాకు
నిక్క మనుచుండు నంతలో - నొక్క దాసి
వచ్చి వాకిట మన రాజు-పగిది నిలిచి
యున్నవాఁడు కోవలుఁ డను-చుండు నంత
నతఁడు లోని కరుగుదెంచి - యలరుఁబోఁడి
వాడు మేనిని గని లోని - వంత నెఱిఁగి
వంచనమె జీవనమ్ముగ - వఱలు నాట
వెలఁదితోఁ గూడి యుండిన - వితము కతన
మనకుఁ బూర్వులు కూర్చియుం-చిన ధనమ్ము
సమసి దారిద్ర్య మబ్బుట - చాల లజ్జ
యొదవఁ జేసినదన సతి - వదన మందు
కాంతి గల చిఱు నగవును - గానిపించి
నందియలు గల వవి కొనుఁ-డనుడు నతఁడు
ప్రాణవల్లభ ! వినుమ యీ - యందియలను
మూల ధనముగఁ గొని నేను - మున్ను నీఁగు
కొన్న ధనమును నగలు చే-కుఱ గడింప
నిచ్చగించితి మధురకు - నేఁగి, నీవు
వెంట నరుగుదెంతువు గాక - వేడ్క ననుచుఁ
బూర్వ కర్మ మవ్విధమునఁ - బ్రోత్సహింప
నిశ్చయించి వేగక మున్నె - నిద్ర లేచి.

ఆ.వె॥ వెల వెలంది తలఁపు - కులకాంత కల ఫల
హీన పఱుప విధియు - నెచ్చరింపఁ
దలఁపు తిరమునీయఁ - దలకొని కోవలుఁ
డతివతోడ నలరి - యరుగఁ బూనె.

---

## ౧౦ దేశ సందర్శనము

మంజరి॥ ఇనుఁడు తూర్పున నుద-యింపక మున్నె
వేకువ జామున - విధుఁ డస్తమింపఁ
గనుమబ్బు గలుగ దు-ష్కర్మమ్ము రేఁప
తగరు చమరి హంస - తగు చుట్టల వలె
దరిసి తిరుగు పెసు-తాళముల్ గలుగు
పెద్ద వాకిలి దాఁటి - వెన్నుని గుడిని
వలఁగొని కడచి గొ-ప్పవి యగు నైదు
శాఖలు గలిగి ప-చ్చని యాకు లొప్పు
బోధి వృక్షము నీడ - బుద్ధ దేవుండు
కరుణ నొసంగు నా-గమము చారణులు
చదివి యర్థమ్ము వి-శదముగఁ దెలుపు
నింద్ర విహారంబు - లేడింటిఁ గడఁచి
మాంసంబు దినుటలు - మాని సత్యవ్ర
తము నూని యాసల - తగులంబు వీడి
శాస్త్రచయంబు లె - స్సగఁ బరికించి

పంచేంద్రియమ్ముల – ప్రకృతు లడంచి
నిత్య స్థితి నెఱుంగు – నియత సద్వ్రతులు
కూడి యున్నట్టి శ్రీ – కోవెలలోన
[1] పరమేష్ఠి పంచకం – బరుదారఁ గూడి
విజయంబు చేసిన – విధి నైదు సంధు ౨౦
లొప్పారఁ గలిసిన – గొప్ప మండపము
నందు పొంబూవుల – నలరు కంకేలి
తరువు నీడను తేరు – తిరునాళ్ళ యందు
నభిషేక దినముల – యందుఁ జారణులు
రావచ్చు నని [2] జగ–ద్వ్రతి తతి కూడి ౨౫
వ్రాసి యుంచిన శిలా–వట్టమునకు న
మోవాక పూర్వక–ముగ వలదిరిగి
పర్వత శిఖరంబు – పైనుండి జాఱు
వెల్లువ వలె నొప్పు – వీదులు కడచి
లోకమ్ము వారలు – రాక పోకలకు ౩౦
నియమించు కొన్నట్లు – నిలుచు వాకిలిని
నడతెంచు జనులతోఁ – గడచి యవ్వలనఁ
జోళరాజునకుఁ గు–సుమ సాయకుండు
మాధవ సహితమౌ – మలయ మారుతముఁ
గానుక యీయ మేల్–సూనముల్ నించు ౩౫

1. పరమేష్ఠి పంచకము :— అర్హులు, సిద్ధులు, ఉపాధ్యాయులు, ...ర్యులు, సాధువులు. 2. జగద్వ్రతి తతి = లోకవ్రతులు. (లోకము ...రించి జైనమతమున నున్నవారు).

చెట్ల నీడల తోడఁ - జెలఁగు వసంత
వనము ప్రక్కను కోట - బయటను చనుచు
నిరు దరుల వనమ్ము - లేపారు చుండు
కావేరి తీర సం-గమ ముఖ ద్వార
మంగవించుచుఁ బశ్చి-మాశను నడచి
తీర వనమ్ములఁ - దూఱుచుఁ గడచి
కాద మనెడి యెల్లఁ - గడచని కౌంతి
స్వామిని వసియించు - పల్లియ తోఁట
నిలిచి, యవ్వేళఁ ద్రుం-గెన యేమి యనుచు
శంకింపఁ దగి నట్టి - సన్నవి నడుము
దిరిసెనఁ బోల్మృదు - చరణముల్ నొవ్వ
నలసి నిట్టూర్చి మృ-దుల వాక్కు-తోడ
దంత కాంతులు పర్వఁ - దన చెట్ట నూని
మధురా నగర మెంత - మట్టు దూరమ్మొ ?
యనిన గృహిణిఁ గాంచి - యల్లన నవ్వి
మన దేశమునకు నా - మడ లయి దాఱు
కడవ నున్నది యని - కన్నగి తోడఁ
బల్లెకుఁ జని కౌంతి - పద పద్మములకు
వ్రాలి కేల్మోడ్ప న - వ్వనితయుఁ గాంచి
యందమ్ము నాభి జా-త్యము నడవడియు
నర్హ్మని యుపదేశ - మది తప్పకుండు
వ్రత నిష్ఠులరు పాప - పతితులఁ బోలె

౧౦ దేశ సంచర్యనము

నిటు రాఁగ హేతు వె - య్యది యని యడుగ
నరయఁ ద్రికాలజ్ఞు-లగు మహాత్ములకుఁ
దెలియంగ రాని దే-దియు లేద ధరణి
మధురాపురికిఁ జని - యధిక ధనమ్ము
నార్జింపఁ దలఁచి మే - మరుదెంచినార
మని కోవలుఁడు వల్క - నా కౌంతి యనియె
మధుర కేగుటయె స-మ్మత మగునేని
మృదులాతి మృదులముల్ - మెలఁత పాదములు
ముమ్మొన పలుకు టాల్ - గ్రమ్మిన త్రోవఁ
గడవఁ జాలవు నాడు - కాడుగా నున్న
యొడుదుడుకుల దారిఁ - గడవఁ గడింది
విధి యేమి తలఁచెనో - వేరెఱుంగుదురు
వలదన్న నిలిచెడి - వారును కారు
వేదవాక్యార్థముల్ - విన్న ఫలమ్ము
పొందిన వారలు - పొందికఁ జేయు
ధర్మోపదేశముల్ - తగ విని విన్న
విధముగ నట్లు సే-వింపంగ నెంచి
ద్రవిడ ధారణిఁ బొగ-డ్తకు నెక్కినట్టి
మధురకుఁ జన స్థిర-మానస నైతి
నాతోడ రండని - నయమునఁ బలుకు
కౌంతి పదమ్ములు - కైనంటి మ్రొక్కి

తాము వేంచేయు క-తన నీమె కష్ట
జాలమ్ముఁ దొలఁగింపఁ - జాలినవాఁడ ౮౦
నని కోవలుం డాడ - నక్కొంతి యనియె
వత్స! నీవెఱుఁగ వీ - పథ మన్ని చోట్లఁ
బలు సిలుగులకుఁ దా-వల మగు నిజము
ఎండ కన్నెఱుఁగని - యీ కోమలాంగిఁ
దోఁటలు పెక్కులౌ-త్రోవనే కొంచుఁ ౮౫
బోదమాయన్న, నీ - భూమిని చీల్చు
కొని పోయి బలిసిన - గెనసుగడ్డలను
త్రవ్విన గుంటలఁ - దనరి నిండారు
సంపెంగ పుప్పొడి - చాల కష్టముల
పాల్సేయు రాలిన - ప్రాఁత పూవులకు ౯౦
నొదిగి చనెడి వారిఁ - బ్రిదిలిన పనస
పండ్ల రసము జార్చి - పడఁద్రోయఁబడినఁ
గంటుల పోల్కిఁ డెం-కాయలు మోఁదుఁ
బనస విత్తులు రాల-పగిది బాధించుఁ
బొలముల త్రోవలఁ - బోయితిమేని ౯౫
చెంగల్వ కొలఁకుల - జెల్లలఁ దఱిమి
నీటి కుక్కలు కవ్వ - నెఱ వాలుగలను
పొలముల గనిమలఁ - బొరలుచుఁ బడెడి
వెల్లువలను గాంచి - వెఱపొందఁ గలదు
చెఱకు తోఁటలఁ గల - చిట్టి తేనె పెర ౧౦౦

లవిసి వెల్లియయి చే-రువ బావిఁ గలియు
నతి కుతూహలమున - నలరు కోవలుఁడ !
ఆ నీటి దోసిట - నమరంగఁ బట్టి
దప్పి గొనిన యీామె - త్రావంగ వచ్చు
కలుపు తీసెడి వారు - గనిమల పైచు ౧౦౫
కలువలలోఁ దుమ్మె-దలు రొదసేయు
స్థలమున నలసి పా-దము లుంతుమేని
తోయంబు దుమికెడి - తూములు గలుగు
త్రోవల నత్తలఁ - ద్రొక్కి-తిమేని
పడు బాధలం గాంచి - భరియింపలేము ౧౧౦
మళ్లఁ దోఁటలు లేని - మార్గముల్ లేవు
అట నట నా జాడ - లరసి తొలంగి
నడతురు గా కని - నయమారఁ దెలిపి
కుండికయును పీలి - కుచ్చును జోలె
తాఁగొని [1] యక్షర - దైవమ్ము త్రోవఁ ౧౧౫
దోడగుఁ గా కని - తోకొని నడచె
శని మీనమునఁ జేరి - నను ధూమకేతు
వలరిన శుక్రుండు - వలదెసఁ జన్న
పడమటి కొండను - పిడుగులతోడ
వాన కురియఁ గొండ - బండు వస్తువుల ౧౨౦

---

1. బీజాక్షరములు :— ( అసి ఆ ఉ చా ) కలదైవము.

తోడఁ గడలి పంట-తో నెదుర్కొనెడి
మొగిని పుగారును - మోఁది యా తూము
తలుపుల మీఁదఁ బొ-రలి పొఱుచుండు
కావేరి క్రొన్నీటి - కరడుల రొదలు
కపిలె లేఁతము లాది-గాఁగ నీరెత్తు

యంత్రమ్ముల వలన - నగు పెను రవళి
వరి మళ్ళలో నెఱ్ఱు - పడ్లను చెఱకు
నిండిన తలముల - నీరాశయముల
రాజ హంసములు నా-రణ పక్కిగములు
కొంగల గమి నీరు-కోళ్లు కార్కోళ్లు

మునుఁగుడు కోళ్లు న-మ్మన్నఁగు పెక్కు
పులుఁగులు పెను పొలి - కలనునఁ బుట్టు
కోలాహలముఁ బోలెఁ - గూయుచుండుటలు
దున్నని యడుసునఁ - దూఱి పొర్లాడి
కడుగని యడుసుతోఁ — గన్నుల యెఱుపు

పరఁగు బఱ్ఱెలు మేని-దురదచే వీఁపు
లొరసికొనుట వల్లఁ - బురు యాడి గాదె
లందు వడ్లితర ధా-న్యములతోఁ గలియ
బలుపు చేతుల కూలి-వాండ్రును సేద్య
గాండ్రదలించు వె-క్కసమైన రవళి

కలువలు మొదలైన - కలువుల నూడ్చి
నాఱు నాటఁగ త్రొమ్మ - నను భుజమ్ములను

## ౧౦ దేశ సందర్శనము

దగిలిన బురదతో-సొగసుగాఁ దోఁచి
గండు మీలం బోలు - కన్నులు కొలఁది
పలుకులు గల కూలి-వారలు త్రావి
యాడుచు సోలుచుఁ - బాడు పాటలును
గఱికయుఁ గలువలు - వరివెన్నుఁ గూర్చి
కట్టు సరులు మడ-కలకుఁ గైసేసి
నేలను పెకలించు - నెఱవాదు లట్లు
కేలెత్తి సాఁగిలి - మేలిమి పొగడ
మడకఁ గట్టిన వారి - మడక పాటలును
పండి పక్వంబైన - వరి మడి కోసి
వైచిన యోదెల - వడి నూర్చు వారు
నూఱుచు ధాన్యమ్ముఁ - గూరిచి కుప్ప
చేసిన వా రట్లు - చేసిన దాని
తూరు పాఱఁగఁ బట్టు - వారలు కూడి
'పొలి' యని పాడు పా-టల నినాదములు
కళ్ళంపు బిచ్చము - గైకొన వచ్చు
వారలు గావించు - పంబ యుడుక్క
పటహము మున్నగు-వాని రావములు
విను చేటి గట్టున - వేడ్కచేఁ జింత
పడక క్రమమ్ముగాఁ - గడచి యవ్వలన
చోళుని విజయంపు - మేలిమి తోడ

మబ్బులఁ గలిగించు - మంటల తోడి
యజ్ఞశాలలఁ జేయు - సాహుతి వలన ౧౬౫

గంధ ధూమము మేడ-లం దెల్లఁ గప్ప
మొగులు మేయు గిరుల - మొగిఁ గానవచ్చు
విప్రుల మంగళ - విధు లొప్పు నిండ్లు
కావేరి బిడలు బి-కారి చుట్టములు
ప్రభువుల విజయమ్ము - వ్యవసాయ మంద ౧౭౦

కలిగించు చున్నట్టి - కాఁపుల చెఱకు
గానుగ ప్రోవుల పొ-గల చేతఁ జూరి
మొగులు మేయు గిరుల - మొగిఁ గానవచ్చు
ప్రాఁతయూ ళ్ళట నటఁ - బరికించు చొక్క-
దినమున కామడ-యును దాఁట లేక ౧౭౫

నిలిచి నిలిచి పోవు - నెఱి నొక్క-నాఁడు
ఏటిని మఱిఁగించి - యెసఁగు శ్రీరంగ
మందసామాన్యమై - యడరిన వెదురు
ముండ్ల కంచియ గల్గి - పొలుపారు తోఁట
యందు వేల్పులు వసిం-పం దగి పుష్ప ౧౮౦

గంధాఢ్య మైన పు-గారును వదలి
లోక వ్రతులు చేరి - లోకుల కొఱకు
నర్హతుఁ డొనరించు - నతిశయ త్రయము[1]

1. అతిశయత్రయము :— సహజాతిశయము. కర్మక్షయాతిశయము. ాతిశయము.

ధర్మ పద్ధతులు బో-ధన సేయుచుండు
తలమున కేఁగి వా-రల పాదములకుఁ ౧౮౫

గౌంతితో వారలు - కైమోడ్చి బంధ
ములు తెగుఁగా కని - మ్రొక్కిన యంత
నొక చారణుఁడు వార - లొగి వచ్చు రాక
యెఱిఁగిన వాఁ డయ్యె - నేఁకట వెగటు
సేఁగిన వాఁడౌట - నెగసి చింతిలక ౧౯౦

కౌంతితో నిట్లు ప-ల్కంగఁ దొడంగె
దుర్విధి కుడిపెడి - దుష్ఫలంబులను
సత్క్షేత్రమందు బీ-జంబులఁ బోలి
సత్కర్మము లొసంగు - సత్ఫలమ్ములను
తప్పింప నెవరికిఁ - దరము గాదమ్మ ! ౧౯౫

బలుగాలి బయలి దీ-పమ్మను పోలె
నశియించుఁ గాని ప్రా-ణములు తిరములె !
ధార్మికుండును ధర్మ-తత్త్వ పారఁగుఁడు
సర్వహితుండు ని-శ్చలుఁడు విజ్ఞాని
ధర్ముండు సిద్ధుండు - ధర్మమూలుండు ౨౦౦

అరయ త్రికాలజ్ఞుఁ - డఖిలనాయకుఁడు
పండితుండును భగ-వానుండు పావ
నుఁడు పురాణుఁ డకోప-నుండు సంపన్నుఁ
డధి గుణవ్రతుఁడు మో-క్షాధి నాయకుఁడు
పరుఁడు పరంజ్యోతి - పరతత్త్వయుతుఁడు ౨౦౫

---

. గుణవ్రతము, దిగ్వ్రతము, దేశవ్రతము అను మూఁడును గల వాఁ
వ్రతుఁడు.

ప్రథిత సాత్త్వికుఁడు చా-రణుఁడు కారణుఁడు
ఉన్నతుండును సిద్ధుఁ - డున్నతోన్నతుఁడు
సర్వాత్ముఁ డాచార్యుఁ - డుర్వీడ్య గుణుఁడు
సంపూర్ణ సద్గుణి - సంపూర్ణ యశుఁడు
శంకరుఁ డీశుండు - చతురాననుండు ౨౧

[1]అంగాగమమ్ము లొ-సంగిన వాఁడు
జ్యోతి స్స్వయంభువు - జ్యోతిరూపుఁడును
సృష్టికర్త యభవుఁ - [2]డష్టగుణుండు
అనఘుఁ డాఢ్యుఁడు సనా-తనుఁడు దివ్యుండు
వేదాది యాగమ-వేద్యుఁడౌ సతని ౨౧

శరణు చొరక లేదు - నరులకు జన్మ
కారావిముక్తి ని-క్కము కాంచు మనుచుఁ
జారణ నాయకుఁ - డారంగఁ బలుక
విని తపస్విని కొంతి - వినతిమైఁ గేలు
శిరమునఁ జేర్చి నా - చెవులు [3] మూఁడడఁచు ౨౨

1. అంగాగమములు ౧౨. ఆచారాంగము, సూత్రకృతాంగము, స్థానాంగము, సమవాయాంగము, వ్యాఖ్యా ప్రజ్ఞాపత్యాంగము, జ్ఞాతృకథాంగము, ఉపాసకాధ్యయనాంగము, అంతఃకృత దశాంగము, అనుత్తరోపపాదిక దశాంగము, ప్రశ్నవ్యాకరణాంగము, విపాకసూత్రాంగము, దృష్టివాదాంగము. 2. అష్టగుణములు :- స్వతంత్రత్వము, విశుద్ధదేహము, నిరామయాత్మ, సర్వజ్ఞత్వము, అనాదిబోధము, అలుప్తశక్తి, అనంతశక్తి, తృప్తి అనిశైవాగమము; అనంతజ్ఞాన స్వరూప వీర్యప్రేమ నామరహిత గోత్రరహిత ఆయూరహిత అవినాశ స్వభావములని అర్హతమతము. 3. కామ క్రోధ మోహములు.

## ౧౦ దేశ సందర్శనము

విమలుఁడు దయసేయు - విజ్ఞానదాయ
కములగు ధర్మ వా-క్యములకుఁ దక్కఁ
దక్క నిరర్థక-తతి విచ్చి వినవు
నా నాల్క మార జి-న్నాయకు వేయి
నెసమిది పేరుల - నీటువో విడిచి
యన్యంబు నొడువఁ బో - దష్టా జితాక్షు
నంఘ్రియుగ్మము దక్క - నరయవు కనులు
నెఱియుఁ గృపయు లోన - నిండిన యతని
యూడెంబునకుఁ దక్క - నొల్లదు మేను
అర్హోపదేశకుఁ-డైన సర్వజ్ఞుఁ
నకుఁ దక్క మొగుడదు - నా కేలుదోయి
పూలపై నడచిన - పూత పాదములఁ
గాని కౌఁగిలి గొనఁ - గడఁగదు శిరము
అమిత కృపామయుఁ - డనుకంప నొసఁగు
నాగమమునఁ దక్క - నానదు మనము
అని పల్కు కౌంతి వా-క్యము లాలకించి
చారణుల్ మనమున - సంతస మంది
యాసనంబుల నుండి - యరుదుగ నొక్క
మూరెఁడు లేచి యో - ముదిత ! నీ జన్మ
బంధముల్ తెగుఁగాక - పడి నని యెగసి
వినువీథిఁ జనుచున్న - గని కేలు మోడ్చి
కౌంతియు బంధమో-క్షం బగుఁ గాక

యని మ్రొక్కి కలమెక్కి - వన తీరమైన
కావేరి దాఁటుచుఁ - గోవలు తోడఁ
గన్నగి తోడను - గలిసి పవిత్ర ౨౪౫

దేవాలయం బున్న - తీరమ్ము చేరి
యొక తోఁట లోపల - నుండంగ నటకు
స్వైరిణి యొకతతో - వాచాలుఁడైన
విటుఁ డేగుదెంచి య-వ్విమల మానసుల
రతి మన్మథుల వలె - రాజిల్లు వారిఁ ౨౫౦

దెలియంగ నుపవాస-ములఁ గ్రుస్సి యున్న
జనని ! మీ తోడ వ-చ్చిన వీర లెవ్వ
రన, వీరు నా బిడ్డ - లనుపమ గుణులు
మనుజ దేహులు వారు - మార్గంబు నడచి
యలసిన వారు వా-రలఁ జేరవలదు ౨౫౫

తరలుఁ డనఁగ వారు - తరలక నవ్వి
శాస్త్రజ్ఞులరు మీరు - సందియం బొందు
కల దేకగర్భ జా-తులు తమలోన
జంపతు లగుటయు - జగతిని గలదె ?
యను చెడు మాటలు - వినలేక చెవులఁ ౨౬౦

గరములతో మూసి - కన్నగి వడఁక,
వీరు నా బిడ్డలఁ - గేరిరి గానఁ
గానల నక్కలై - కడగండ్లు పడుచుఁ
గడతురు గాకని - కౌంతి శపింప
నా నీచు లా క్షణ-మంద వంచకము ౨౬౫

లగు చూళవెట్టఁ గ-న్నగి కాంచి జంకి
యవివేకు లెఱుఁగక - యాడిన వానిఁ
దద్జ్ఞులు క్షమియింపఁ - దగుదురు వీరి
శాప ముక్తిని కటా-క్షము తోడఁ దెల్పుఁ
డని వేఁడఁ గొంతియు - ననుకంప దోఁప ౨౭౦

వీర లుర్వైయూరి - వెలుపలి కోట
కావలి వనమునఁ - గడగండ్లు పడుచుఁ
బంద్రెండు నెలలుండు - పదపడి శాప
ముక్తిఁ గాంతురనుచు - మోదమ్ము మీఱఁ
గన్నగిఁ గోవలుఁ - గడఁకఁ దోడుకొని ౨౭౫

యొక కోడి యేన్గుతో - నొగి పోరుచేసి
గెలుపొందు కతన నా - స్థలమునఁ గోడి
రూపున వెలయించి - రూఢిగఁ గోడి
యూరను పేరుంచు - నూరికిఁ జనియె.

౯॥ కిరీటాధిపతులు ముప్వురలోఁ చోళరాజవంశీయులు ధర్మము వీర్యము రక్షణము నగరవైభవము ఉత్సవసమృద్ధి వేల్పుల రాక పౌరులు ధాన్య సమృద్ధి కావేరి ప్రవాహము రంగము ఆటలు పాటలు నటనభేదములు భారతివృత్తి అన్యాపదేశము విరహోద్దీపకము వీణాభేదములు మధ్యమాది గాంధారాంత శ్రుతులు చకోటములు చలటాటు రాగ గీత భేద

మ్ములు జానపద గేయములు గ్రామపద్ధతి యను
మొదలుగ నితరవస్తుసమృద్ధిచే నసాధారణ మహిమ
నియ్యది పుగారు కాండము.

తే॥ కడలి పరిఖగాఁ గలుగు నీ - పుడమి కొక్క-
మెడను పతకంబుగా రహిం-చెడి పుగాపు
ఉదయవేళ నుదితుఁడగు - నుదజహితుఁడు
సందె చంద్రుని వలె సుఖ-మందుఁ గాత.

# ౨. మధురాకాండము

## ౧౧. అటవీ దర్శనము

మంజరి॥ ముమ్మరు చంద్రుల - ముడిచిన కరణి
నడరి యంగగు [1]మూఁడు - గొడుగుల క్రింద
నినకాంతి కంటెను - తనరి పుష్పించి
మాలికలుగ వ్రేలు - పూలతో నొప్పు
కంకేలి క్రింద సం-గతి నెలకొన్న
యాదిదేవుండగు - నర్హుఁ బూజించి
నిష్కందు పల్లియ - నెలవుగాఁ గొనుచు
మునులున్న తోఁటలో - మున్ను చారణులు
తెలిపిన ధర్మముల్ - తెఱఁగుగాఁ దెలిపి
నాఁడట నిల్చి మ-ర్నాఁడు దక్షిణము
సన నెంచి వేకువ-జామున లేచి
నడచి భానుఁడు తూర్పు-నం దోఁచుసరికిఁ
బొలములు కొలఁకులు - పొలిచి లేఁజెట్ల
వనమునఁ గల మండ-పమ్మునఁ జేరి
రాజరాజైన మా - ప్రభుఁడు సుఖించు
నాకల్ప మీలోక - మరసి రక్షింపఁ
బ్రభులకుఁ దనమేల్మి - పదమునఁ దెలిపి

---

1. మూఁడు గొడుగులు:— (ముక్కుడై) చంద్రాదిత్యము, నిత్యవినోద
సకలభూషణము.

[1] పూర్వవైరము నోర్వఁ - జోక కుమారి
గిరి నబ్ధి వేష్టించి - పరవుట కతన
వడదెస గంగను - వడఁకు గుబ్బలిని ౨౦
గెలిచిన రాజు సు-ఖించును గాక
చంద్రుని వంశమ్ము - జానుగ వెలుఁగ
నింద్రుఁ డొసంగిన - యించు హారమ్ము
సురియఁ దాల్చిన ఱేఁడు - సుఖియించుఁ గాక
మన యింద్రు నెత్తి మొ-ట్టిన వాఁడు గాన ౨౫
నిట నిల్వరాదని - యేగు వర్షమును
వలసిన యంత దై-వాఱంగఁ గురిసి
పంట పండించిన - ప్రభుఁడు సుఖించు
నని పాండ్యునకు విజ-యమ్ములు పలుకు
చరుదెంచు విప్రు న-యంబారఁ గాంచి ౩౦
యూరేది యిటకు రాఁ - గారణమేమి ?
యని యర్థిఁ గోవలుఁ - డడుగ న విప్రుఁ
డిట్లని పలికె నో-యీ పుణ్యపురుష !
మబ్బులొలయు పైఁడి - మలయందు శేష
తల్పంబు మీఁదఁ బ-ద్మావక్షుఁ డగుచుఁ ౩౫
గావేరి దీవిని - ఘనులు నుతింప
వేంచేయు శ్రీపతి - వేసంబు తీరు

---

1. పూర్వమొక పాండ్యుఁడు తన శక్త్యాయుధముచే సముద్రనీరము
ంప నావైరము మదినుంచుకొని సంద్రము పాండ్యదేశమందు కొంతభాగ
ం ముంచి వైచినదని పూర్వ గాథ.

## ౧౧ అటవీ దర్శనము

వృషభాచలమ్మున - నిరుపక్కియలను
చంద్ర సూర్యు లలరు - స్థలమున మెఱుపు
వలువగా నింద్ర చా-పము ధరియించి

నిలిచిన కారు మొ-గులు వలె నొప్పి
శంఖ చక్రములు హ-స్తమున ధరించి
యురమునఁ గౌస్తుభం - బొప్పుగా వెలుఁగఁ
గనక చేలము తోడఁ - గమల నేత్రుండు
నేత్ర పర్వంబుగా - నిలిచిన తీరు

కాన్పింపు మనుచు నా - కన్ను లుల్లమును
పీడింప సైఁపక - వెడలి వచ్చితిని
పడమటి కొండల - ప్రక్క మాంగాడు
మాయూరు పాండ్యుని - మహిమమ్ము దేశ
సంపద కన్నులు - చల్లన గాఁగఁ

గాంచితిఁ గాన దీ-వించితి నిట్లు
వినుఁ డిది నా రాక - యని విప్రుఁ డాడ
మధురకుఁ జన మంచి - మార్గమ్ము తెలుపుఁ
డని కోవలుం డన - నాతఁ డిట్లనియె
దక్షులౌ మంత్రులఁ - దగఁ గొనకుండు

రాజు పాలనచే న-రాజక మైన
ధరణికై వడిని మా-ధవుఁ డను మంత్రి
తోడ వేఁడి వెలుంగు - తేఁడు మార్చడుచు

చల్లని భూముల - సత్స్వభావంబు
చెడ మరు భూమిగాఁ - జేయుచు నుండు ౧౦

పట్టునఁ జెలువతో - బయలు దేఱితిరి
రాలు రప్పలు నెక్క - రాని గుట్టలును
గట్టులు మిట్టలు - గలిగి దుర్గమము
గా నున్న యీ త్రోవఁ - గడచి చనంగ
నటఁ గొడుంబాళూరి - కవ్వల నుండు ౧౫

గుంట గట్టును చేరఁ - గొండ విల్కాని
శూలాగ్రముం బోలెఁ - జీలి ముత్త్రోవ
పొడకట్టు నందలి - కుడిత్రోవఁ బోవ
విరిసిన తలగల - వెల్ల కడిమియు
కాఁగిన తలగల - కాపు మామిడియు ౨౦

నెండిన వెదుళులు - నెండిన పొదలు
మాఁడి నల్లన యయి - వేఁడియౌ చోట్లు
దప్పి నల్లాడుచు - దుప్పులు లేళ్ళు
తిరుగాడు నడవి వేఁ-టరుల పల్లియకుఁ
బ్రక్క త్రోవయుఁ గల్గుఁ - బై దాఁటి చన్నఁ ౨౫

బర్వత ప్రాంతాలఁ - బండెడి వరియు
ముదిరి పక్వం బయి - పొలుపారు చెఱకు
తలలు వ్రాలుచు వెన్ను - గల కొఱ్ఱ చేలు
పసుపును వెల్లుల్లి - పండు పొలములు
ఆకుఁదోఁటలు పోఁక - లరటి టెంకాయ ౩౦

పనస మామిడి తోఁట - లనువుగాఁ గలుగు
పాండ్యుని చిఱుమల - పడయంగ వచ్చు
దాని కెడమ ప్రక్కఁ - దరలిన మధుర
చేరంగ వచ్చు నా - దారిఁ బోరేని
ఎడమ త్రోవను పోవ - నెసరేఁగి తేంట్లు ౮౫
పాడు కొలంకులు - పంట పొలములు
చల్లని తోఁటల - జాలైన త్రోవ
దాఁటి యడవి త్రోవ - దాఁట నళఘరి
వసియించు తిరుమల - నసిఁ జేరుఁ డచట
వీత మోహమ్మగు - బిల మొండు కలదు ౯౦
వేలుపుల్ వినుతించు - వింతలు గలుగు
శరవణ మన భవ-హరణ మనంగ
నిష్ట సిద్ధి యనఁగ - నెసఁగు తీర్థములు
గలవందు తొలిదాన - జలమాడ నింద్రు
వ్యాకరణ జ్ఞాన - మలవడును భవ ౯౫
హారిణి యందాడ - నపురూప మైన
పూర్వ జన్మ జ్ఞాన-ముం బొందు వారు
ఇష్టసిద్ధి మునుంగ - నిష్టసిద్ధి యగు
ఆ కొండపై విజ-యము చేసియుండు
భగవంతుఁ బూజించి - తగ మది నతని ౧౦౦
చరణమ్ము లుంచి యా - ధరణీ ధరమ్ము
ముమ్మాఱు వలగొన్న - భువి చీలినట్టు

లగపడు లోఁతైన - యందె పే రేటి
గట్టున నొక గోఁగు-చెట్టు క్రీనీడ
నైదు నల్లని జడ - లుల్లసిల్లంగ
విరిలతఁ బోలిన - మరులు కన్నియను
కననగు నది మిమ్ముఁ - గని యిట్లు పలుకు
"నీమేన మఱుమేన - నెసఁగు సుఖములు
శాశ్వత సుఖ మబ్బు - చందంబు చెపుఁడ
చెప్పిన నీకొండ-చేరువ భూమిఁ
జేరి మీయానతిఁ - జేయుదుఁ బనులు
బిలము వాకిలి దీసి - తెలుపుదు త్రోవ
నను వరోత్తమ యని - జనులు వచింత్రు"
తత్ప్రశ్నములకు ను-త్తర మీయ నామె
తలుపు తెఱచి చూపు - దారిని పోవఁ
బొడవగు ద్వారంబు - లెడనెడ నుండు
వాని దాఁటిన జంట-వాకిలి గలదు
అట వేలుపులు వ్రాయ - నమరిన ప్రతిమ
వంటి చెలువ యోర్తు - వచ్చి నిల్చుండి
తుదిలేని సౌఖ్యమ్ము - ముదమున నాకు
వాక్రువ్వ మీరలు - వలచిన కీర్తి
ధర్మమ్ము ముక్తి నం-దం గలవారు
మీకు నే నొక కీడు - మేకొన కుండఁ

జేరఁ దలఁచు చోటఁ - జేర్చెడు దాన
నని పల్కఁ జనువార - లనువగు నుత్త
రం బీయ మూఁడు తీ-ర్థములకుఁ ద్రోవఁ
జూపి మరలు నంత - సౌరిదిఁ బంచాక్ష
రీ మంత్ర మష్టాక్ష-రీ మంత్రరాజ
మేక చిత్తతఁ జ-పియించి యమ్మాట
వలచు తీర్థమ్మన - జలమాడి రేని
తాపసులకును పొం-దఁగరాని ఫలము
లభియించు నిజ మవ్వ-లన్ మల మీఁది
మాధవు పాద ప-ద్మమ్ముల నెడఁదఁ
దత్పర మతి నిల్పఁ - దధ్వజ స్తంభ
మరయఁ గానఁగనగు - నరసినయంత
భవ పాశములు పటా-పంచలై పోవు
నట్టి మహానంద - మంది యామీఁద
మధురాపురము చేరు - మదితోడఁ బొందు
కనుల పండువు గాఁగఁ - గానంగవచ్చు
బిల మహిమం బిది - తెలియఁ జెప్పితిని
ఈరెండు త్రోవల - నేగర యేని
తక్కిన యది మంచి - దారి యందందు
పూల తోఁటలు గల - యూళులు గలవు
నడుమ నడుమఁ గల - యడవులఁ గడచి
నడచుచో నా త్రోవ - నిడుమలు కూర్చు

దేవత యుండు నా - దేవత మంచి
యాకారమునఁ దోఁచి - యాటంక పఱచు
దానిని మీరలు - తప్పించుకొన్న
మధురకుఁ జను మూఁడు - మార్గముల్ చేరుఁ
జనుఁ డేనును త్రివిక్ర-ముని పదమ్ములను
కొలుచు నభీష్టంబు - గలవాఁడఁ గానఁ
బనివినియెద నని - పల్కు విప్రునకు
గౌంతి యిట్లను సార్థ-క వ్యాహృతులను
సచ్ఛీలవర్తనా-సక్తి నొప్పారు
వేద విద్వర! విను - బిలమును గాంచు
కాంక్ష మాయెడ లేదు - కల్పంబు గలుగు
నింద్రు వ్యాకరణమ్ము - నిమ్మగ సుగతు
నాగమంబులఁ గాన-నగుఁ గానఁ బుణ్య
శరవణ స్నాన కాం-క్షను చేయ మేము
చనిన జన్మమునఁ జే-సిన కర్మఫలము
కనిన జన్మమ్మునఁ - గాంచుట లేదె!
భవతారణిని మున్గఁ - బనియేల మాకు?
సత్యంబు తప్పక - సకల జీవులను
కాచువారికిఁ బొందఁ - గాని యర్థమ్ము
లిల లేవు గావున - నిష్టసిద్ధియును
సేవింపఁ పబలేదు - శ్రీ మీఱ నీవు
ప్రేమించు దైవమ్ము - వీక్షింపఁ బొమ్ము

మేము దూరపు దారి - మేకొని చనుదు
మని పంపి యిరువురఁ - గొని త్రోవఁ జనుచు
శ్రమ చెంద నిలుచుచు - శ్రమఁ దీర్చికొనుచుఁ ౧౭౦
జని చని ముత్త్రోవఁ - గని నడుదారిఁ
బయనింప యత్నించు-పట్టునఁ బ్రక్క-
త్రోవను చని కొంత - దూరమ్ము నందు
గల కొలనిం గని - జలములఁ ద్రావఁ
గోరి రేవున నుండు - కోవలు కడకు ౧౭౫
దారి దయ్యము వల - తలకొన వచ్చి
మాధవిం గామించు - మాడ్కి నితండు
వలచు నసుచు నెంచి - వాసంతమాల
యురువునఁ గనఁబడి - యులియు పూఁగొమ్మ
పగిది నాకోవలుఁ - పదముల కెరఁగి ౧౮౦
కన్నీరు కార్చుచుఁ - గడఁక నిట్లనియె
మాలికలో వ్రాయు - మాటలయందు
పొరపాటు లేదు నీ - పోఁడిమి వలనఁ
బలికిన పలుకులఁ - గలదు కాఁబోలుఁ
గావున నతఁడు కి-న్కను పూనినాఁడు ౧౮౫
అనుచు వికలచి_త్త-యై తపియించు
చున్నది మాధవి - యురు దయాకలిత !
తాపసులైన వి-ద్వద్వరులైన

విజ్ఞానులైన వి-వేకులె యైన
మనసు నొప్పించుట - చన దంద్రు కాదె
వదనమ్ము చూడ కొ-ప్పరికించు కతన
మాధవి వెలయాంద్ర - మనుగడ నీచ
మని బాష్పములు కార్చి - తన కేల మెడను
ధరియించి యున్న ము-త్యాల హారమ్ము
వడి దీసి పాఱంగ - వైచి నిర్వేద
మంది నన్నును వీడి-నది గాన మీరు
మధుర కేగుట దారి - మనుజుల వలన
విని పాతుతో వచ్చి - వెతఁ గుందుచుంటి
నేమని యుత్తర-మిత్తువో యనుడు
మరులు దేవత వన-మధ్యంబు నందు
కలదని విప్రుండు - తెలిపెను గాన
వంచనా భంజక - వరమంత్ర మహిమఁ
గల రూపెఱింగెదఁ - గాకని మంత్ర
మర్థి జపింప న-య్యది దుర్గ దేవ
తాక మగుట మిట్టి - తలఁకి దద్దఱిలి
యీ వనచారిణి - నేనౌట భ్రాంతి
గలిగించితిని దీనిఁ - గొంతికి సతికిఁ
దెలుపకు మని వేఁడి - దిచ్చుమోమయ్యె
నవలఁ దామర దొన్ని-యను శీతజలము

తెచ్చి కన్నగి దగ - దీర్చె నతండు ౨౧౦

ఎండ హెచ్చుడుఁ ద్రోవ - నరుగుట కష్ట
మని యెంచి మువ్వురు - నటఁ గురవకము
గోఁగును మరువమ్ము - వేఁగియుఁ బూచి
యున్న చల్లని త్రోవ - నొగి నేగు వారి
ధనము దోఁచుచు వర్ష-మునఁ బండు పంట ౨౧౫

కలుగమి వింటిచేఁ - గలిగెడి కృషిని
చేయు బోయలు యముఁ - జెనయు బలమ్ము
చేఁ బోవ విజయమ్ము - చేపడఁ జేసి
ప్రతిగాఁగఁ బౌరుష-బలిఁ బ్రతీక్షించు
చుండు నెత్తిని కన్ను - లొప్పారు కుమరి ౨౨౦

వేల్పులు వినుతించు - విమల విగ్రహము
గల యాలయమ్మును - గని యందు దిగిరి.

---

౧౩. వేఁటరుల యాటపాటలు

వేవెల్గు గాటంపు - వేఁడిమి వలనఁ
గన్నగి మిక్కిలి - గాసిలి యడుగు
లెత్తువారఁగఁ బొక్కి - లెగయంగ నిడుపు
టూర్పులు పుచ్చుచు - నుండంగఁ గాంచి
దుర్గాలయంబునఁ - దూఱి యందొక్క ౫

ప్రక్క నెవ్వరెఱుఁగ-రాక యున్నంత
బోయలపల్లెలోఁ - బూర్వంపు టప్పు
నడుగంగ శాలిని - యను నొక్క వదర
వచ్చి వేఁటరు లెద-వడి యంజి చూడ
దేవతావేశ మం-ది కరమ్ము లెత్తి
వెండ్రుకలు విదిర్చి - వెస మెడ త్రిప్పి
యడుగులు విదలించు - చాడుచు నిలిచి
యూరి వారొక్కచోఁ - జేరి భుజించు
రచ్చ కొట్టము చేరి - ప్రామొక్కుబళ్ళ
చెల్లింపకుంటచేఁ - జెలువుగఁ బగఱ
యూరఁ బసుల మంద - లొగి వృద్ధి నొందె
మీ కూటములు మేర - మీఱి పాడఱియె
నది గాక మీకు స్వా-మ్యంబైన త్రోవ
దోఁపిడితనమును - దొరకుట లేదు
పొసఁగ ధార్మికులకుఁ - బుట్టిన వారి
వలెఁ బౌరుషము లేక - వడిఁ గ్రుస్సినారు
బిచ్చంపు బ్రదుకు మీ - యిచ్చ నెంచితిరొ?
జింక తత్తడి వేల్పు - చేయిచ్చి యొసఁగు
గెలుపునకుం బ్రతి-ఫలముగా జీవ
బలి భుజించినఁ గాక - యలరి మీ విండ్ల
కిఁక మీఁద విజయమ్ము - నీయంగ రాదు
త్రోవ దోఁపిడి చేసి - తూలంగఁ ద్రావి

వర్ధిల్లు జీవిక - వాంఛింతురేని
మ్రొక్కుబడుల యప్పు - మొదటఁ జెల్లింపుఁ
డని పల్క విని బోయ - లది సమ్మతించి
తలఁచిన పగవారి - తలలు ఖండించి
పొగడొందుటలు గాక - పొనుఁగుపాటేల ?
యని యుత్సహించి గెల్పందిచ్చు కుమరిఁ
బాఁప పిల్లయురువు - బంగారు పేరు
చే జడ పొడవుగాఁ - జేరిచి చుట్టి
తోఁటలపైరుల - దొమ్మాడు చేయు
పందికొమ్ములఁ జంద్ర-వంకల వంటి
బలు కోఱలుగ నుంచి - పులినోరు చీల్చి
వాని పండ్లను లాగి - వరుసగాఁ గూర్చి
తాళిబొట్టుల పేరు - తగిలించి మెడను
రశనగా పులితోలు - రాజిల్లఁ జేసి
సెలవిల్లు చేనుంచి - జింక వాహనము
పైఁ జేర్చి మదనుని - ప్రతిమయుఁ జిల్క
యడవి కోడి నెమలి - యాట బంతియును
పొసఁగించి స్తుతియించి - పూవులు చల్లి
వన్నియ కలపంబు - బంగరు పొడియుఁ
జందనగంధమ్ము - గందవొడియును
నువ్వుల యుండలు - క్రొవ్వు టన్నంబు

బండరు హొడి ధూప - పాత్రమ్మొ మొదలు
గాఁగల వస్తువుల్ - గైకొని వరుసఁ  ౫౦
బడుచులు నిలువంగఁ - దుడుములు తమ్మ
టమ్ములు చిన్నముల్ - కొమ్ములు పిల్లఁ
గ్రోవులు పంబలు - మ్రోఁగంగ నెదుట
బలిపీఠమునకును - వాహనమునకుఁ
గుమరికిఁ బూజలు - కొమరుగాఁ జేసి  ౫౫
వినుతించి యాడిరి - వేడ్క వేఁటరులు
ననఁబోణియైన క-న్నగిని గాన్పించి
కొడగుదేశపు లక్ష్మి - పడమటి కొండ
రాణియౌ ద్రవిడ వి-గ్రహము జనమ్మొ
సలిపిన సత్తప-స్సార మీలోక  ౬౦
మునకు నిర్మల మణి - నెనయు స్త్రీరత్న
మనుచు శాలిని దేవ-తావేశమంది
పలికి పూజలఁ దృప్తి - పడితి నంచాడ
విన్న కన్నగి యీమె - విభ్రాంత యగుచుఁ
బలుకు పలుకు లని - ప్రాణేశు వెనుకఁ  ౬౫
జేరి యలఁతి నవ్వు - చెలఁగంగ నిలిచె.
చంద్రవంక ధరించు - జడముడి తెప్ప
లార్ప కుటిమి చూచు - నఖలు నంజు
మ్రింగి నల్లనయైన - మెడ పాఁప పేరు
మేరువు విలు చను - మిట్టల పైని  ౭౦

పాఁప కచ్చియ కేల - వాఁడి శూలమ్ము
కరి తోలు కప్పు సిం-గపుఁ దోలు రశన
గలది యందియ వీర - కటకమ్ము నెడమ
కుడికాళ్ళఁ గలది యె-ప్పుడు విజయమ్ము
కార్య సాఫల్యమ్ము - గలకత్తి కేలఁ ౭౫
గలయది మేనును - తలయును వేఱు
తెఱఁగులుగ బలిష్ఠ - దీర్ఘ బాహువుల
దున్న యసుర తలఁ - ద్రొక్కి నిల్చినది
కౌమారి నీలిని - గౌరి సంపూజ్య
శూలిని వెన్నుని - సోదరి కాళి ౮౦
సంపత్ప్రదాత్రి యీ-శ్వరి కలా కుశల
తోఁచిన రూపమ్ము - దొడ్డది యనుచుఁ
గన్నవారలు పల్కఁ - గరుణ చూపినది.

॥ కలవు పొన్నల గున్నలు - గన్నేరులును
తావి క్రోవులు మావులు - క్రేవఁ గలవు
ఆరెలుం గల్లు చందన - మారఁ గల్గు
భర్గు సామేని నేలెడి - దుర్గ యెదుట. ౧
వేఁగు లపరంజిఁ బోలిన - విరులఁ జిందుఁ
దొగరు పూల తేకులను బూ-రుగులు చిందుఁ
బేలలం బోలెఁ గానుగు - విరులు చిందు
భర్గు సామేను నేలెడి - దుర్గ యెదుట. ౨

తే॥ పూచె గోఁగులు వేఁగులు - పొన్నచెట్లు
వీచెఁ జల్లని మెల్లని - విరుల గాలి
పాడె గొండ్లికిఁ బెండ్లికి - భ్రమర పంక్తి
ఖడ్గ సామేని నేలెడి - దుర్గ యెదుట.

అంబ నగలను తాను నె-య్యమునఁ దాల్ప
నెంత తప మాచరించెనో- యీ కుమారి
యీమె పుట్టిన వంశాన - నెసక మెసఁగఁ
బుట్టు వేఁటరుల కులమ్మె - పొలుపు గాంచె.

దేవి యాభరణమ్ము లొం-దిన కుమారి
ఎట్టి తపమాచరించెనో- యెఱుఁగరాదు
ఈమె పుట్టిన వంశాన - నెసక మెసఁగఁ
గలిగినట్టి వేఁటరుల యీ - కులమె కులము.

పవన జవనముగల జింక - వాహనముగఁ
గొనిన దుర్గ సౌందర్య మం-దిన కుమారి
సలుపు తపమెట్టిదియొ యీమె - జననమంది
వెలసి నట్టి వేఁటగిరుల - కులమె కులము.

ఏన్గు తోల్గప్పి పులితోలు - నెసఁగఁ జుట్టి
కారు దున్నపై నిల్చితి - కడఁకఁ జూడ
వేదశీర్షార్థమై సురల్- వినుతి సేయ
జ్ఞానసారమై నిత్యమై - చనెద వేల ?

కత్తిఁ దాల్చి హరిణి నెక్కి - కడఁక మహిషుఁ
దెరలఁ జంపి నిల్తు విట మూ-ర్తిత్రయమ్ము
హృదయ కమల సదన వయి - యెసఁగుచుందు
జ్యోతి రూపమ్ముతో గుణా-తీత వగుచు.

తే॥ శంఖ చక్రముల్ కర పంక-జముల వెలుఁగ
సింగమెక్కి నిల్చితి విట - గంగఁ దాల్చు
శంభు నర్ధ దేహమ్మున - శ్యామలాంగి
వగుచు వేదవినుతి గొందు - వమ్మ! దుర్గ!

జేల పూవులు తులసి గూ-రిచిన పూల
మాల భుజములఁ దాల్చి కు-మారి వగుచు
వేల్పులకు గెల్పు గూర్పఁ దొ-ల్వేల్పు లోడ
నాడు మరగాలి యాట యిం-దాడఁ దగును.

పసిఁడి యందెలు వలయముల్-రశన మొరయఁ
గఱకు టసురలు నశియింపఁ-గత్తిఁ బూని
యేచి మరగాళ్ళతో నటి-యింప సురలు
పొగడి చల్లు పూవులు వాన-వోలెఁ గురియు.

బెట్టిదుండగు సీరూరి - వీరుఁ డరుల
పసుల మందఁ గైకొనఁ బోవు - పట్టునందు
భార్గవియుఁ బోవ నిచ్చింపఁ - బగఱయూర
నడవి నల్లంజి వారికిఁ - జెడుగుఁ దెలుపు.

మునుపు టప్పు నీయక కల్లు - పోయ ననుచు
గౌండ్ల దనఁ దన వెంబడి - గ్రద్ద లరుగఁ
బగఱ యాల మందలఁ బట్టి - బయలుదేఱు
వీరు వెంబడి దేవియు - వింట నరుగు.

ఆ.వె॥ మావి చాయదాన! - యీవానిఁ జూడుమా
వారి వేఁట ఫలము - పసులమంద
కొలుచునట్టి వైణి-కుఁడు తమ్మటీఁడు ము
న్నైన వారి యింట - నార నొప్పె.

వె॥ మందహాసవదన! - మంద వారేడ్వంగ
నాక్రమించుకొనిన - యాలమంద
లివ్వి కల్లు నమ్మ - నింతి నిమిత్తకు
నింట నిండి యుండె - నిచ్చఁ గనుము. ౧౪

పగఱ యూరె యేడ్వ - వారి జయించి తె
చ్చినవి యివ్వి వికచ - వనజనేత్ర!
ప్రల్లదులును ముసలి-వారలు నగు వీరి
యెదుట నిండి యుండె - నిచ్చఁ గనుము. ౧౬

వాలఖిల్య మునుల - వేలుపుల యిడుమ
లడఁచు పదములకు జో-హారు లమ్మ!
వేఁటరులకు గెలుపు - వేడ్క నొసంగితి
ప్రతి ఫలమ్ము గొమ్ము - రక్తఘటము. ౧౭

అమర పూజ్యమైన - యడుగుఁదమ్ములకు న
మస్కరింతు మమ్మ - మాఱుతురను
గెలిచి కదుపులఁ గొను - బలువేఁటరు లొసంగు
ప్రతి ఫలమ్ము గొమ్ము - రక్తఘటము. ౧౮

తుడుము తమ్మటములు - గుడుసు కొమ్ములు మ్రోఁగఁ
గారుటిరుల వచ్చు - వారు నీదు
భక్తవరులు వేఁట-వాండ్రు నీ యడుగుల
కప్పగించు రుధిర - మలరి కొనుము. ౧౯

దారి నడచు వారు - దండిగ నుండ వి
ల్లమ్ము లూని కొల్ల-లాడు చుండు
వేఁటకాండ్రు బత్తి - దోఁటు పూజలఁ గొను
మమ్మ! దేవి! కాళి! - యార్య! దుర్గ! ౨౦

తే॥ ధిగులు గొలుపు ధ్వనులతోడఁ - బగఱ నిద్ర
వేళ హింసించు వేఁటరుల్ - వేడ్క నొసఁగు
నర్చ లందుమ సుధ నాని - యసురు లడల
నంజు కడిగొని నిలిచిన - కంజనేత్ర !
పాంథుల ధనమ్ము చూఱాడి - వారి యెడల
నెనరు చూపని వేఁటరుల్ - నీకొసంగు
బలులఁ గొనుమ యర్జున పాద-పముల నడుమఁ
దూఱి పడఁద్రోచి శకటమ్ముఁ - దూలఁ దన్ని
మామ కంసుఁ జంపితి కద - మనుజ లీల.
నలువ సముఁ డగస్త్యుండున్న - మలయ మేలు
పాండ్యభూపతి పగవారి - బవరమందు
గెలిచి కదుపులఁ గొనువారి - ఖేటవృత్తి
డిందువాఱంగ జయము గ-డించుఁగాక.

---

## ౧౩. కోటపల్లె చేరుట

మంజ॥ వేఁటరుల కుమారి - వేసిన దైవ
వేసమ్ము వీడిన - పిదపఁ గోవలుఁడు
కడుఁ బుణ్యవతి యగు - కౌంతి పాదముల
కెరఁగి యీ కన్నగి - యెండ వేఁడిమిని
భరియింపఁ జాలదు - పలుకుఱా ల్గలుగు
నడవిత్రోవల నీమె - నడవంగ లేదు
త్రవ్వు వల్మీక తతి - భల్లుకములు

తఱుమవు బెబ్బులుల్ - తెఅలు జింకలను
కఱవవు పాములు - కాలఁ ద్రొక్కినను
పట్టవు మొసళులు - వారిఁ జొచ్చినను  ౧౦
పిడుగులు చల్లనై - పడుచుండు ధరణి
పాండ్య భూపతి పరి-పాలన మహిమ
బీఁటెండఁ జనుకంటె - వెన్నెలరేయి
నడవ నాయాసంబు - పొడమ దనంగ
గౌంతియు నంచుల - కెంతయు నొప్పి  ౧౫
దుష్పాలనమ్మునం-దున ప్రజ తేని
చావుఁ బ్రతీక్షించు - చందాన భాను
నస్తమయము చూచు - నట్టి వారలకు
పలు రిక్కలను సైన్య-ములఁ గూడి వెల్ల
కాంతులు విరియించి - కలువల ఱేఁడు  ౨౦
పాండ్యకులము నందు - ప్రప్రథముండు
తూరుపు దిక్కునఁ - దోఁచిన యంత
తారలఁ బోలిన - తార హారములు
కలపమ్ము చనులపైఁ - దొలఁగి మల్లాడఁ
దొగలు మొల్లలు జడఁ - దొఱఁగి యల్లాడ  ౨౫
చెందలిరులు మేనఁ - జేరక తొలఁగ
మలయంబునుం బుట్టి - మధురలోఁ బెరిఁగి
విద్వద్వరేణ్య జి-హ్వాకల నటించు

తెమ్మెర చంద్ర దీ-ధితులతోఁ బరవ
మాధవ చంద్రుని - మఱి వేఁడు చుంటి ౩౦
వాకొ యని భూమి ని-ట్టూర్చిన పిదప
నధిక మార్గాయాస - మందిన సతిని
కాంచి కోవలుఁడు శు-భాంచితగాత్రి!
నడయాడు నీత్రోవ - నడరి బెబ్బులులు
గూబలు గూయు నె-గ్గులు బొబ్బవెట్టు ౩౫
నంజక నడువుమ - యంచు న త్తరుణి
కరములు తన భుజ - గిరులపై వైచి
కొనుచుఁ బవిత్ర వా-క్కులు గల కౌంతి
యుపదేశ వాక్కుల -నొప్పుగ వినుచు
వెదుళులఁ బుట్టి ప-ర్విన యగ్గివలనఁ ౪౦
గాలి నల్లనయైన - కాననమందు
కోళ్ళు సూర్యునిరాక - కొమరుగఁ దెలుప
నాటల పాటల - నభ్యసించుచును
వైదికాచారముల్ - వదలిన విప్రు
లుండు పల్లియఁ జేరి - యొకచోట వారి ౪౫
నుంచి యతఁడు కొలం-కున్నెడ కేగెఁ
బడతితో నడవుల - నిడుమలు కుడుచు
కతన గొలిమి తి త్తి-కరణి నిట్టూర్చి
కలఁగి వాడుటచేతఁ - గసుమబ్బుచేత
నాతనిఁ దెలియలేఁ-డయ్యె గౌశికుఁడు ౫౦

ప్రియుఁడు వీడుటఁ జేసి - పెనువంత నొందు
మాధవివలెనె యీ - మాధవ తాప
మున మాధవీ! నీవు - మున్పు లొందితివె?
యను చొక్క పొదనీడ - కరిగి కూర్చున్న
కౌశికుండను వడు - గని పల్కు విన్న
కోవలుఁ డటకేఁగి - కోరిక నీవు
పలికిన పలుకుల - భావంబు వినఁగ
వలతు ననఁగ శంక - వదలి వటుండు
దాసి తనదు రాక - తగ నిట్లు తెలిపెఁ
దన తలి దండ్రులు - తలరుచు మణిని
నీఁగు సర్పము వలె - నెఱ తపించుటయుఁ
బ్రాణముల్ తొలఁగిన - మేనులఁ బోలెఁ
బడి చుట్టములు దుఃఖ-వనరాశి మునిఁగి
పరితపించుటయు సే-వకులను పనిచి
కోవలు రోసి తో-డ్కొని రండి యనుచుఁ
దండ్రి పంపుటయును - తన తండ్రి యాజ్ఞ
నెఱవేర్చుటయె గొప్ప - నియత ధర్మమని
యడవుల కేఁగిన - యాజిపుత్రకు వి
యోగంబు వలన న-యోధ్యయుం బోలె
సంగమ పురజనుల్ - సంతపించుటయు
తన శ్రీముఖ మ్మనా-దరము సేయుటలు
చేటి వలన విని - చింతతో నలఁగి

## ౧౩ కోటపల్లె చేరుట

పెను మేడ నడిమి ని-ల్వాన గది యందు
పనవుచు మాధవి - పడి యుండుటయును
ఆమె యంగద విని - యచటికిఁ దాను
చని యుండుటయుఁ దన్ను - గని యప్పడంతి
వందనం బొనరించి - వగఁ దీర్ప మనుచుఁ
బ్రార్థించి యొక కమ్మ - వ్రాసి మృత్తికను
ముద్రవైచి యొసంగి - మొగిని నీ వేగి
హృదయేశ్వరు వెదకి - యిమ్మని తన్ను
పంపుటయును తాను - బహుదేశములను
తిరిగి యలయుటయుఁ - దేటగాఁ దెలిపి
మఱిఁగి కృశించిన - మాధవి యొసఁగు
కమ్మ కోవలుని క-రమ్ముల సుసుపఁ
దానా చెలువఁ గూడి - తనివొందు తఱిని
పూసిన జవ్వాది - వాసన లేని
కురుల నొత్తిన మట్టి-గుర్తు చూపినది
కావున నమ్ముద్రఁ - గదలింప కవలి
ప్రక్క లేఖను విచ్చి - శ్రద్ధమైఁ జదివి

తే॥ పెద్దల పద పద్మములకు - వినతి చేసి
ప్రజ్ఞచాలని నా యల్ప - వాక్కు వినఁగ
వేఁడుచుంటిఁ బెద్దలసేవ - విడుటగాక
యాభిజాత్య కన్నగితోడ - నద్దరేయి.

తే॥ నేరికిం జెప్ప కేగ నే - నేమి పాప
మొనరిచితినో యెఱుంగ నా - యుల్ల మధిక
తాపమునఁ దత్తఱించెడిఁ - దలఁగఁజేసి
విఙ్ఞుఁడా ! కావుమని వ్రాయు - విషయ మరసి

చామ దోసంబు లేదని - శంక వీడి
తన దొసఁగె యంచు మదిని చిం-తనము చేసి
కమ్మయందలి యర్థమ్ము - కన్నతండ్రి
కొప్పిదముగ లక్షణచేత - నున్నదనుచు.

కౌశికా ! తల్లిదండ్రుల - కడకు నేగి
వారి చరణపద్మములకు - వందనములు
చేసె ననిపల్కి యీ కమ్మ - చేతికిమ్మ
మద్వియోగదుఃఖము వాప - మరలి వడిగ.

జనుమ యనిపల్కి - యాతని సాగనంపి
కన్నగియుఁ బవిత్ర చరిత్ర - కౌంతియున్న
కడకు నేగి దుర్గాదేవి - కలని వేస
మలరి పాడు గాయకులతోఁ - గలిసి మంచి

యేడుతంత్రులు గల వీణ - నెత్తికొనుచు
మెట్లు చూచి శ్రుతి స్వర - మేళనమున
మూటి నాలుగింటిని గాంచి - పొందుపఱచి
మధ్యమము శ్రుతిగా నుంచి - మంద్ర మధ్య

తారములయందు సంపూర్ణ - తరగతులను
మఱి యసంపూర్ణరాగ సం-బంధులరసి
కొంతసేపు వారలతోడఁ - గూడి పాడి
వీణ వాయించి సంతోష-పెట్టి పిదప

॥ మధుర యిక్కడకెన్ని యా-మడలో యనుచు
వారినడుగ నిట్లనిరి యో - భవ్యచరిత !
కాంచుమదె చేవ యగురువు - గందమలరు
సారమును కుంకుమంబు క -స్తూరి కలప ౮

మలఁది, కలువలు సంపంగి - కలయఁ జల్లి
మల్లె మొల్ల మాలిక లుల్ల-సిల్లు పడక
లందుగల వాసనయుఁ, బ్రొవు-లందునుండి
వెడలు తాళింపుపొగయు, నం-గడుల సప్ప ౯

మమ్మువారు కాలుచు పొగ, - హర్మ్యములను
వైచు నగరుపొగయు, మఖ-వహ్ని పొగయుఁ,
దక్కు పెక్కువగల పొగల్-నిక్కి క్రమ్మి
పాండ్యునాలయమందును - పరిఢవిల్లి ౧౦

విజ్ఞులకు మేరయిడరాక - వెలసి హృదయ
హారియగు కలపమ్ము నిం-డార విరియ
ధీర వాక్కులచే విను-తింపఁబడెడి
మలయమారుతమును క్రేణి - సలుపుపగిది ౧౧

మధురగాలి వీతెంచెడి - మలయఁగంటె
పాండ్యు నతిశయ సంపద్వి-భాసమాన
మధుర దూరమ్మున-లేదు - మగువ లొంటిఁ
జన్న నాపద దరియదు - చనుఁడు నాఁగ ౧౨

వారు కాంతితో మునుపటి-వలెనె రేయి
నడచి సర్వలోకేశ్వరు - గుడిని రాచ
నగర వెవ్వేఱమ్రోఁగు ప్ర-న్నని రవముల
మేలుకొలుపులు చెవులకు - మేలుకొలుప ౧౩

తే॥ ద్విజులు బ్రాఁజదువుల వల్లె-వేయు ధ్వనులు
మునిజనోదయ ధ్యాన సం-జనితరవము
నిత్యవిజయియౌ పాండ్యుని - భృత్యవరులు
వీరభటులొనర్చెడి బహు-విధ రవములు ౧౪

విజయచిహ్నంబులై యొప్పు - ద్విరదరవము
గిరులఁబట్టి తెచ్చిన గజ-ఘీంకృతులును
సవరనగ నున్న యశ్వహే-షా రవంబు
పొలముకాఁపుల పాటల - కలకలంబు ౧౫

సంగమస్థల మందలి - జలధి యులివు
పగిదిఁ గోలాహల ధ్వని - పరవ వినుచు
వంతలెల్లఁ దొలఁగఁ గుర-వకము గోఁగు
వేఁగి వకుళ చంపక కురు-వింద తిలక ౧౬

పాటలీ సురపున్నాగ - పారిజాత
వృక్షసంతతి పూవులు - విరిసి యడరఁ
గుటజ మాలతీ మాధవీ - కుంజ పుష్ప
రశన యొప్పారు దరులనఁ - గ్రాలు శ్రోణి ౧౭

తలముతో సైకతములను - స్తనములొప్పఁ
దరుల రాలిన మోదుగు - విరుల నోరు
వెల్లువంబడి కనవచ్చు - మొల్లపండ్లు
నల్ల యిసుక కురులు మత్స్య - నయనములును ౧౮

పరఁగ భువన సంపత్ప్రది-వర్తనమున
సత్కవీంద్ర వాగ్వినుత ప్ర-శస్త సకల
గుణగణౌఘ వైఘ నృపాల-కుల పతాక
తెలివ కయ్యెడి కష్టంబు - నెఱిఁగినయది ౨౧

వోలెఁ దావిపూవులనెడి - పోర్వఁ గప్పి
కొసుచు నశ్రువుల నడంచు - కొనఁగ నీటి
వెల్లి యిదిగాదు పూవుల - వెల్లి యనుచుఁ
గన్నగియుఁ గోవలుఁడు భక్తిఁ - గరములెత్తి ౨౦

మ్రొక్కి రేవున శార్దూల - ముఖ గజముఖ
సింహముఖ హయముఖములఁ - జెలఁగు నౌక
లందు పలువురు చనురేవు - లందు చనక
కుఱఁగలిం జిన్నరేవునఁ - దెఱవ తోడఁ ౨౧

గౌంతితోఁ జిన్న పడవను - కాంక్ష నెక్కి
వసులతోఁ జెలువారు ద - క్కినపు దరిని
చేరి యీ దివ్యపురిఁబ్రద - క్షిణము సేఁత
పాడి యనియెంచి కావలి - వనము చుట్టి ౨౨

యుండు నగడిత వలగొని - యొక్కయెడను
వీర లెడఁబాసి పొందెడి - గోరములను
తెలిసినట్టులు కలువలు - జలజములును
బాష్పములు నించి తేఁటుల - పాటతోడ ౨౩

వెక్కియేడ్చి యటమటించు - విధముదోఁప
శత్రుభయదంబుగాఁ బోరు - సలుపఁగోరు
వారిఁగని కోటబురుజుల - పైని పొడవు
సిడము లిటకు రాకుండని - చేతులార్చు ౨౪

తెఱఁగునఁ జలింపఁ బక్షులు - తీరుగ నడ
యాడుచుండఁ గనుల పండు - వగు పొలములు
పూలునిండిన కొలఁకులు - పొలుపు దెలుపఁ
బండ్లతోఁటలు గెలలతోఁ - బండి వ్రేలు ౨౫

పోఁక యరఁటి టెంకాయల - మ్రాఁకులొప్ప
వెదురుపందిళు లుటజముల్ - వెలయు నెలవు
లెంచగాఁ దగి ధర్మ మా - ర్జించు మునులు
తక్క నెవరు చేరని పురి - ప్రక్క పల్లె ౨౬
యందు చొచ్చిరి ముప్వు రా - నంద మంది.

---

## ౧౪ పుర సందర్శనము

మంజ॥ కోటపల్లియ చుట్టు - తోఁటలయందు
సరసుల యందును - తరువుల యందు
వంగిన వెన్నుల - వరిమళ్ళయందు
పక్షు లుచ్చావచ - ధ్వనితోడ లేవ
కొలఁకులఁ దామర - యలరుల బందు ౫
తొలఁగించు లోకబం - ధుఁడు పగతేంద్ర
శిరములదరఁ గత్తి - చేఁ దాల్చు పాండ్య
పురముఁ గూఁకు నుండి - తొలఁగించి లేప
విశ్వేశు కోవెల - విష్ణునాలయము
హాలధరు గుడియు ష - డానను గుడియు ౧౦
[1] ధర్మమార్గము వొల్చు - తపసుల యూళ్ళ

---

1. మూఁడాశ్రమముల వారికిని సన్న్యాసులకును దరిద్రులకు చచ్చి...
వారికిని దేవతలకును మునులకును విందులకు బందుగులకు తక్కినవారికిఁ దోడ...
పడుట అగ్నిహోత్రము శీల సంరక్షణము ప్రేమ, కరుణ మొదలగు గుణముల...
కలిగియుండు గార్హస్థ్యము ధర్మమనఁబడును. చర్యక్రియ యోగము జ్ఞానము గ...
సన్న్యాసమును ధర్మమనఁబడును.

రణభయంకరుడగు - ప్రభుని మందిరము
ప్రాంత రుచిత వాద్య - రవములు నిండె
ధ్యాన నిమగ్నుఁయై - తనదు స్వామినికిఁ
దటి గుఱుతించి వం-దన మొనరించి
నెటిఁ దప్పినాఁడనై - తెలవ కష్టింపఁ
గ్రొత్తనాటను దరి-ద్రుడ నయి దైన్య
మొందంగ వలసె నా - యున్నట్టి స్థితికి
నీ పురంబున నున్న - వేపారులకు మ
దీయ దుస్థితిఁ దెల్పి - తిరిగి నే వచ్చు
దనుక నీ సతి మీ ప-దంబులఁ గోట
యందుండుఁ గాన భ-యమ్ము లే దనఁగఁ
గౌంతి యిట్లనుఁ బ్రేమ-గల భార్యతోడ
ధర్మంబు తప్పి వ-దలి దుఃఖములను
కుడిచితి కాన నా - చెడుత్రోవనుండి
తలఁగుఁడు తలరేని - తత్పాపచయము
తలఁగక యగచాట్లఁ - గలిగించు ననుచు
ధర్మజ్ఞులగు వారు - తగిన పద్ధతుల
నోరసు తప్పెట - నారంగ నాల్క
యను కఱ్ఱతోఁ గొట్టి - యదలించి చెప్ప
మతిహీను లందలి - మంచి గైకొనరు
పదపడి తత్కర్మ - ఫలమును కుడుచు
నెడ భ్రాంతు లగుదురు - వెడఁగుఁదనమున

గ్రూర కర్మఫలమ్ము - గుడువనౌ నెడల
ఘేరులు కుందక - తెగువ నుండుదురు
యోగ వియోగ స-ముదిత దుఃఖములు
మరుని దుఃఖము చెలి - మరులు గొన్నట్టి
వారికిఁ గాక సం-ప్రాజ్ఞుల కున్నె ?
సుదతులు తిండియే - సుఖదంబు లనుచుఁ
దలఁచు మూఢులు పొందు - నలజడిఁ గాంచి
మునివరుల్ వీడిన - మోహ లతికనె
పట్టుఁగొమ్మగఁ గొని - పడరాని పాట్లు
పడి దరి గనలేక - యడలిన వారు
పూర్వులుం గలరు ప-ల్వురు నిక్క మిట్టి
దుర్దశ వే రూని - తొడరిక వచ్చు
నట్టి సనాతన - మైనదే చుమ్మ
జనకునాజ్ఞ వసుల - సతితోడ మనుచు
దద్వియోగమున సం-తాపమ్ము నంది
కుందు వాఁడు చతుర్ము-ఖుని గన్న తండ్రి
యగు వెన్నుఁడే యని - యరయవే నీవు ?
పుష్కరుచే జూద-మున రాజ్యమెల్ల
గోల్పోయి సతితోడ - ఘోరాటవులకుఁ
జని పతివ్రతను ని-ష్కరుణుఁడై నబుఁడు
నట్టడవిని నట్ట - నడురేయి విడిచి
పోవఁడే ? యది వారి - పూర్వదుష్ఫలము

కాక భైమియెడలఁ - గలదె దోసమ్ము ?
వారలఁ బోలిన-వాఁడవు గావు
సతి నెడఁబాయని - బ్రతుకు గాంచితివి
ఈ పట్టనమ్మున - కీవు ప్రాఁజింత
మఱచి యరిగి యందు - మర్యాద యెఱిఁగి
యతిథుల మన్నించు - మతి గలవార
లున్నచో నారసి - క్రన్న రమ్మన్నఁ
గంచియచే వంపు - గలిగి యగడ్తఁ
గరులకు రాక పో-కలకు నేర్పఱచు
క్రంత మార్గమ్మునఁ - గడువడి నేగి
కోట వాకిలి గాచు - కూటువల్ యవన
వీరుల కౌక శంక - చేరంగ నీక
లోని కేగి సహస్ర-లోచను మేలి
నగలుంచు పేటిక - తగ నోరు తెఱచి
నట్లున్న యాకోట - యందొక్క ప్రక్క
గాలికిఁ బడగలు - గదలుచు నున్న
వీథి యందున్నట్టి - వేశ్యలు తమ్ము
వలచి తిరుగు యువ - వ్రాతమ్ముతోడ
నేటి రేవునఁ దెల్ల - యిసుక తిన్నియలఁ
దెప్పల నెక్కుచుఁ - దెడ్లతో నడపి
తెప్పఁ బట్టికొని యీఁ - దెడి కాంక్షతోడ
చల్లని కమ్మని - మొల్లలు మెట్ట

దామరల్ కలువలు - దామముల్ గూర్చి
కొప్పులఁ జెరివి బా - గొప్పఁ జందనము
నలఁది పురప్రాంత - లలిత వనముల
విచ్చలవిడిప్రేమ - విహరించు కాంక్ష
సంకేత వేళలఁ - జంద్రశాలలను
ఇచ్చ వచ్చిన వేస - మింపార వేసి
చెలువుంద్రు పొగడ బూ - సెజ్జలనుండి
పూపనిగల పట్టు - పుట్టంబు గట్టి
కొప్పులఁ గుటజముల్ - మెప్పుగ ముడిచి
పర్వతాధిత్యకో - పత్యక ప్రసవ
ములఁ జుట్టి వక్షోజ - ముల పయి నెఱ్ఱ
గందమ్మున మకరి - కలు వ్రాసి తొమ్మ
నందు పగడసరుల్ - పొందుగ జేర్చి
కూడలి వజ్రికెఁ - గోరి కై సేఁత
చూపంగ వర్షర్తు - భూపుఁడు వాడ
గాలితోడుత వచ్చు - కాలంబు, మఱియు
మేఘముల్ ముద్దిడు - మేడల నగుచు
కట్టి కుంపటి సెగ - గాచుకోఁగోరి
ప్రియులతోఁ జెలువలు - వేడ్కతో నుండ
సన్న కన్నులు గల - జాల దోరములఁ
జల్లఁ దెమ్మెర వీచు - శారద వేళ,

కలయిండ్ల కలుకులు - కాంతులు చంద్ర
శాలల వెన్నెల - చవి చూచువారు ౧౦౦

లేయెండ చవిచూచు - లీల నొప్పారి
యినమండలమ్ము ద - క్షిణమునఁ దోఁపఁ
దెల్లమొగుళ్ల బొ - త్తిగ లేక యుండు
నెడమంచుకారగు - హేమంత ఋతువు,
వనరాశిలోని నా - వలయందు చోళ ౧౦౫

దేశీయు లుంచిన - దిటవగు నగురు
పట్టు గంధము పూల - వాసన కప్పు
రం బను వాని తో - రపుఁ దావి మోచి
వచ్చిన తూరుపు - వాయువు తోడ
మన్నీఁడు కూడలి - మదనోత్సవంబు ౧౧౦

గాంచెడి ముదిమంచు - కారగు శిశిర
ఋతువను రాజన్ని - యెడలఁ గలందు
సరిపూల గురివెంద - చిఱు తీవలెత్త
నందనములు తావి - ననలసు పూవఁ
గూన తెమ్మెర తోడఁ - గూడలి చొచ్చి ౧౧౫

వర దంపతులు పర - స్పరము గాటముగ
నలమికొనం జేయు - నవ్వసంతుండు
సర్వదా యచట వా - సము చేయుచుండు
నని పూవుఁబోండ్లు ప్రి - యాలితోఁ గూడి
పర్వంబుల గణించు - పరిమోదవేళ ౧౨౦

పిల్లలతో నున్న - పిడులతోఁ గరులు
నడుకు నల్లెండలు - మిడియు నక్కొండ
చెంత నడవియెల్లఁ - జిచ్చు పర్వాడు
కరణిని పడమటి - గాలితో వచ్చి
పురగి కూడలి నేలు - మాధవనేత
వేఱు ప్రాంతములకు - వే పయనింపఁ
దఱిమెడి వేసవి - తరుణంబు నందు
కొల్లారు బండియుఁ - బల్లకి మణుల
కోళ్ళ మంచము తోఁట - మెల్లఁ బచారు
చామరా లడపంబు - శాత ఖడ్గంబు
ప్రభు నాశ్రయమున వై - భవ జీవితంబు
పడుచుల పెండ్లిండ్లు - పరిథవిల్లంగ
చేడియల్ దెచ్చిన - పైఁడి గిన్నియలఁ
దేట కల్లాని మ - త్తిలి రొదసేయు
తేఁటుల నవిలేని - చోటుల మాల
తోడఁ దోలుచు దొండఁ - దులకించు మోవి
ముత్యాలకోవసు - పోబు దంతముల
ప్రభలు పర్వంగ చి -ర్నవ్వు నవ్వుచును
ప్రణయ కోపమున నూ - అట గొల్పకున్నఁ
జెలువల పోటు మా - టలు మదిఁ గాఁడ
నాల్కతోఁ దెలుపక - నవ్వుతోఁ దెలుపు
పలుకులు క్రేగంట - సలిపిన పోరు

కసుబొమల్ ముడివడం-గ నొసటఁ బొడము
స్వేదకణంబుల - మోదంబుతోడఁ
దిలకించు ప్రియులచేఁ - దేఱుచుచుండ ౧౪౫
దణువులును కోరంగఁ - బగ్గ వీదియును
[1] ఇటుకలు నెత్తిపై-కెక్కంగ నీక
గౌరవమున మనఁ-గోరు భూపతులు
వసియింప నను వైన - వాడలు గలిగి
శాంతి వినోద దృ - శ్యములు స్వభావ ౧౫౦
మరసి క్రమము చెడ - కాడు నాటలును
పాటలు తాళముల్ - వాని భేదములు
జతఁ బాడ వేణువుల్ - సాదన చేసి
[2] నాల్గువిధము లభి-నయ పద్ధతులను
స్వర పద్ధతులను మా-ర్చుచు నేరుపును ౧౫౫
పరఁగంగఁ దలకోలి - బిరుదు గలదియు
పల్లవి మఱి యను - పల్లవి చరణ
మావర్తముగఁ బాడు - నాట వెలఁదులు
నాల్గు మార్గంబుల - నాణెంబు నొంది
ధృతి వేయు నెన్మిది - దీనారములను ౧౬౦

---

1. వ్యభిచరించిన వారినెత్తిపై ఏడు కాలిన యిటుకరాలుంచి ఊరు చుట్టించి వదలుట పూర్వకాలపు దండనము.

2. నిలుచుట (నిట్రల్), కదలిక (ఇయంగల్), హస్తక్రియ (ఇరుత్తల్), ఉనికి (కిడత్తల్). (సాత్త్వికాంగిక వాచికాహార్యకములు కావు).

ఏరికిఁ జేరంగ - నీయని నేర్పు
గలిగి సోకు పిసాసి - కరణిని మెలఁగు
వెల వెలంది కసుల - వలలోనఁ దవిలి
సాధింప నరుదైన - జ్ఞానంబు గ్రుంగ
దపసులైనను తమ్మి - తమ్మికిఁ దిరుగు ౧౬౫
భ్రమరంబులం బోలు - కమనులెయైన
కామరుచియె యెఱుం-గని వారలైన
గలయికలో మున్గి - సొలసి నిద్రిల్లఁ
బఱచు నేర్పున నఱు-వది నాల్గు కళల
నారి తేఱిన వెల-యాండ్రున్న వాడ ౧౭౦
కొల్లారు బండ్లును - పల్లకుల్ తేర్లు
వివిధ కవచములు - వింజామరములు
అరపట్టికలు మంచి - యంకుశములును
వంపుకట్టులు తేరు - వడములు త్రాళ్ళు
ములుకేడెములు పంది - మూతి కేడెములు ౧౭౫
అడవికేడెమ్ములు - పొడుచు కోలలును
లోహంపుఁ గోలలు - లోహ పాశములు
సవరముల్ దంతంపు - సౌరు దువ్వెనలు
ధూప పాత్రములు చాఁ-దులు పూలసరులు
మున్నగు రాసుల - మొనరుచుఁ బ్రభులఁ ౧౮౦
గాంచఁగాఁ గోరు నం-గళ్ళ వీదులును
అయిపులు పంద్రెంట - నగ్గలమ్ములగు

కాకపాదము కలం-కము రేఖ బిందు
వను నాల్గులేక గు-ణావలిఁ గొఱఁత
వడక సునుపు రంగు - పక్షముల్ మొనలు ౧౮౫
స్వచ్ఛ కాంతులు గల - వజ్రసంతతులు
అయిపు లెనిమిదింట - నధిక దోషములు
కఱి గీఱ మాలయ≡ - పౌరపులు లేని
పసిమియు చాల వి-భావసు కాంతి
గలిగి చెన్నరు మర-కత వితతులును ౧౯౦
పౌర పొచ్చెములు లేని - కురువిందములును
నీల రత్నములు మా-నికములు మంచి
గోమేధికమ్ములు - కొమరు పుష్యమ్మ
రిక్కఁ బోలిన రూపు - చొక్కంపుఁ బసిఁడి
రంగు రంగరు పుష్య-రాగ రత్నములు ౧౯౫
కలఁక లేని పరిధి - కాంతియుఁ దేనె
వన్నియ నొప్పారు -వైదూర్యమణులు
ఇరులు గల్పించు న-ల్లైసఁగు నీలములు
ఇరు వన్నియల పొందు - నెనయు రత్నములు
ఏకమౌ జన్మంబు - నేను భేదముల ౨౦౦
కాంతులు గుణములు - గలిగిన మణులు
గాలి నీరము మన్ను - కల్లుచేఁ గలుగు
గరుసు దోసమ్ములు - గలుగక తేట

కాంతి నొప్పారి యం-గారక [1] చంద్ర
గురులఁ బోలిన పన్నెఁ - గొమరారు నాణి
ముత్తెమ్ములును బెజ్జ - ములు గల్గి చొట్ట
నొక్కులు పుప్పియు - నెక్కడ లేని
తీఁగ పగడములు - తెగల లక్షణము
లెఱిఁగిన వణిజులు - వరుసగ సుంచి
యరి చోరభయ మిసు - మంత యరయని
రత్నాల యంగళ్లు - రాజిల్లు వీథి
జాత రూపమ్మును - జాంబూనదమ్ము
శుక పక్షము మఱి హా - టక మను నాల్గు
తెఱఁగుల బంగారు - గుఱుతు లెఱుంగు
వర్తకుల్ సంశయం - పడఁ బని లేని
పగిది శీర్షికలను - వ్రాసి యందందు
కట్టిన పైఁడి యం - గళ్ల వీదియును
పట్టున సన్నని - ప్రత్తి దారమున
నెలుక యున్నిని పలు - పలు పగుదులుగ
పడికించి నేయించి - వందవందలుగఁ
బేర్చిన పేర్పులు - వేల కొలంది
గలుగు వస్త్రాల యం - గళ్ల వీథియును
త్రాసులు గుండ్లు బ్ర - ద్దలు గలవారు

1. చంద్రుఁ గురువు శుక్రుఁడని వ్యాఖ్య.

౧౫ ఇల్లడ

తూముఖ గలవారు - దొండడి గాఁగఁ
దఖఁగు కాండ్రు విలువఁ - దిరిగెడివారు
మిరియాలతో సన్ని - తెఱఁగుల ధాన్య
శాలల నొప్పు మం - డీల వీథియును
బ్రాహ్మణ క్షత్రియ - వైశ్య శూద్రులను
జాతి వాడలును త్రి - సంధి చతుష్క
మును గుడు లంగళ్లు - మొనయు వీదులును
మండపమ్ములు పలు - మార్గముల్ కలియు
కూడలులును సందు - గొందులు తిరిగి
నడుమింటి ప్రొద్దు నెం - డయుఁ జొరకుండు
పచ్చని తీఁగల - పందిళ్ల నీడఁ
తిరిగి పాండ్యేశ్వరు - పురమును గాంచి
డెందాన నానంద - మంది కోవలుఁడు
నడతెంచె గ్రమ్మటి - విడిసిన యెడకు.

---

౧౬ ఇల్లడ

మంజరి॥ అవనికి బహుళ భా - గ్యమ్ము లొసంగు
కరుణామయాజ్ఞ స - క్రమముగాఁ బూని
నెరపు పాండ్యుల గొప్ప - పడువు నిల్కడయు
గొడుగుచలువ యేలు - బడి మేల్మి ఖడ్గ
విజయమ్ము విలసిల్లు - వినయ శీలములు

ప్రజల నెమ్మదియును - పరికించి కాంచి
కోట వెల్పల ముని - కోటి వసించు
పల్లియ తోఁటకు - మెల్ల నేతెంచి
మధుర సౌందర్యమ్మ - మధురాధి నాథు
విభవమ్ముఁ గౌంతికి - వినిపించుచుండ
కడలి నీరె యగత్తు - గాఁగ నొప్పారు
చెంగా డనెడి యూరఁ - జెలువార నుండు
వేద పారఁగుడు వి - వేకి సచ్ఛీలి
లలిత వాక్యండు మా - డలుఁడను వాఁడు
మలయ పర్వతమును - వలగొని కుమరి
తీర్థాన నీరాడి - తిరిగి స్వస్థలము
చేరఁ జనుచుఁ గౌంతి - చేరిన తోఁట
కేగ నతనిఁ గాంచి - యెదురేగి మ్రొక్కి
కోవలునకు వాక్య - కోవిదుఁ డైన
మాడలుఁ డిట్లను - మానిత సుగుణ!
ప్రభునిచేఁ దలకోల - పడసి పేరొందు
మావిచిగురుఁబోఁడి - మాధవి యొక్క
పాల బ్రదుకు నాఁడు - పడుచును గాంచి
పురుడు దీఱిన యాల - ముదుసలి గణిక
లరుదెంచి బిడ్డకు - నరుదైన పేరు

1. చెంగాడు = శోణవనము

పెట్టుద మని పల్క - విని నీవు తొల్లి
నడురేయి కడలిలోఁ - బడవ బొందవడి
మునుఁగ మా పూర్వుండు - పూర్వదినములఁ
బుణ్య దానమ్ములు - పొనరుచు కతనఁ
జాల దినము లీఁది - చని యొక్క దీవి ౩౦
చేరంగ నొక వేల్పు - చేరంగ వచ్చి
యీదీవిఁ జేరు వా - రెవ్వారలైన
దైత్యుల హింసకుఁ - దలఁగి కావుమని
వాసవుఁ డంపంగ - వచ్చిన దాన
నను మణి మేఖల - యనువారు జనులు ౩౫
తలరకు నీదాన - ఫలము నిచ్చెడి
చన దీకడలి నీఁదు - సరణిని దుఃఖ
వనధి దరిం జేరు - మని తెచ్చి యివల
విడిచిన మా యిలు - వేల్పు పేరె
పెట్టుఁడీ యని కత - వినిపించు నంత ౪౦
మణిమేఖలయు నితం-బములఁ జలింప
వెలసిన గణికలు - వేవురు కూడి
మణిమేఖలాదేవి - మహిత నామమ్ము
నుంచి దీవించఁగా - నువిదతో నీవు
కరముల నుండి బం-గరు వాన కురియ ౪౫
దానము గొనువేడ్కఁ - దడఁబడు నడక
నూఁతకోలను గొని - యేతెంచు గూని

విప్రుని ముదుసలి - విజ్ఞాన నిధిని
మావటి యంకెకు - మరలక మీఱి
చని చుట్టుకొను మద - సామజాతమ్ముఁ
ద్రుటిలోనఁ దఱిమి వి-ప్రుని విడిపించి
తొండమ్ము క్రిందుగాఁ - దూఱి దంతమ్ము
వట్టికొని యడంగి - వడి గుంటి క్రింద
దాఁగిన యొక్క వి-ద్యాధరు మాడ్కి
నుండి మెడకు నెక్కి - యుక్కఱఁ ద్రొక్కి
యురు దయావీర ! మ-హోదార ! నినుఁగుఁ
గాచిన ముంగిని - కాంత చంపంగ
నా పాప మాఱ గం-గాపగా స్నాన
మొనరింపఁ బయనమై - చను భర్త తెగడ
నంగలార్చుచు భార్య - యట వెంబడింప
నీచేతి యోరెంబు - నేఁ దినఁదగదు
దీని యర్థము తేట - తెల్లగఁ దెలియు
వారి కిమ్మని [1] యొక్క - పద్దెంబు వ్రాసి
యిచ్చి పోవఁగ నామె - యిల్లిల్లు దిరిగి
పాపము పాపి స-త్ఫలము గొనుండి
యనుచుండు దాని ర-మ్మని పిల్చి నీవు
చెందు పాపం బేది ? - చేతి యాకేమి ?

---

1. అపరీక్ష్య న కర్తవ్యం కర్తవ్యం సుపరీక్షితమ్,
పశ్చాద్భవతి సంతాపః బ్రాహ్మణీ నకులం యథా॥

యన నామె తానొందు - నధిక దుఃఖమ్ము
వాకొని పద్దెంపు - టాకు నొసంగి
ధన మిచ్చి నా పాప - మును తొలఁగింపు ౭౦
మని కోర నంజకు - మని దుఃఖ మేను
తీర్చెద నంగద - నోర్చుమ యనుచు
నప్పుడ యార్యులు - చెప్పిన విధులఁ
బాఱుత చేసిన - పాపమ్ము దీఱ
దానముల్ చేసి సం-తాపమ్ము మాన్చి ౭౫
యడవి త్రోవంబట్టి - యరిగిన యామె
విభుని జనులఁ బంపి - వెదకి తెప్పించి
యధిక సంపద నిచ్చి - యాతని గృహము
నిలువఁబెట్టిన దయా - నిధివి నీవయ్య !
ఒక పతివ్రతపయి - నూరక వట్టి ౮౦
యగడు మోపఁగ నామె - మగనిని కల్ల
సాక్షితోఁ గొండెముల్- చాటిన వానిఁ
దపసివేసము నూని - దాఁగి చరించు
వానినయినఁ బట్టి - వాత వైచికొను
భూతమ్ము తన పాశ-మునఁ గట్టివైవ ౮౫
నల వాని తల్లి సెం-జలిఁ గాంచలేక
వీనిని చంపక - వీడుము మాఱు
గాఁగ నా ప్రాణముల్ - కైకొను మిత్తి

నని నీవు పల్కఁగా - నాభూత మపుడు
పాపి ప్రాణములకుఁ - బ్రతిగఁ బుణ్యాత్మ  ౯౦
ప్రాణమ్ములం గొని - పరలోక గతుల
హతము చేసికొను ప - ద్ధతి యిట లేదు
పదమని యెదుటనే - పాపాల ముద్దఁ
జీల్చి భక్షింపఁగాఁ - జింతించు నామె
తోఁ జని యాతని - తోయంబు వారి  ౯౫
కాఁకలి నొవ్వి పో - కార్చి పెక్కండ్లు
తేఁకువఁ గాచిన - దీన మందార !
వృద్ధగోపాల ! నే - నెఱిఁగిన వఱకు
నీవు కావించిన - పీ జన్మమందు
సత్కర్మములె కాఁగ - సాగర కన్య  ౧౦౦
మాణిక్య పల్లవ - మగు కల్కితోడ
నిట్లు వచ్చుట పూర్వ - కృత కర్మఫలమొ ?
యని మాడలుం డన - ననియెఁ గోవలుఁడు
ఒక యల్పువలనఁ బాం - డ్యుని పురమందు
ఐదు వగల జడ - లల్లుకొనియెడి  ౧౦౫
కన్నగి, కనువాడు - కన్నీరు కార్పఁ
దగు దుఃఖమంద నే - ధరియించు వలువ
పరులు కైకొన నేను - పందిపై నెక్కి
జరిగిన ట్లిమెతో - సంసార బంధ
మీఁగిన వాఁడందు - హెచ్చైన పదవి  ౧౧౦

నే నొందినట్లును - సూన బాణముల
పరుభూమి డిగవీడి - మదనుండు చేష్ట
లుడిగి యేగగ బోధి - యుర్వీజము కడ
మణి మేఖలను గొని - మాధవి యేగి
బుద్ధున కర్పించి - పోయిన యట్లు
కడ జాము రేయొక - కలగంటిఁ గానఁ
జెడు గేదొ శ్రీఘమ - చెనయు నన్ననుడు
నన్ని బంధమ్ముల - నడుగంటఁ ద్రుంచు
సన్నాసులకుఁ గాక - చనునె మీబోఁటి
వారిటనుండఁగా - వల దీ పురమునఁ
గల వణిజులు నీ య-గణ్య యశంబు
వినిన వారయి గాన - వేడ్కతో నీకు
నెదురేగి కొంచుఁ బో-వుదు రట్లు చేయు
చాలింపు మిట నుండి - సప్తాశ్వుఁ డస్త
గిరిఁ జేరు మున్నె నీ - తరుణితో నగర
మునఁ బ్రవేశింపు మా - యని మాడలుండు
కౌంతియుఁ బలుకుచోఁ - గాంచి యాకోట
వెలుపలి ప్రాయూర - వేంచేసి యున్న
స్త్రీదేవతకు బలి - క్షీర మొసంగు
నది మాచరి యనెడి - ముది గొల్ల వనిత
యరుదెంచి స్వామిని - యడుగుల మ్రొక్కి
నావుల మేపుచు - నా ఫల మెల్ల

వారి కొసఁగు గొల్ల - బ్రదుకున నుంత
యేని దొసఁగు లేద - యీమె నిర్దోష
వృద్ధ సచ్ఛీల యీ - వెలఁది గృహమున
కన్నగి నుంచుట - కడు సమంజసము
సంకటంబును జంకు - కొంకు లేని పని
యని కౌంతి తలఁచి యా - యమతోడ ననియె
కన్నగి శ్వశురు పే - ర్వెన్న మాత్రానఁ
దత్కులజాతు లీ - స్థలి నున్న వారు
పెను లిబ్బిఁ గన్నట్టి - పేదల మాడ్కి
గోరికతో నెదు - ర్కొని కొనిపోవు
వారంత వఱకు నీ - వనితను నీకు
నిల్లడ యుంచితి - నింతిఁ గొంపోయి
మొగి శుద్ధజలమున - బోరుకాడించి
చలువ వలువ గట్టి - చెఱువారఁ గనుల
కంజన మిడి తల - యమరిక దువ్వి
తుఱుమున నరవిరుల్ - తుఱిమి యీ యమకు
నేడుగడగ నీవ - యేపారు మమ్మ
తన్వంగి చిన్ని పా - దమ్ముల మున్ను
పృథివిదేవియుఁ గాంచి - యెఱుఁగదు భాను
నెండ నలఁత గొన్న - హృదయేశుఁ గూర్చి
నడుకు పుట్టించు నం - గద నొంది నాల్క

మెండ నధ్వ్రశ్రమ – మెఱుఁగనిదగుచుఁ
బతులకుఁ దోడగు – సతుల వ్రతంబు ౧౫౫
నిష్ఠఁ బూనిన యిట్టి – శ్రేష్ఠ దైవంబు
గాన వేఱొక వేల్పు – గానము గాన
మేటి క్రొత్తడు లున్న–నాట మేఘములు
కాలాన వర్షించుఁ – బాలన చెడదు
పంటలు దండిగాఁ – బండు సత్యంబు ౧౬౦
ధర్మంబు చెడదను – తద్జ్ఞుల పలుకు
విని యెఱుంగవా తప–స్వీను లిచ్చినట్టి
న్యాసంబుఁ గాచుట – యరిది కాదైన
గొప్ప యానందంబు – గూర్చున దగును
విందువు గాక కా–వేరిపూ నగర ౧౬౫
మున నశోకము నీడ – మున్ను శ్రావకులు
నిలిపిన యొక శిలా – తలముపై నిలిచి
జైనధర్మమ్ములఁ – జారణుల్ దెలుప
మెఱుపు నా విలసిల్లి – మిఱుమిట్లు గొలుపు
మేనితోఁ బొడవు ప్ర–సూన హారమ్ము ౧౭౦
తో హేమ భూషల–తో వేల్పులెల్లఁ
గైమోడ్పఁ దగు దివ్య – కాంతితో నలుపు
వ్రేలు గలిగి కోఁతి – కేలితో నొక్క–
వేలుపు ప్రత్యక్ష – విధి నిల్వఁ గాంచి
లోకవ్రతతతి కే–ల్మోడ్చి చారణుల ౧౭౫

నీ వేల్పు రాకకు - నేమి కారణము ?
వినిపింపఁ దనుడుఁ జా-రణ నాయకుండు
పలికె నుపాసంబు - వదలంగ నెంచి
వచ్చిన పలువురు - వ్రతు లొగిఁజేరు
గృహమున నొక ముని-శ్రేష్ఠుని గాంచి ౧
'ఎట్టి' య[illegible] రా బిరు - దెనసి వర్తిల్లు
సాయలు నిల్లాలు - చేయెత్తి మ్రొక్కి
భిక్షకై రండని - వినతిఁ గొంపోవఁ
బిన్న కోఁతి యొకండు - వెఱపుచే నొదిఁగి
యా యింటఁ జొచ్చి య - య్యమలుని యడుగుఁ ౧
దమ్ములకడనిల్చి - తద్భుక్త శేష
మానందమున మెక్కి - యాతని మోముఁ
గాంచిన తీరును - గాంచి యమ్మౌని
యో తల్లి! నీ తనూ-జాతుని పోల్కి
దీనిఁ గాతువు గాక - తేఁకువ ననిన ౧
నా మహామహుని వా-క్యము నిక్కపఱచి
యామె కోఁతి మరించు - నందాఁకఁ బెంచి
యంత్యక్రియలు దీర్చి - యధమ దేహమ్ము
తొలఁగ మేలగు నీగి - సలిపెను గాన
వారణాసి యనెడి - పట్టణ వాసి ౧
యుత్తర కౌత్తున - కొంద నా కోఁతి
కొమరుడై పుట్టి మే - ల్కొమరు రూపొంది

గొప్ప గెల్పులతోడ - గొప్ప దానములు
కావించి దిక్కుల - కడల సత్కీర్తి
నిండించి ముప్పది - రెండవ యేఁట ౨౦౦

వపువుఁ ద్యజించి ది-వ్యత్వమ్ము నందెఁ
గాన సంపాదించు - కలిమి ఫలమ్ము
దాన ఫలమ్మని - తగఁ జూప నొండు
కోఁతి చేయిగఁ గొని - కోరిక మీఱ
సాయలు నిల్లాలు - సలిపిన దాన ౨౦౫

ఫలమున నీ రూపు - పడసితిఁ గాంచుఁ
డని శ్రావకులకుఁ దా - నర్మిలిఁ దెలుప
నీ దివ్యరూపుఁ డీ - య్యేడ నిట్లు కానఁ
బడియె నసుచు ముని-వర్యుండు పలుకు
ధర్మంబు విన్న యం-దలి తపస్వులును ౨౧౦

స్వార్థ రహితులు శ్రా-వణులు సాయలుఁడు
వాని భార్యయు మోక్ష-పదమంది నారు
దానమహిమ మిది - తత్పర మతిని
సమ్మతించివేని - యిమ్మానవతిని
వెంటఁ గొంచింటికి - వెడలుమ యనిన ౨౧౫

కొంతిపల్కుల కామె - కడు సంతసించి
లే సిగ్గు మొలచు ల-లిని దంత రాజి
లే మొల్క వెదురుఁ బో-లిన భుజములును
కడుఁదెల్వి గలిగిన - కన్నగితోడఁ

దపనుని వేఁడిమి - తగ్గిన వేళఁ ౨౨౦
గ్రేపులఁ దలపోసి - చేఁపుల తోడ
మెడలెత్తుకొని పరు-విడు పాఁడి యాల
వెంటను గొఱ్ఱెల - వెంటఁ బిల్లలను
భుజముల నిడి చిక్క-ములు చంక వ్రేల
గొల్లలు రా వెంట - గొల్లతల్ కొంచ ౨౨౫
ఈయమ క్రొత్తయా - సేయూహొ యనుచుఁ
బ్రక్కల వెనుకల - వచ్చుచునుండ
కావలి యడవి య-గడ్తయు యంత్ర
ధనువులు కఱికోఁతు-లను బోలు యంత్ర
ములు వడిసెలలును - వలచు సేయియును ౨౩౦
రాగి కరంచు పా-త్రలు కొలుములును
రాల గంపలు కిట్టి - కోలలు చిలుకు
లఖు గొలుసులు కోడి - యంగు కుంపటులు
కొఱ్ఱులు గడియ మ్రాఁ-కులు గొట్టములును
గానుఁగ మ్రాఁకులు - కఱకు శూలములు ౨౩౫
పొదులు గోడల మీఁదఁ - బొదుగు శూలములు
పక్షుల ముక్కులు - పంది ముక్కులును
వెదురుదండంబులు - విసరు కఱ్ఱలును
కుంతంబు లీఁటెలు - కుఱు పిట్ట తలలు
మొదలుగాఁ గల యంత్ర-ముల దయివాఱి ౨౪౦
సర్వదా విజయంబు - సాధించి నిక్కి

చలియించుచున్న ధ్వ-జమ్ముల నలరు
వాకిలి దాఁటి య-వారణ త్వరను
రహి శరణాగత - రక్షణ భరణ
కరుణ మాదరి తన - శరణమ్ము చేరె. ౨౪౫

---

## ౧౭ వధ విధానము

రి॥ కన్నగి న్యాసంబు - గాఁ గొన్న గొల్ల
మాదరి చల్లమ్మ - మడఁతుల తోడ
నిలుప మనసు రాక - నీడ పందిరియుఁ
గంచెయుఁ గల్గి చి-క్కని యెత్తు మట్టి
పూఁతచే నలరారు - పూరింటఁ జేర్చి ౫

గొల్లచెలులఁ గూడి - గోర్వెచ్చ నీట
తానంబు చేయించి - తన్నగరమున
మగువలు కై సేయు - మాడ్కిఁ జేయింప
నక్కఱ లేని స-హజ సుందరాంగి
సేవ గావించు నీ - చెలువ నా పుత్రి ౧౦

బంగారుగా నిన్ను - భావించు దాన
ఎలనాఁగ నాతోడ - నిచ్చట నిలువు
కౌంతి మార్గాయాస - మింతయు లేని
త్రోవలోఁ దెచ్చి ని-ర్దుష్ట మౌచోట
వదలెను గాన నీ - పతి కింక నిచటఁ ౧౫

గఱుగను చింతింపఁ - గారణ మనుచు
[1]శ్రావక వ్రతమున్న - జనులు మీరౌట
పగటనే భుజియింప - వలయు వస్తువులు
పాత్ర లున్నవి వంట - పని చూడు మనుచు
గొల్లల స్థితులకుఁ - గొదువ కాకుండ
పూజ్యుల యీవి నాఁ - బూవక కాయు
పనసయుఁ జిక్కుడు - వంకాయ బీఱ
మాతులుంగంబును - మామిడిపండ్లు
అరఁటుబు శాలిబి-య్యము పాలు నేయి
కొనుమని యీయ న-క్కోమలి కొనుచు
వ్రేళ్లెఱ్ఱగాఁ గత్తి - పీఁటపైఁ గోయఁ
గడు నందమైన మొ-గమ్ము చెమర్చె
నెఱ్ఱ సిరల కన్ను - లెఱ్ఱ వాఱినవి
నల్లఁ బాఱిన ప్రొయ్యి - నల్లనఁ గాంచి
మొగము వన్నియ మాఱఁ - బ్రొయ్యి ముట్టించి
చెలి సాయ మొనరింపఁ - జేతనైనట్లు
భర్తకొఱకు నయి - పడఁతుక వండి
సొరైన తాటాకు - చాపపై నతఁడు
కూర్చున్న యంతటఁ - గూరిమి మీఱ
మట్టిపాత్రము గొని - మగని పాదములఁ

1. సన్న్యసింపక యాచరించు వ్రతము.

గడిగిన నీరమ్ము - విడిగిన పూవు
వలె నున్న యఱచేతఁ - బట్టి భూదేవి
మోహమ్ము తీర్చిన - మొగివోలెఁ జల్లి
యలికి కన్నెయరఁటి - యాకును పఱచి
యన్నముంచి భుజింప - నగు నన్నయంత ౪౦
వణిజులకుం దగు - బలి మొదలైన
వౌనరించి ప్రేపల్లె - నొగి వెన్న మెక్క-
వెన్నుఁడే యిప్పు డీ - ప్రేపల్లె మెసవు
కోవలుఁ దగు నీమె - గొల్లల యింటఁ
బుట్టి కృష్ణుని ప్రేమ-మును గుత్తగొన్న ౪౫
యా రాధయే ; వీరి - యంద చందములు
కన్నుదోయి కడంగ - కున్నవి యనుచు
మాదరి తత్పుత్రి - మఱి వినుతింపఁ
బ్రియముతోడ భుజించి - విశ్రాంతి గొన్న
పతికిఁ దాంబూలంబు - భక్తితో నొసఁగు ౫౦
చెలువను రమ్మని - చేరంగఁ దీసి
నీ మృదు పదములు - నిష్ఠుర శిలల
నడవంగఁ దగినవా ? - నలిన దళాక్షి !
వేఁటకాంద్రుర యూళ్ళ - విడియంగ వలసె
మనము కానక యుండ - మన తల్లిదండ్రు ౫౫
లెట్టి వంతల నొంది - యే మయి రొక్కొ !
కల్లగాదిది కల - గాదు బలీయ

విధికృతమో యేమొ - వెలఁది యెఱుంగ
వదరలతో విట - పాళితోఁ గూడి
నీచుల యల్ప వా - ర్నియతులు కేరు
ప్రల్లదంబులకు నేఁ - బాత్రమై మఱియు
సద్విధుల మఱచి - సత్యవాక్యులగు
పెద్దల నడపడి - వీడి వంశమున
కపకీర్తి యొదవించి - నట్టి నా కింక
సద్గతి కల్గుట - స్వప్నవార్త చుమి
తల్లిదండ్రుల సేవ - తగ వీడినాఁడ
ననుపమసతి నీకు - నపచారి నైతి
నభిజనమ్మను హైన్య - మనక వీడితిని
వెడలుమనంగ నా - వెంట వచ్చితివి
అరుదగు నాగంబు - లాచరించితిని
అని కోవలుఁడు పల్క - ననుతాప మతిని
ధార్మికులకుఁ దృప్తి - దానంబు సేఁత
అతిథుల మన్నించి - యాదరించుటయు
భూమీసురుల కోర్కె - పూజించి యిడుట
సన్న్యాసుల కెదురు - చనుటయు వీడు
నా యెదుటికి మేటి - నాణెంపుఁ గీర్తి
ప్రభుగౌరవంబుతో - వఱలు మీ తండ్రి
మీ తల్లితో వచ్చి - మీరు నన్వీడి
యుంటకుఁ జింతించి - యురుదుఃఖ మేను

తోఁపనీకుండిన - తోయంబు మెచ్చి ౮౦
ప్రియవాక్కు లాడ నా - హృదయాన దాఁచు
శ్రమము తాపము దెల్పఁ - జాలిన యట్టి
తెచ్చికోల్ నవ్వుచే - నొచ్చెడు కరణి
పెద్దలు నిందించు - పెడత్రోవఁ బట్టి
నారలు మీ యాజ్ఞ - గోరంతయైనఁ ౮౫
దప్పరాదనెడి చి-త్త స్థిరత్వమును
చెందితిఁ గాన మీ - చెప్పిన యట్లు
కదలివచ్చితి నని - కన్నగి పలుక
తొలి యిఱు వేల్పులై - వెలసిన తల్లి
దండ్రుల బంధుల - దాసీ జనములఁ ౯౦
బెద్దలు చను త్రోవ - వీడి గౌరవము
బిడెము సతీత్వంబు - విడని సాయముగఁ
వచ్చి యిచ్చట నా య-వాంత్రముల్ తలఁగఁ
గరుణించు బంగారు ! - విరిలత ! నాన
పతిమ ! యందంపు సం-పల్లక్ష్మి ! లోక ౯౫
దీపమ ! క్రొత్తడి - తిలకమ ! దుఃఖిత !
నీ కాలియందియ - నేఁ గొనిపోయి
యమ్మి వచ్చెద వచ్చు-నందాఁకఁ జింత
నొందక నెమ్మది - నుండుమ యనుచుఁ
బ్రియురాలి యొడలెల్ల - విరవిర వీఁగఁ ౧౦౦
దడవి సఖీజనుల్ - దాసీ జనములు.

లేమికి వగచి వె-ల్లిగ నశ్రు వితతి
గ్రమ్మ గొల్లల యిల్లు - క్రన్నన వీడి
తడఁబడు నడకతోఁ - దద్వీథిఁ జనుచు
బసవండు పొడువంగ - వచ్చుట గనఁడు
తన కుల మది లెక్క - గొనునది కాదు
ఎరువు కుప్పల దాఁటి - తొర తొర దేవ
దాసీజనుల వాడ - దాఁటి యంగళ్ళ
కలవీథి నడచుచోఁ - గరఁచు వారలును
చే నేర్పు పోగర - చెక్కడ మందు
తేజిన కమసలుల్ - నూఱుగు రతని
వెంటరాఁ జొక్కా-య - యొంట ధరించి
బహు వినయం బుట్టి-పడఁ జూపు నడక
కై కోల గల యొక - కమసలిఁ గాంచి
పాండ్యుని కడ గౌర-వం బందినట్టి
వాఁడు గావలయును - వీఁడని దాసి
జనపాల సతికి భూ-షణము కాఁదగిన
దొక కాలి యందియ - యున్నది. కాంచి
వెలకట్టి యంచన - వేయంగఁగలవె?
యనుడు నే నంత నే-ర్పునఁ జాలనైన
మకుట మంగదము నీ - మొదలుగాఁ గలుగు
వెల కట్టరాని న-గలు ప్రభువునకుఁ
చేయుచుందు ననుచు - రోయుచు యముని

దూతగా వచ్చిన - దుడుకు సొన్నారి
చే యెత్తి తన నేర్పు - చెప్పిన యంత ౧౨౫
ముడి విప్పి మానిక - ములును వజ్రములు
పొదిగిన యపరంజి - పోగర పసులు
కలయందె నీయ నా - కల్లరి తత్ర
కాఁడు పరీక్షించి - కాంచి పార్థివుని
కడఁ దా హరించిన - కాలి యందియను ౧౩౦
పోలుట చూచి యా - పోయిన యందె
యిదె యని తద్దోష - మితనిపై మోపఁ
దగు నని మదిలోనఁ - దలఁచి కోవలుని
గని రాజపత్నియె - గాక యీ యందె
తక్కువారు ధరింపఁ - దగరని పలికి ౧౩౫
నేను మున్నుగ దీని - నృపునకుఁ దెలిపి
యేతెంచు దనుక నా - యీ చిన్ని గుడిసె
లో నుండు మనఁ గోవ-లుఁడు చని వాని
యింటి చెంగటఁ గల - యెత్తైన చవికె
జొచ్చిన పదపడి - సొన్నారి నేను ౧౪౦
వంచించి కొన్న యీ - పార్థివు నందె
తనయొద్దఁ గలదని - జనులకుఁ దెలియు
మున్నె యీ నూతన - పురుషుని వలన
నా దొంగతికమును - నే దాఁచుకొందు
నని నిశ్చయించి వాఁ - డరుగుచుఁ జదుక ౧౪౫

మందాట వెలఁదుల - యాటలోఁ దోఁచు
తోఁపిక పాటల - తోయంబు గీత
ఫలమును మిక్కిలి - ప్రభుని యుల్లంబు
నలమిన పని యెంచి - యలుక నడంచి
తల నొప్పి యను మిష - వెలయించి రాణి
స్రుక్కక తనువీడి - శుద్ధాంతమునకు
నేగుటచే మధు-రేశుండు మంత్రి
కూటంబు విడి చెలి-కూటంబు తోడ
రాణివాసమ్ము చే-రం జనుచుండఁ
గమసలి చాఁగిలి - కడు సుతియించి
కన్నంపుఁ గోలయుఁ - గడ్డ పాఱయును
బలపము లేక ద్వాః - పాలుర కనుల
మంత్రంబుతో మచ్చు - మందులు చల్లి
నగర నందియ గొన్న - జగదొంగ దొరకె
రక్షకభటుల మొ-ఱంగి నా గుడిసె
కడఁ జేరినాఁడనఁ - గాల మాసన్న
మయ్యెఁ గావునఁ బాండ్యు - డావంతయైనఁ
బరికింప కూరి కా-వలి వారిఁ బిలిచి
దేవేరి కాలి యం-దియ హరియించు
చోరుఁ డీతఁడు చూపు-చో నున్నవాఁడు
వాని వధించి య-ద్దాని నిచ్చుటకుఁ
దెండని తన భట - తండంబు తోడ

## ౧౬. వధ విధానము

నంప హింసాప్రియుం - డగు కమసాలి
తనలోన నుప్పొంగి - తవిలి దుర్విధియు
డాసిన కోవలు - డాసి రా జనుప
నందియఁ జూడంగ - నరుదెంచినారు
వీరని యందెఁ జూ-పింపఁగఁ జేసి
వారి దూరంబుగ - వడిఁ గొనిపోయి
యందియ మేలిమి - యంతయుఁ దెలిపి
దేవేరి యందె యి-దియ యని నమ్మఁ
బలుక, నిచ్చట నున్న - వాఁడు శరీర
లక్షణముల మేటి - లలిని వధ్యుండు
కాఁడను వారలఁ - గని మునినవ్వు
సారించి చోర శా-స్త్రమున హేతువులఁ
దలఁపించువాఁడు మం-త్రము మందువేల్పు
తంత్రమ్ము శకునమ్ము - స్థలము కాలమ్ము
సాధన మనెడి య-ష్టకమునే కాదె
దొంగ లానికఁ గొని - దొంగిలుచుంట
వీని వంచన కిప్డు - లోనైతి రేని
రాజ దండనకుఁ బా-త్రము లగువారు
మంత్రంబు జపియింప - మఘవు కుమారు
లను వలెఁ గాంచఁగ-లామె వారలను ?
మచ్చు మందులు చల్లి - మైకము గూర్పఁ
గదలి యెచ్చటికిఁ బోఁ-గలుగు వారలము ?

తమ వేల్పు రూపమ్మ - ధ్యానింతురేని ౧౯౦
ధనమును చూపియుఁ - దప్పించుకొంద్రు
శాస్త్ర విధుల వారు - సలుపుదురేని
హరి తొమ్మ పేరైన - హరియింపఁ గలరు
కడు సన్నిమిత్తముల్ - గలిగినఁ గాక
యధిక ధనము లభ్య-మైనఁ గైకొన్నరు ౧౯౫
ఇది యటఁ గొనఁ దగి-నది యని యెన్న
వారిని గనిపెట్ట - వలఁతు లెవ్వారు ?
అదను నెఱిఁగి యర్థ - మపహరించునెడ
వేలుపు లేని త-ప్పింపఁ గలారె ?
తగు సాధనము గొని - ధనము హరింప ౨౦౦
జగమునఁ గనిపెట్టఁ - జతురు లెవ్వారు ?
వారికి రే లేదు - పగలును లేదు
వారలు దొంగిలు - వస్తువు దెలియఁ
దెలియనీయక దాఁపఁ - దెరువును లేదు
మున్నొక్క నాఁ డొక్క - విన్నాణి దొంగ ౨౦౫
దూత వేసము తోడ - దొరయిల్లు పగటి
పూట గాచుచు నుండి - ప్రొద్దువోఁ జెలువ
వేసమ్మ గొని రాణి-వాసమ్ముఁ జేరి
దీపపు నీడనే - తేఁకువఁ బడక
గది చేరి యువరాజు-కంఠ హారమ్ము ౨౧౦
గైకొన నతఁడు ది-గ్గన లేని మెడన్ను

హారమ్ము గానక - యడిదమ్ము దూయ
వాఁడొఱతో దాని - వారించి కత్తి
యొఱలోనికే చను - నొగిఁ బట్టి యతఁడు
ముష్టితోఁ బొడువంగ - మొగియంగ నొక మ ౨౧౫
ణిస్తంభమున దాఁగి - నిలిచి యా చేతి
పోటునకుం గంబ-మును గుఱిచేసి
తన శాస్త్రనైపుణిం - దప్పించుకొన్న
దొంగను పట్టు చ-దురు గలరేని
దెలుపుఁడు వీరికి - దీటు లోకములఁ ౨౨౦
గలుగరు నిజమంచుఁ - గమసలి పలుకఁ
దళతళ మెఱయు హ-స్తమ్మున ఖడ్గంబుఁ
గలిగిన యువకుఁ డొ-క్కరుఁ డిట్లు పలికె
బలపంబు నీలి యం-బరము ధరించి
యాఁకొని జింకల - నారసి తఱిమి ౨౨౫
యలసిన బెబ్బులి - యనువున నొకఁడు
నడురేయి పబ్బున - నా కంటఁ బడియె
వాని నఱకఁ గత్తి - వడి దూయు నంత
వాఁడు నేర్పున దానిఁ - బట్టి లాగికొని
పరుగిడెఁ దరువాత - వాని నెచ్చటను ౨౩౦
కాంచనైతిని వీరి - వంచన చేష్ట
లరయ నెవ్వరికేని - యరిది యీ చోరు
వదలిన మనలను - ప్రభుఁడు దండించు

మీరును క ర్తవ్య - మారయుఁ డనుడు
ప్రముక్కడి మదయుతుఁ - డొక్కండు చేతి ౨౩౯
కత్తితోఁ గోవలు-కంఠంబు నఱకె
నది సరాలున మెడ - నడ్డంబు త్రెంచె
నెత్రు వెల్లువ గాఁగ - నేలపైఁ బాఱె
భూదేవి దుఃఖముం - బొందె మిక్కిలిగ
భూపతిపాలన - మొక్కవోవంగఁ ౨౪౦
బూర్వ దుష్కర్మము - ముదురుట చేత
నరకుడు వడి భువి - దొరలెఁ గోవలుఁడు.

తిరమై మోఘము చెందకుండు గురునీతిప్రాజ్య సామ్రాజ్య ము
ర్వరఁ బాండ్యేశుని పూర్వజన్మకృత పాపక్లాంతిచే ఘోర దు
ర్భర నాశమ్ము భజించెఁ గోవలుమిషన్ బ్రాక్కర్మజాతంబులై
పరఁగుం గష్టసుఖంబు లట్లగుట సల్పం జెల్లు సత్కార్యముల్.

---

## ౧౭ గొల్లల యాట

జరి॥ గిరిరాజ శిఖరానఁ - గీల్కొల్పు మీను
ప్రక్కఁ బులియు విల్లు - వ్రాయించి నట్టి
చేరుఁడు చోళుఁడు - ధరణీవిభులు
తన యాజ్ఞ నడప భూ-తలనాధ తతుల
నేలిన పాండ్యభూ-మీశుని కోట ౫

మేలు కొలుపు ధ్వనుల్ - మేటిల్లి మ్రోఁగె
నగరికి నేయి యొ-సఁగఁ దగు వంతు
గలదని మాదరి - కడువడి లేచి
తన కూఁతు నార్యను - తమిమీఱఁ బిలిచి
కవ్వంబు త్రాడును - గైకొని పెరుఁగు
కడవల కడ నిల్చి - కాంచి యిట్లనియె
కడవల పాలు తో-డిడి పేరలేదు
పాఁడి యావుల కనుల్ - బాష్పముల్ గార్చె
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయది
కరఁచినఁ గరఁగదు - కడవల వెన్న
మేఁకపిల్లలు గంతి - మిట్టి యాడవును
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయవి
ఆవులు వడఁకుచు - నఱచు చున్నయవి
పాల పూసలు తెగి - నేలపై రాలె
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయవి

—: హేతువు :—

వ॥ బానల పాలు పేరకుండుటయు, నావులు కన్నీ
గార్చుటయు, వెన్న కాఁచినఁ గరఁగకుండుటయు, మేఁకపిల్ల
త్రుళ్ళుచు నెగురక ముడిఁగి పరుండుటయుఁ బసుల మెడపూస
తెగి పడుటయుఁ జూడ నేదియో చెడుగు రాఁగలదని సూచి
పయ్యేనని కూఁతుం గాంచి, 'చింతింపకుము. కాంతల కాభర
మైన కన్నగియుఁ గాంచునట్లు మున్ను గొల్లపల్లియ మంటపము
శ్రీకృష్ణుఁడు బలరామునితో నాడిన పెక్కాటలలో నీలతో నాడి
యాటను పసియుఁ గ్రేపులు నెరగు నీఁగు కొఱ కాడుద' మనియె

—: ఉద్దేశము :—

మం॥ కారెద్దు కినుకకుఁ - గంగారు పడక
పొడువ వచ్చిన కోడె - నొడిసి చే పట్టి
పిలుకు మాల్చిన వాని - వలచు మా నీల
కనలు గిబ్బను బట్టి - గబ్బడఁగించు
దిట్టకానిం జెట్టు - వట్టు మా నీల
ఈ బలిష్ఠంబైన - యెద్దుపై నెక్కి
స్వారి చేసిన వాని - స్వామ్య మా నీల
పొడల కోడియ మద - మడఁచిన మేటి
మగవాని కర్ధాంగి - యగును మా నీల
అందమౌ పూఁ బొడ - లొందు కోడియను
అంకెకుఁ గొను దిట్ట - కర్త మా నీల
ఎవరి కడంగని - యీ గిత్త నడఁచి
నడుపు వానికె లభ్య-పడును మా నీల
ఈ పొడ కోడియ - కోపు లడంచు
వానికే కాయని - వలతావి పూపు
వంటి వన్నియ కన్నె - వరణీయ యగును.

—: చూపుట :—

ఇట్లు పూజాస్థలి - నెనసిన యేడు
కోడెలఁ దమ పెండ్లి - కొఱకె యేడుగురు
కన్నెలు పెంచిరి - కాంచుఁడీ యనుచుఁ

దన కూఁతుఁ గాంచి యీ - తలిరు బోణులను
స్వరములు నిలిచెడి - సరవిని నిలుపు
మనుచు వారలకు హే-త్వభిధాన మట్టు
లుంచంగఁ దన మది - నూని పై దెసను
షడ్జంబు మొదలు ని-షాదంబు వఱకుఁ
క్రమముగాఁ నిలుప ష-డ్జము కృష్ణుఁడయ్యె
బలరాముఁ డయ్యెను - పంచమ స్వరము
నీల రిషభమయ్యె - నెఱి నట్లె తక్కు-
వారలు తగు చోట్ల - వారక నిలుప [1]
కృష్ణుఁడౌ షడ్జంబు - నెడమను కుడిని
రిషభ నిషాదముల్ - కృష్ణుని యన్న
యను పంచమమునకు - నట్లు మధ్యమము
ధైవత ముండె, గాం-ధారమ్ము నీల
కెడమను, మొదటిదై - యెసఁగు నిషాద
మునకుఁ గుడిగ నిల్చె - మొగి ధైవతమ్ము
వారిలో హరిమెడ - వనమాల వైచి
శాస్త్ర పద్ధతి నాడఁ - జనిరి జైత్రమ్ము

---

1. వృషభ సింహ కటక తులా ధనుః కుంభ మీనములను నేడింటి షడ్జా
స ప్తస్వరముల నిలుపుట యొక పద్ధతి. తులా ధనుః కుంభ మీన వృషభ కట
సింహముల నేడింటిని సప్తస్వరములుగా నిలుపుట వేఱొక పద్ధతి. ఈ స్థానము
వర్తించి యేడుగురు చేతులు కూర్చుకొని పాడుచు నా యా స్థానములఁ బాడ
ంచుచు ఎడమప్రక్క నిలిచినవారు కుడిప్రక్కకు, కుడిప్రక్క నిలిచిన వా రెడ
ప్రక్కకుఁగా మాఱుచు నిలుచుట పద్ధతి.

వెన్నుఁ డురమ్మున - వెలయు శ్రీదేవి
మక్కువఁ గనమికి - మన నీల కాదె
కతమని మాదరి - సుత వినుతించి
ఎలమి సమస్థితి - నిలిచి మండలము
గాఁగఁ జేతులు కట-కమ్ముగాఁ గూర్చి
యాడఁ దాళము గతి - నరసిన షడ్జ
మందున్న హరి యను - నామె పంచమము
నుద్దేసించుచుఁ జేన - నొగి వచ్చి మోస
చే నిల్చిన వెలగ - చెట్టును విఱుచు
కమల పత్రాక్షుఁ [1] బం-చమము షడ్జముగఁ
దనరు స్థాయిని పాడు-దమ యని పలికి
షడ్జ మంద్రముగఁ బం-చమము మధ్యముగ
రిభష తారముగఁ గూ-రిచి ధైవతమును
మంద్రముగాఁ బట్టి - మైత్ర స్వరమ్మ
పట్టుగా నొక పాట - పాడంగఁ దొడఁగె.

పాటలు — ఉత్సాహ వృత్తములు.

[3] వంచనమ్ము తోడ వచ్చు - వానిఁ గ్రేపు రూపునిఁ
గ్రుంచి కాళ్ళు పట్టి త్రిప్పి - కొట్టి చంపు శౌరి మే

---

1. అడవియుఁ దత్ప్రాంతమును 'ముల్లై' యనఁబడు. దాని కధిదే...
...వు. గొల్లల యాటకును 'ముల్లై' యని పేరు. దానికి పంచమము ...
...గును. దాని కైదవదియగు మిత్ర స్వరము నీళ.

2. వేణువులు ముత్తెఱఁగు :— (1) తేలకాయ తొల చేసిన క్రోవి (కొ...
...) గాడిద మొగపు టనుసు గల కలువక్రోవి (ఆంబల్). (3) మొల్లతీఁగ...
...ప్పురిగాఁ బెనఁచిన వలయమును వంపునోరుగాఁ గట్టినది మొల్లక్రోవి (ముల్లై...

తెంచి మంద కరుగు దెంచు - సేని జేల వేణువున్
మించి సంతసించి విందు-మే కదా తలోదరీ.

మందరమ్ము కవ్వము ఫణి - మన్నెకాఁడు త్రాడుగా
సందరమ్ముఁ జిలికి నట్టి - సారస దళ నేత్రుఁ డీ
మంద కరుగు దెంచు సేని - మంచి కలువ వేణువున్
విందుము కద వీను లలర - వేడ్కతోఁ దలోదరీ !

చేని ప్రక్క వంచనమునఁ - జేరు వెలగ రూపుఁడౌ
దానవున్ వధించి మేలు - తనరఁ గూర్చు శౌరి కా
లాన మంద కరుగు దేర - నతని మొల్ల వేణువున్
వీను లలర విందుము కద - వేడ్కతోఁ దలోదరీ !

పొగడుదమ మహోత్సవముగఁ - బూవుఁబోండ్ల వల్వలన్
వగవఁ దెచ్చి దాఁచియుంచు-వాని మేని యందమున్
పొగడుదమ పొలంతులు తమ - పుట్టములను గానమిన్
పగవఁ గని హసించు నట్టి-వాని మోము నందమున్.

పొగడఁ గలమె ? యమున మోస-పుచ్చు వాని యుల్లమున్
వగ హరించి వేఁడ వలచు - దాని మేని యందమున్
పొగడఁగలమె ? యపహరించు-పొలఁతి యందచందముల్
మిగుల నపహరించు వాని - మేర మీఱు నందమున్.

పొగడఁ గలమె ? వలువ వోవఁ - బొగిలి వెదకి మాధవున్
బెగడఁ గాంచి క్రుంగి కుందు - వెలఁది చేష్ట లన్నిటిన్
పొగడఁ గలమె ? బెగడి లజ్జఁ-బొగులు చెలిమొగంబు దాఁ
దగిలి కాంచి నగిన దైత్య-దమను మొగము నందమున్.

తే॥ ప్రొద్దుఁ జేతి చక్రంబుతో - మూసి నట్టి
నల్లవాని కెడమప్రక్కఁ - దెల్లవాని
కుడి వలంకున నొప్పిన - పడఁతి నీళ
నారదుం డామెకుం దాళ - మూర వేయు. ౭

కుడిని మాయి నమాయికు - నెడమఁ గలది
మెడను పంచి నిల్చిన నీళ - మడఁతి కను గ
లముగ సంగీత మర్మంబు - లమర నరయు
నారదుఁడు తాళగాఁడయి - యూర నిలిచె. ౮

॥ వెలఁదులు కేలు గూర్చుకొని వేనలు లల్లలనాడ గాజులున్
జెలువుగఁ దాళసంగతులఁ జెందఁగ నీళయు శౌరి సీరియున్
గలిసి నటింప మోదమునఁ గాంచి యశోద నుతింప మందలో
వెలసిన గొల్లయాట కడు వేడుక గూర్చె జగంబువారికిన్. ౯

తే॥ కూర్పని మలయహారమ్ము - కూర్చు కడలి
హార మింద్రుఁ డిచ్చిన హార - మరయఁ బాండ్య
నక్కు నందలి వతఁ డెవఁ - డనఁగ మంద
నాల మేపిన కన్నయ్య - యంద్రు బుధులు. ౧౦

హిమగిరిని పులిఁ జిత్రించి - యీపలి మహి
నేలువాఁడె సంగమ పురి - నేలువాఁడు
ఆతఁ డెవఁడన భూభార - మమరఁ దాల్చు
వెన్నుఁడే యని యీ భువి - విబుధు లంద్రు. ౧౧

వనధిఁ జొచ్చి యచ్చటి కదం-బమును నఱకి
జగములకు మేలు గూర్చిన - జనవరుండు
చేరరా జతఁ డెవఁడన - క్షీర వారి
రాశిఁ జిలికిన శ్రీ భార్గ-వీశుఁ డంద్రు. ౧౨

## 1. తరల

నగము కవ్వముగా నొనర్చుచు - నాగరాజును త్రాడుగా
మొగిని చిల్కిన వాఁడవే గద - మున్ను క్షీర పయోనిధిన్
దగిలి చిల్కిన కేలు గొల్లత - త్రాటఁ గట్టిన కేల్గదా!
జగము లేలిన జాణ నీ కిది - జాలమో మఱి మేలమో. ౧౩

## 2. మత్తకోకిల.

మూల వస్తువు నీవుగా ముని - ముఖ్యులెల్ల నుతింపఁగాఁ
జాలి యాఁకలి దప్పి లేకయె - సర్వ మొక్కట మ్రింగె దా
చాలు నోటిని గాంచ నుట్లను - చట్లు వెన్నలఁ దిన్నదే
జాలమా! యిది మేలమా! జల-జాతనేత్ర! వినోదమా? ౧౪

## 3. మత్తకోకిల.

నీ పదాబ్జము లీ జగమ్ముల - నిండు దోష మడంచె నీ
యీ పదమ్ములె పాండు పుత్రుల - కేఁగె దౌత్యము సేయఁగా
పాపకారుల రూపడంచెడు - పావనాత్మక! నీ కృతుల్
నాపకారులొ? నోపకారులొ? - యారనారయ లే మహో. ౧౫

## 4. కవిరాజ విరాజితము.

గముల మూఁడిటి నీడిచి కొల్వఁగఁ జాలవు రెండుపదంబుల కా
ాగడఁగఁ దగ్గ పదంబులు నొవ్వఁగఁ బోయితి కానకుఁ దమ్మునితో
ాగువకు లంకను నాశ మొనర్చితి మాధవ! యట్టి భవద్యశమున్
గిలి లలిన్ విన నోమని వీనులు తథ్యము వీనులు కావు సుమా!

5. మానిని

లోకములం దననాభి జలేజము లోన నడంచిన వాని జగ
చ్ఛ్రీకరు మాయల నేర్పరి నోరును చేతులు కాళులు నెఱ్ఱనయై
మై కఱియై కన వచ్చెడు వాని రమాపతిఁ గన్నుల పండువుగా
నేఁకటదీఱఁగఁ గాంచనికన్నులు నేర్పడఁ గన్నులచే! జగతిన్

6. మానిని

కేరుచుఁ గంసుఁ డొనర్చిన మాయల గెల్చిన వాని జగత్త్రయముని
గోరి భజింప శ్రుతుల్ వినుతింపఁగఁ గూరిమి పాండవ దూతగ నే
పారక పోయిన వానిఁ గృపాళుని సారెకు సారె హరే యనుచున్
నారణ! యంచు నుతింపని నాలుక నాలుకయే యది నిక్కముగన్

మంజ॥ అనుచు మేమాడిన - యాటల యందు
ప్రణుతింపఁ బడిన దై - వము మన మంద
కగు నాపదలను తొ - లఁగఁ జేయుఁగాత
వజ్రి మకుటమున - వఱలిన తొడవు
దాల్చిన పాండ్య భూ - దారుని భేరి
పగఱ గుండెలు వ్రీలఁ - బరుసుగా మ్రోఁగి
విజయమ్ము నెల్లప్డు - వెలయించుఁ గాత.

౧౮. దుఃఖము

మంజ॥ కూడి తా మాడిన - గొల్లల యాట
కడపల ధూప మ-క్షతలు చందనము
ప్రసవమ్ము లర్పించి - వైఘ తీరమున
వెన్ను పాదములు సే-వింపఁ దలంచి
వారక మాదరి - నీరాడ నేఁగి

నగరానఁ గలిగిన - దగు వార్త యొండు
విని తొట్రుపడు వడి - వెనుక కేతెంచి
నిలిచి కన్నగి కది - తెలుపంగ లేక
నిలువంగఁ గన్నగి - పలికె నీ రీతి
నా ప్రాణములకంటె - నర్మిలి చెలిమి

కనజాల కుంటి నా - కాంతు నిందనుక
మనము కలంగె వే-దన మెచ్చిరిల్లెఁ
గొలిమి తిత్తిని మించి - వెలలె నిట్టూర్పు
పొరుగు చెలులు పల్కు - తెఱఁగు లెట్టివియొ
పట్ట పగట మేను - వడఁకించు చెడుగు

మితి మీఱి వచ్చిన - వితము గన్పడియెఁ
బతిఁ గాన కుల్లంబు - పరితపించెడిని
పొరుగు చెలులు పల్కు - తెఱఁగు లెట్టివియొ ?
కాంతుండు కనరాఁడు - గతి వే ఱొకండు
కలుగదు వంచనా - కార్య మొక్కండు

తారిన యట్లు చి - త్తము కలంగెడిని
ఇరుగు పొరుగు వార - లెవరిని గూర్చి
పలుకువారలొ సుంత - తెలియంగ రాదు
వారలు పలికెడి - వార్త యియ్యదియ
వెఱపించుకయు లేక - హరియించు దొంగ
యితఁడె యితఁడె యని - యేలిక భటులు
ఖండించి రఁట! పచ్చె-కాని నొక్కరుని
అనుచు గోపిక యో_ర్తి - యాడఁగా వినిన
కన్నగి వడి లేచెఁ - గడు నుగ్ర యగుచు
వెన్నెల నెల విను-వీది యందుండి
మొగులుతో నిలఁబడ్డ - పగిదిని పడియెఁ
గను లెఱ్ఱవాఱ వె-క్కసముగ నేడ్చె
ఏడ నా ప్రాణేశుఁ - డేడ నా భర్త
యని వెక్కు చూప్పుచు - నడలెఁ దపించె
ప్రాణప్రియులు వహ్నిఁ - బడఁ గాంచి తాము
నగ్గిఁ జొరక దుఃఖ - మందు స్వార్థాత్మ
లల్ప వ్రతలఁ బోలె - నవనీ జనమ్ము
తెగడఁ బాండ్యుఁడు పాప - మొగిఁ జేయు కతన
పతిని నీఁగిన యేను - పలవించి గుండె
పగుల నేడ్చెడి బేల - వలె నొదునేమి?
ప్రియపతి మడియంగ - వెక్కుచు బెక్కుఁ
నీటి రేవుల దిగి - నీరాడి వచ్చి

## ౧౮ దుఃఖము

చింతించుచుండెడి - చేడెల మాడ్కి
ధర్మాధికారుల - స్థానమందుండి
మఱచి పాపము సేయు - మొఱకు పాండ్యేశుఁ
డొనరించు చెడుగుచే - నూరక యేడ్చి
కృశియించుచుందునే - యెడ్డనై యింక
ప్రాణప్రియుం డగ్గిఁ - బడి మ్రగ్గుచుండఁ
బెక్కు తీర్థాలకు - వెడలెడి యల్ప
భాగ్యవతుల మాడ్కిఁ - బాడి వో విడుచు
పాండ్యుఁ డధర్మాన - వర్తించు కతన
నీ జన్మమునఁ గీర్తి - నీఁగి చింతిల్లు
చుందు నొక్కో ! క్రుంగి - కుందుదు నొక్కొ !
అరయుఁ డీ రాఁగల - యంగద నీఁగ
నాడిన గొల్లల - యాఁటకై వచ్చి
చేరిన గోపిక-లార ! వినుండి
చండభానుఁడ ! కర్మ-సాక్షివౌ నీవు
లోకవృత్తము కొఱ - లే కెఱుంగుదువు
నా పతి దొంగయౌ-నా ? పల్కు మనఁగ
కాఁడు చోరుఁడు కాఁడు - కాఁడు నీ పతిని
దొంగయౌ నన్న యీ - దుష్ట పురమ్ము
నగ్ని మ్రింగును గాక - యనె నశరీరి.

## ౧౫ ఊరఁ దిరుగుట

మంజ॥ వేడివెలుంగట్లు - వినిపించునంత
నా సతి రెండవ - యందియ కేలఁ
గొని యట నిలువక - చని నీతి లేని
ప్రభుని పట్టనమున - వసియించుచున్న
తలిరుఁబోండ్లార ! క్రొ- త్తడి మిన్నలార !
యీ యందెతోఁ జేర్చి - యా యందెఁ గనుఁడు
ఈ మాపువేళ నే-రే నొందరాని
యాపద నొందితి - నగచాట్లఁ బడితిఁ
బరులకు రారాని - బన్నంబు వడితి
నా పతి చోరుఁ డౌ-నా ? కాఁడు కాఁడు
నా కాలి యందె ధ-నంబీక కొనఁగ
దొంగయన్ పేరిడి - త్రుంచు టన్నెంబు
పతుల సత్ప్రేమకుఁ - బాత్రంబులైన
వెలఁదుల యెదుట నా - ప్రేమ ధనమ్ము
ప్రాణాధినాథు స - ప్రాణుఁగాఁ గాంతుఁ
జూచుచుండుం డిది - చోద్యంబు గాదె ?
అట్లు నాథుని గన్న - నాతని నోట
జరిగిన యది విందు - సప్రమాణ మిది
వినఁజాల నేని యీ - వీటఁడి మనకుఁ
దలవంపు దెచ్చిన - దల దొంగభార్య
యే యని నను పిల్వఁ - డిది యొక సత్య
మని పరిదేవన - మొనరించుచున్న
కన్నగి నెల్లరు - కాంచి తపించి

కలఁగి తొలంగింప-గారాని దుఃఖ
మీమెకుఁ గావించి - యెన్నఁడుఁ జెడని ౨౫
కువలయేశుని నీతి - కుంఠిత మయ్యె
నేమి కారణమొకో - యెఱుఁగంగరాదు
రాజరాజగు పాండ్య - రాజపాలనము
నేఁటితో నశియించె - నేటి హేతువొకొ ?
ధరఁ బ్రశాంతపఱచు - ధర్మమ్ము నూసు ౩౦
సార్వభౌముని మేటి - చల్లని గొడుగు
నేఁ డోర్వఁగారాని - వేఁడిమి నొసఁగె
కనకంపు టందియ - కరమునఁ బట్టి
క్రొత్తవేలుపు వచ్చె - రుత్త సేయంగ
వెక్కుచుఁ బెక్కుచుఁ - వెలవెల బోయి ౩౫
యావేశమందిన - యటులున్న దీమె
ఏమి రానున్నదో - ఎవ్వరి కెఱుక
యనుచుఁ జింతించుచు - నరిగి యన్యాయ
యుక్తమై యపనింద - నొందిన మధుర
జనులు కొందఱు కోవ-లుని గానిపింప ౪౦
నది గని యోర్వలే - కరిగిన కరణిఁ
బడమటి కొండపై- భానుండు గ్రుంకె
నట్టి సాయంవేళ - నలరారి రాలు
విరిలత వలె నామె - విభునిపై వ్రాలి
విహ్వాలించుచుఁ జాల - విలపింప, సూర ౪౫

గొల్లు మనెడి గోడు - గురువులు వాటె
నుదయ వేళను భర్త - నెదఁ గౌఁగిలించి
యతని సిగను దాల్చు - హారంబు దీసి
తగు [1] సంజవేళలోఁ - దన సిగఁ దాల్చి
పతి గాయమునసుండి - బయలైన రక్త ౫౦

1. కాల విపర్యయ దోష మిందొకందు మనుచరిత్రమందలి కుతపవేళక
వలె ననివార్యముగాఁ గానవచ్చుచున్నది.

మాదరి కన్నగిని తన యింటికిఁ గొంపోవుట సాయంవేళయం ద
తత్సమయవర్ణనము స్పష్టముగ నుడువుచున్నది. కొనిపోయి స్నానముచేయిం
వంటచేయుమన్నది. నా కూఁతురు శ్రావకవ్రతము కలది కావున పగటనే భుజిం
వలయు వస్తువులు, పాత్రలు సిద్ధముచేయఁబడి యున్నవి. వంటపని చూడుమ
కన్నగి నుద్బోధించెను. అది సాయంకాలమే యైయుండవలయును గదా! అట్లు
వీలులేదు. భుజించిన వెంటనే అందియ నమ్ముటకై యంగడివీది కతఁడు వెళ
చున్నాఁడు. కావున వంటచేసినది రేయికాదు. రేయి వారు వస్తుండిరనియె
మాదరి వండిపెట్టినది తినిరనియో తలంపవలసియున్నది. అట్లు భుజించియున్న చ
మఱునాఁడామెను వంటచేయుమని చెప్పనవసరము లేకపోవుచున్నది. రేయున
నవలును చేసినదందమా? పగటఁజేసిన వంటకై కన్నగి శ్రమపడుట వర్ణింప
బడినది. భోజనానంతరము (మధ్యాహ్నవేళ) కోవలుఁ డంగడివీదికి బయ
దేఱెను. అట కమసలి కుత్రచే చంపఁబడెను. అదియు సాయంకాలమున
పూర్వమే యైయుండవలయు.

మఱునాఁడు మాదరి నగరిలోని మేలుకొలుపుల ధ్వని విని మేలుకాం
రాచనగరికి పాలు పెరుఁగు నేయి కొనిపోవలయు వంతు తనది కాపు
తొందరగాఁ బోయి చూచుసరికి పెరుఁగు పేరలేదు. అది యుత్పాత సూచకమ
తత్పరిహారార్థము కన్నగి చూచునట్లుగ గొల్లల యాట ప్రారంభించినది. అ
పూర్తియగు పిమ్మట నదీస్నానార్థమేగినది.

నదీతీరమున జనుల గుసగుసలు విని సంశయాయత్తచిత్తయై మాద
వడివడి మరలివచ్చినది. కన్నగి చింతించుచుండినది. ఆ చింత భర్త యింటి

మొదలెల్లఁ దడుప న-తఁడు తన్ను ప్రేమఁ
గాంచఁజాలని జాలిఁ - గాంచె నయ్యువతి
యీ సహింపఁగరాని - యెడరును గాంచి
ప్రియురాలు మిక్కిలి - వెగడు చెందునని
తలఁపవు ప్రాణేశ ! - తావి చందనము

ాలేదని కాదు. జను లనుకొనుట విని బయలుదేఱినది. భర్తను కాంచినది
ాంచుతఱి,

అది గని యోర్వలే - కరిగిన కరణి
బడమటి కొండపై - భానుండు క్రుంకె

క్రుంకవచ్చు. వెదకి కనిపెట్టువేళకు సాయంసమయము కావచ్చు.

ఉదయవేళను భర్త - నెదఁ గౌఁగిలించి
యతని మెడను వైచు - హారంబు దీసి
తగు సంజవేళలోఁ - దన సిగఁ దాల్చె.

ఆపై నుగ్రంపు నడకతో రాచనగరికేఁగినది. అట రాణి కలగని లే
ళవళపడి యా వృత్తాంతము రాజునకు వినిపించుచుండినది.

ఆమె కల గన్నది రేయా ? పగలా ?

మధురా దహనము రేయియే జరిగినది. పురాధిదేవతయు ఆ రేయిర
న్నగికిఁ బ్రసన్నయై పూర్వవృత్తాంతము వినిచినది. ఇంతవఱకుఁజూడ కోవలు
ృతి మఱునాఁటి యుదయముననే కన్నగికిఁ తెలిసినట్లేర్పడుచున్నది. పూర్వ
ాత్రి అనఁగా కోవలుఁ డంగడివీదికి వెళ్ళిన సాయంకాలమే పతి మరలిరాఁ డ
ాని, యందులకై కన్నగి చింతించు చుండెనని కాని కవిచే సూచింపఁబడలేద
ంతియకాక పై నుదాహృతవాక్యములచే వధింపఁబడిన నాఁటి సాయంకాలమున
యామె తన భర్తను కాంచినట్లు స్పష్టపడుచున్నది. కోవలుఁడు బయలుదేఱి
ెప్పుడు ? అతని మరణవార్త కన్నగి విన్నదెప్పుడు ? గొల్లలయాట జరిగి
ెప్పుడు ? రాణి కలగన్నది యెప్పుడు ? ఇవి పరస్పర సమయవిరుద్ధము
ామైక్యత కుదురకున్నది.

పూఁతచే నలరారు - పొంజాయ మేను
ధూళి ధూసరముచేఁ - గ్రుంగఁదగినదె ?
ఈ చెడు దుఃఖంబు - హేతువు గాఁగ
రాజ దండనము కా-రణ మిది యనుచుఁ
బూర్వ దుష్కృత మని - పొలుపుగఁ దెలుపు
వార లీ రాజ్యాన - వరలుచున్నారె ?
సాయ మొక్కరు లేక - సుజ దుఃఖించు
నేకాకి నైన నా - యెదుట మాలికల
మఱుఁగుపడిన తొమ్మ - మంటఁ బొర్లాడు
చుండంగఁ దగినదే ? - యో మనోనాథ !
ఈ మహిఁ దూర్పెత్తి - యీసడ వెట్టఁ
బాడ్యుండు దుర్భర - పాపంబు సేయ
నీ సంభవము వధి-యింపఁగాఁ దగిన
నీ కర్మ ఫలమని - నెనరునఁ దెలుపు
నరు లొక్కరేని యీ - పురమున లేరె ?
కన్నీరె కూఁడుగాఁ - గలఁగుచు నున్న
పాపిని నైన నా - పజ్జనే మీరు
గాయమ్మునుండి ర-క్తము కాఱుచుండ
దుమ్మునఁ బడియుండు - దోస మెవ్వరిది ?
ప్రజలు స్వదోషమ్ము - పగటించి వలుకఁ
బాండ్యుండు దుర్భర - పాపంబు సేయ
నిది సంభవించిన - దిట్లుండ నీదు

తొలిబాము దుష్కర్మ-ఫలము కాంచుమని
యరయించు పుణ్యు లీ-పురమున లేరె ?
పరమ చండాలుఁ డీ-ప్రభువున్న యూరఁ ౭౦
బతిరత లొకరేని-పరఁగుచున్నారె ?
పతులు కష్టమ్ములు-పడ సహియించు
పతిరతల్ గలవారె ?-పతిరతల్ గలరె ?
పెద్ద వారున్నారె ?-పెద్దలున్నారె ?
పరుల బిడ్డలఁ గాంచి-భరియించి పెంచు ౭౫
పెద్ద లున్నారొకో !-పెద్దలున్నారె !
పరమ చండాలుఁ డీ-ప్రభువున్న యూరఁ
దేవుఁడు నున్నాఁడె ?-దేవుఁ డున్నాఁడె ?
నా పతిఁ గత్తితో-నఱికి కలంక
మైన, దుష్పాలన-మందిన యూర ౮౦
దేవుఁడు నున్నాఁడె ?-దేవుఁ డున్నాఁడె ?
అని పరిదేవించి-తన పతి తొమ్మ
తన తొమ్మనం జేర్చి-తడవుచున్నంత
మగఁడు సజీవుఁడై-మగువను గాంచి
నిండు చందురుఁబోలు-నీ నెమ్మొగమ్ము ౮౫
వాడినదే యని-బాష్పముల్ తుడిచి
నేల ఋణము నాకు-నీఁగిన దనుచుఁ
బరమ పతివ్రత-భర్తపాదములఁ
బట్టి వెక్కుచు నేద్వ-స్వర్గంబు చేరఁ

జను వాఁడు భువి నుండు-మని సతి వీడి
వేల్పులతో విను-వీదిఁ దా నేఁగె
మగఁ డిట్లు పలుకుట - మాయయో ? మదికి
విభ్రాంతిఁ గలిగించు - పెను దయ్యమేమొ ?
మఱి యేమొ ? యెటకేగి - యరయుదు నాథు
నీ పలుకులు సత్య - మెన్నడుఁ గావు
నా కిన్క శాంతి నం-దక మున్న యేను
పతితోడఁ జనఁజాలఁ - బరమ దుష్టుండు
నవిమృశ్యకారి యా- నవనీశుఁ గాంచి
కతమేమొ యడిగెదఁ-గా కని లేచె
ఎడరు పుట్టించిన - చెడు కల ఫలము
కనుల బాష్పము లుర్లఁ-గా నిల్చి తలఁచె
నిలిచెఁ దలఁచెఁ గంట - నీరంబు గార్చెఁ
దుడువక బెడిదంపు - నడకతోఁ బఱచెఁ
బఱచి రాచ నగరి - వాకిట నిలిచె.

---

## ౨౦ న్యాయ వచనము

మంజ॥ అటఁ జెలీ ! మన్నిని - యచ్చంపు గొడుగు
ప్రభు దండమును క్రిందఁ - బడ మొగసాలఁ
గల గంట చప్పుడు - కలను గాంచితిని
అదరె దిక్కులు క్రమ్మెగె - నర్కుఁ జీఁకటులు
పట్టు మింటను రేయి - కొట్టు గాన్పించె

పట్టపగటఁ గాంతి - పర్వైన మింటి
నుండి మండుచునున్న - యుల్కలు రాలె
నిది యేమి హేతువో - యెఱుఁగంగరాద
లేచి చూతును గదా ! - లేమ ! యేమందు

## —: గర్భము :—

అవనీశు డండమ్ము - నచ్చంపు గొడుగు ౧౦
మంట మడఁగి పడె - మా దోర మందు
గంట నా యెదవలె - గడగడ వడఁకె
పట్టి మింటను రేయి - కొఱ్ఱు గాన్పించె
పగటనే యుల్కలు - పలపల రాలె
దిక్కులతో భూమి - తీఁగ నా నదరె ౧౫
నాపద రాఁగల - దని మదిఁ దోఁచె
విభుని కియ్యది విని-పింతమా యనుచుఁ
గొప్పెరుందేవి ప-ల్కుడుఁ జెలువలును
కాంతులు గల యలం-కారముల్ గొనిరి
ప్రత్తిఁబట్టయుఁ బట్టు - వలువ గైకొనిరి ౨౦
ముకురమ్ము గొనిరి మే - ల్పొట్టు చేకొనిరి
పోఁక లాకులు సున్న-మును కేలఁ గొనిరి
కొనిరి కస్తూరిని - కొనిరి పొంబొడియుఁ
గొనిరి పూ మాలికల్ - కొనిరి జల్లియును
కొనిరి ధూపమ్మును - కొనిరి గంధమ్ము ౨౫
కుఱుచలు మూఁగలు - గూనులు నైన

దాసీజనము చుట్టి - దైవాల సుంద్రి
ముత్తైదువలు చేరి - మొగిని చిరాయు
రస్తని దీవింప - ననుఁగుఁ గత్తియలు
హెగ్గడి కత్తెలు - నిరువంకఁ జనుచు
నడుగడుగునకు గుణా-వలిఁ బొగడ
నల్లనల్లనఁ జని - యవనీశ్వరుండు
పేరోలగము సింహా-పీఠిపై నుండి
సలుపుచుండఁగఁ జేరి - తెలుపుచునుండ
మతి యడుగంటి ధ - ర్మము నశియింప
నీతిమాలిన కడు - నీచు దరిద్రు
నగరివాకిలిఁ గాచు - మగలెంకలార!
తనపతిఁ బోఁగొట్టు-కొనిన యొక్కర్త
యొక యందె చేఁగొని - యున్నది నగరి
వాకిట నని జన-వరునకుఁ దెలుపుఁ
డీ యని కన్నగి - యాసునఁ బలుక
దౌవారికుం డేగి - ధరణీశ్వరునకు
జయము మలయమేలు - సామికి జయము
ధర్మమార్గము తప్పఁ - ద్రొక్కని పాండ్య
నాయకా! అవధారు - గాయమ్మునుండి
చిట్టు చిట్టున లేచి - వట్టైన నెత్రు
వీడని మొండెంపుఁ - బీఠము నెక్కి
బల్లెమ్ము గొని తాండ-వమ్మొనరించు

భీకరమూర్తియా - వేలుపు గాదు
కన్నెలేడ్వురలోనఁ - బిన్నదియైన ౫౦
యా పిడారియుఁ గాదు - శ్రీపార్వతీశుఁ
దాండవింపించు రు-ద్రాణియుఁ గాదు
భయదాటవి వసించు - వనదుర్గ గాదు
వీరుఁడౌ దారుకు - పేరురమ్మవియఁ
జీలుచు నమ్మహా - కాళియుఁ గాదు ౫౫
తన తలంపే రూపు - తగఁ గొన్నయట్లు
మితి మీఱు కోపమ్ము - మేవిన యట్లు
కెరలి బంగరు టందె - కేలఁ బట్టినది
కూరిమి పతిని పోఁ-గొట్టు కొన్నయది
వాకిట నిలిచెను - వాకిట నిలిచె ౬౦
ననుడు రమ్మనుఁడు తో - కొనిరండు పొండు
త్వర నని పాండ్యుఁ డు-త్తరు వొనరింప
వాఁడు మరలి వచ్చి - వనితఁ గొంపోయి
మన్ననిఁ గాన్పింప - మడఁతియు నెదుర
నిలువఁ బ్రభుండు క-న్నీరొల్క నిలుచు ౬౫
నీవెవ్వతవు పని - యేమని యడుగఁ
దెగువ యెడందతోఁ - దెఱవ యిట్లనియె
అరయు తెలి విసు-మంతయు లేని
యెడ్డె భూపాల! నీ - యెదుట వచింప
వలసిన యర్థంబు - గల దొండు వినుము ౭౦

వేల్పులు తమలోన - విస్మయమందఁ
బావుర పిట్టకై - వపువిచ్చువాఁడు
మొగసాల గంట నా-లుక చలియింప
మొదవు నశ్రులు తన - యెద నుడికింపఁ
బ్రియతనూజుని తేరి-క్రిందఁ ద్రొక్కించు
నట్టి రాజేలు పు-గాఱు మా యూరు
తవిలి యయ్యార గా-రవముతో నలరి
గొప్ప కీరితి గాంచు - కులమువాఁడైన
మాసార్థవాహు కు-మారుఁ డత్యధిక
ధనము సంపాదింపఁ - దలఁచి దుర్విధియుఁ
ద్రోవ నీ మధురకుఁ - దోడ్తోడ వచ్చి
యరుదైన నా కాలి - యందియ నమ్మఁ
దలఁచి నీచేత న-ధర్మ పద్ధతిని
వధియింపఁబడిన కో - వలు భార్య నేను
నన్ను కన్నగి యంద్రు - నరనాథ ! యనిన
అంగనా రత్నమా ! - దొంగను చంపు
టెన్న దుర్దండన - మెట్లగు ననుడుఁ
గన్నగి యాతనిఁ - గాంచి యిట్లనియె
ఓయి వెడఁగు ఱేఁడ ! - ఓయి దుర్భగుఁడ !
నాయందెలోనివి - నాణెమౌ మణులు
చూడుమ యన ఱేఁడు - చోద్యంబుతోడ
మాయందెలోనివి - మౌక్తికరాజి

యనుచుఁ దెప్పించి యా - యమ మ్రోలనుంచెఁ
కన్నగి తనయందెఁ - గడు నుగ్రరీతి
నవనిఁ బగుల వ్రేయ - నందొక్క కెంపు ౯౫
వెగడుకుడుచు జేని - మొగముపైఁ బడియె
నమ్మణులం గాంచి - యవనీశ్వరుండు
ఛత్రమ్ము వ్రీల రా-జ ద్రాజదండ
మల్లాడిపడఁగ నా - కల్ల కంసాలి
పలుకులు విని పాడి - కలఁక గావించు ౧౦౦
నేను రాజును గాను - నేనె చోరుఁడను
నేనె చోరుండను - నేనె చోరుఁడను
ప్రజలను కన్న పా-పల వలెఁ గాచు
పాండ్యరాజుల పరి-పాలన నేఁడు
కలుష దూషిత మయ్యె - ములుచ నా వలన ౧౦౫
నో మృత్యుదేవతా ! - యుగ్రంపు నడక
గొనివచ్చి నన్ను గ్రమిం-గుమ యని చేష్ట
దక్కి దబాలున - ధరణిపైఁ గూలె
రాణిగుండియ లప్లె - రాపడి నిలిచె
నొడలు వడంకాడె - నొడయని నీఁగు ౧౧౦
సతులకుఁ జూపంగఁ - జాలిన దొండు
జగతి లేదని పతి - చరణముల్ దాఁకి
నేలకు వ్రాలి య - న్నియతాత్మ దొరలెః

ఉ॥ ధర్మము దప్పువారలకు ధర్మమె పీడనిమిత్తి యంచిలన్
ధార్మికు లాడువాక్యములు దబ్బఱగావు నిజమ్ము పూర్వ దు
ష్కర్మముచేతఁ బాండ్యవిభుకాంతయుఁ గన్నగియున్ భజించుప్ర
క్షర్మఫలంబులం గుడువఁ గాంచిన సంచును గాంచుఁడీ జనుల్

ఉ॥ ఆయమ యొంటి యందుకము నాయమ కన్నుల నీటివెల్లువ
ఆయమ కాంతిదప్పిన శవాకృతియున్ వన గుల్మరీతిగా
నాయమ మేని నిండ జలదాకృతిఁ గప్పిన నీలపుం గురుల్
పాయక కాంచి పాండ్యపతి బమ్మెర నిల్వనఁగూలె ధాత్రిపై

చ॥ అలమిన మేని ధూళి విరియంబడి కప్పినకప్పు వెంద్రుకల్
చెలువ కరంబునం దమరు చిన్నపు టందియ యశ్రు పూరము
అలుకునఁ గాంచుచో నపజయంబు భజించెను పాండ్యభూపుఁ
పొప్పలఁతుకవాక్యముల్ చెవులఁ బొందినమాత్రనపీడెఁ బ్రాణము

---

## ౨౧ ప్ర తి న

మంజ॥ పాండ్యునిదేవి స్వ-భర్తఁ గోల్పోవఁ
బాలైన దుష్కర్మ-రాలనౌ నేను
తప్పింత యెఱుఁగని-దానన యైన
ఱేపు చేసిన కీడు - మాపునఁ గుడువఁ
గలుగు తీరైనవి - కర్మఫలములు
వన్ని వృక్షంబును - బావిని శర్వ
లింగంబు కరులుగా - రంగారఁ దెచ్చి

పలువు రెఱుగఁ బట్టి-పగట సాక్ష్యంబు
పలికించినట్టి యా - వణిజు కన్నియయు[1]
ఆటలాడ నిసుక - నమరుచు బొమ్మ ౧
నీభర్త యగునని - నెలఁతలు పలుక
నమ్మి యింటికిఁ బోక - నర్మిలితోడ
నలలు దాఁకక పోవ - నిలిచిన పడుచు
కరికాలచోళుని - గాదిలి పట్టి
'ఆదిమంతి' యను న - య్యమ తాను వలచు ౧
వంజి నగర రాజ - వరు 'నాట్టనత్తి'
యను వానిఁ గావేరి - యణఁచి కొంపోవ
నేటివెంటం జని - యెట నుంటి వనుచు
వాపోవ నవ్వాని - వనధి తోడ్తెచ్చి
యీయ నలమికొని - యేతెంచి నట్టి ౨
పతిభక్తినిరతయా - స్వర్ణ లతయును
వన నిధి తీరస్థ - వనమున నుండి
వచ్చెడి పడవలఁ - బరికించుచుండి

1. వైప్పూరిలోని దామకుండను వణిజుని కూఁతుండ్రేడుగురలో పిన్న
యగు కన్నెయు ఆమెయత్తకొడుకును దారిఁబట్టివచ్చి తిరుమరుగల్ అను నూ
గియున్నయెడ పాము కాటుచే వాఁడు చావ, నక్కన్నె యేడ్చుచుండ నచ్చటి
చ్చేసియుండిన జ్ఞానసంబంధమూర్తి జరిగినది యెఱిఁగి వానిని బ్రదికించి అ
యుండిన వన్నెవృక్షము, బావి, లింగము, సాక్షులుగాఁ బెండ్లాడుఁడని యాజ్ఞయిడి
వారట్లు సతీపతులై మధురకుఁ జన్నమీఁద నా కన్నియ సవతి నిందింప పై ము
యను సాక్ష్యము పలికె. అందలి దేవునకు సాక్షినాథుఁడను పేరుకలిగె.

భర్తరాఁ దన శిలా-భావంబు వీడు
నట్టి మహా మహి-మాఢ్యయౌ సతియు [1]
తోడుగాఁ గల సవ-తుకబిడ్డ బావిఁ
బడఁ గని లోకులు - సడి పూన్తురంచుఁ
దన సుతుఁ గూడ నూ-తం బడద్రోచి
యవల నిర్వైర నెత్తు - నా మడంతుకయు
నితరుఁ డొక్కరుఁడు త-దేక మనస్కుఁ
డై తన్ను గాంచ నా - నాతి స్వానసము
కోఁతిమొగమ్ముగఁ - గొని యుండి భర్త
రాఁ దొంటి రూపమ్ము - రహిఁ దాల్చు సతియు
అబలలు గోలలం - చరసిన పెద్ద
లాడు వాక్యముల ల-క్ష్యము లేని వెడఁగ
నగు నేను సైకత-మం దాడుచుండి
నాచెలిఁ గాంచి నే - నవలసు గన్న
నీ కొడుకున కిత్తు - నీవన్నుఁ గన్న
నా కొడుకున కిమ్ము - నాతిరో ! మనము
వియ్య మందుదమని - వేడుకకనిన
పలుకులు పాడిగాఁ - దలపోసి యామె
తన కూఁతు నా యింటి - కనుప నత్తరుణి
తగు నలంకృతులతోఁ - దన తల్లి వాక్కు

---

1. సంపాదింపఁ బోయిన భర్త వచ్చుదనుక నొక యిల్లాలు శిలయై
భర్తవచ్చు పిదప నెప్పటి రూపొందెను.

పాలింప వచ్చిన - పద్మదళాక్షి
మున్నగు పెక్కండ్రు - పొడము పుగాఱు ౪౫
నందు పుట్టిన యేను - నట్టి పేరొందు
నన్నులమిన్నగా - నగు ప్రాప్తియున్న
రాజుతో నీమధు-రా నగరమ్ము
బూది గావింతు నో - పొలఁతిరో ! నీవు
నరయుదుగాకని - యారాచనగరు ౫౦
వీడి వెలికివచ్చి - వీటఁ గలట్టి
మానవులార ! య-మర వరులార !
మునులార ! నా పంత-మును వినుఁడీరు
నా మనోహరుఁ జంపు - భూమీశుపురము
పై గిన్కఁ బూనితిఁ - బాపమ్ము గాదు ౫౫
కాంచుఁడీ యని కుడి - కరమున నెడమ
స్తనమును వడివైచి - చలమున లాగి
కేలెత్తి పురిఁ బ్రద-క్షిణముగాఁ దిరిగి
విసరివైచుడు నది - విలయాగ్ని కరణి
రేఁగి నీలపురంగు - జేగురు జడలు ౬౦
తెల్లని కోఱలు - తెఱలు జ్వాలలును
గల యగ్ని దేవుఁడై - కనఁబడి నిలిచి
యో సతీ తిలకమా ! - యొకమాట వినుమ
ఈ నగరమ్ము నీ - కెగ్గు తలంచు
నానాఁడె దహియింప - నాజ్ఞను మున్నె ౬౫

పొంది యున్నాఁడఁ గా-వున నిట బ్రదుక
వలసిన వారేరొ - నెలవిమ్మ యనఁగ
విప్రులు ధార్మికుల్ - వృద్ధులు పసులు
పసి బిడ్డలును పతి-వ్రత లగు వారి
వీడి విజృంభించి - వే కాల్పు మనుచుఁ
బ్రేరేఁపఁ జెలరేఁగె - వీతిహోత్రుండు

---

## ౨౨ పుర దహనము

మంజ॥ కన్నగి ప్రేరణ - గొన్న య వ్వహ్ని
విచ్చలవిడి రేఁగి - విన్నంటఁ బెరిఁగె
నగరదేవతలైన [1] - నల్వురు దేవ
ళమ్మలు వీడిరి - పొమ్మనుమున్నె
పాండ్యుండు దొసఁగుకై - ప్రాణముల్ బలిగ
నొసఁగి భూమికిఁ దెల్పు - నెసకమ్ముతోడ
సతితోడఁ బైడి యా-సనమున నుండి
మరణించు టెఱుఁగక - గురుఁడు మంత్రులును
వ్రాయసకాండ్రును - న్యాయాధిపతులు
రాజబంధులు కర-గ్రాహులు సేవ
కులు వచ్చి చిత్రాకృ-తులఁ బోలె నిలువ
సాయుధ వీరులు - సారథుల్ రథిక

---

1. ఇంద్ర వరుణ యమ సోములు.

వరు లాశ్వికులును మా-వంతులు గలిసి
రాచవాకిట నగ్గి - రాఁజుట గాంచి
గుమిమైరి, ముత్యాల - కోవ ధరించు ౧౫
నెలఁబోలి బ్రహ్మయ-జ్ఞియముతో నున్న
యాది భూతము, నెఱ్ఱ-నగు కాంతి మేను
రాజునకుం బోలె - రాజిల్లు ఛత్ర
చామరములు మురజ-జము నంకుశమ్ము
ధ్వజము ఖడ్గమ్మును - బల్లెమ్ము పాశ ౨౦
ములు గల్గి పాండ్యుని - బోలిన యరిది
త్రాణచే నొప్పారు - రాజభూతమును
పొన్నంపు మైచాయ - సుస్థిర మహిమ
గలిగి కిరీటమ్ము - ఖడ్గమ్ము లేక
తులయు నాఁగలియుఁ జే-నలర లోకముల ౨౫
సేద్యముచే సాకు - జీవితమంది
బాలచంద్రధరుని-బోలె వెలింగి
వాసికి నెక్కిన - వైశ్య భూతమును
పులు గడిగిన నీల-పు మ్మణిఁ బోలు
నొడలితో నీలంపు - యెల్లియఁ దాల్చి ౩౦
జగముల నేలంగఁ - దగిన హలమ్ము
మున్నగు నాయుధ-ముల ధరియించి
విద్వద్వినుత మయి - వెలసిన యీవి
గలిగి యెల్లప్పుడు - కలకల మమరు

కల(తున బలిగొను - కా(పు భూతమును
పంతున( గన(బడి - పాండ్య భూ విభు(డు
తగవుమాలిన తఱి( - దప్ప కీ పురము
బూదియౌ నను మాట - మున్నె యెఱింగి
యుంటిమి గావున - నొప్పుగ నిచటు
వదలి పోవుట పాడి-గద ! యని స్తనము
తో నగరము( గాల్ప( - బూనిన సతికి
దెలుపుచు( దలకొక్క - తెరువున నరుగ
తేరువీదులు నాల్గు - తెగల వీదులును
అంగళ్ళవీథి ధా-న్యము లమ్మ వీథి
మొదలగు వీదులు - మున్నర్జునుండు
ఖాండవమ్మును గాల్చు - కాలాన( బోలె(
గల(తనొంద(గ ధార్మి-కులును విద్వరులు
గల కడ కేగక - చలపట్టినట్లు
పాపులు నీచులు - పర(గు వీథులను
జ్వాలలు చెలరే(గ( - బసులును వాని
దూడలు ధర్మ బు-ద్ధులు - గల గొల్ల
వాడల( జేరెను - వారణములును
పిడులు తేజులు కోట - వెనుక కేగినవి
పడ(తులు తమతమ - భర్తల వీడి
పడకలనుండి పూ-వడములు రాల
నెయ్యంపు టలుకను - నెట్టి యవ్వలకు

వలమత్తు ద్రావి పై - పయి నాడుచుండు
నాటలు డిందఁ బె-న్నలమట చెంద
తడఁబడు నొడువులు - నడలు చెన్నారు
పాపల నిద్దుర - లేపి వృద్ధలగు ౧౦
నింతులఁ దోకొని - యెచటికో యేగ
అతిథుల నోము గృ-హస్థధర్మముల
వదలని గరితలు - ముదపుంది ప్రియుని
సీఁగి యందియఁ గొని - నృపుని జయించు
వనితస్తనమ్ముతో - నొనరించు సేఁత ౧౫
క్రూరమ్ము కాదని - కోరి పావకుని
వినుతిచేసిరి మ్రొక్కి - వేవేల విధుల
నఱువదినాల్గు వి-ద్యల నేర్చి తేఱి
సంగీత మరసిన - చామల వీది
నాట వెలఁదు లాడు - నాట పాటలను ౨౦
వీణాదికమ్ముల - వీడి రంగమ్ము
దాఁటి యేదేశపుఁ - దరుణీతిలకమొ ?
ఎవ్వరి కూఁతురో - యీ నగరమునఁ
దన పతిఁ బోఁగొట్టు-కొని వివేచనము
డిందిన ప్రభుఁ దన - యందెతో గెలిచి ౨౫
పుర మగ్ని కాహుతిం - బొనరించె ననుచుఁ
జింతతో సురుఁగ నం-చిత సంధ్య జరుగు
నుత్సవములు వేద-యుత రావములును

దేవపూజనములు - దివ్య హోమములు
ఇలువేలుపుల పూజ - లిండ్ల దీపములు
వాద్యఘోషములు లే - వని పెద్ద యూరఁ
దనభర్తఁ గాంచఁ జా-లని చింతచేత
మగువ మండి కొలిమి - మాడ్కి నిట్టూర్పు
వడి నూర్చి వీదుల - సుడివడి తిరుగుఁ
దిరిగి సంతాపించుఁ - దిరిగి తపించి
సందు వీదుల నిల్చు - సందుల నిల్చి
వెలలును వెలలి వి-హ్వాలత భజించు
మై మఱచు మఱచి - మఱుఁగు నలంగు
నుమ్మలికించు న - ట్లోర్వంగ రాని
వేదన నొందుచు - వెగచుచుఁ గోప
మాఱక కుందు న - య్యతివకు నెదుట
నుజ్జ్వల జ్వాలల - నుడికి తపించి
సైఁపఁజాలక మధు-రాపుర దేవి
కనులకు నయ్యెడఁ - గానంగ వచ్చె.

తే॥ లోక భీకరముగ దురా-లోకనముగ
స్తనము నూడ్చి నిల్చిన వీర - తరుణి యెదుర
శంకరుల పత్ని లోనఁగూర్చు - జయము వలన
నలరు మధురాధినేత్రి ప్ర-త్యక్షమయ్యె.

## ౨౩. పూర్వజన్మ వృత్తాంతము

మంజ॥ జడయందు లేఁ జందు - రుఁడు కాంతి మోము
తెల్లకోఱలును ము - త్తెముల పల్వరుస
ఎడమ నిరుల రంగు - కుడి పైఁడి రంగు
ఎడమచేఁ దామర - కుడిచేతఁ గత్తి
కుడికాలఁ బెండేర - మెడమ నందియయుఁ
గలయది పాండ్యుని - కులదైవ మగుటఁ
గలఁగి పెంజింతను - మలఁగుచునున్న
కన్నగి యెదుటఁ జ - క్కన నిల్వలేక
పిఱుఁద వచ్చి నిలిచి - గరితల మిన్న !
కల దొక్క కొఱఁత ని - క్కము విను మనుడు
వాడు మొగము కుడి - ప్రక్కకుఁ దిప్పి
నా వెన్క నిల్చిన - నీ వెవతుకవు ?
నా దుస్సహంపు బ - న్నమునకుఁ గతము
నరయఁ జాలుదె యన - నామె యిట్లనియె
నీ దుఃఖము కతంబు - నే నెఱుంగుదును
అమ్మ ! నే మధురా పు - రాధిదేవతను
చింతించుదాన నీ - చెలువుని గతికి
నాద నొప్పించు వృ - త్తాంతంబు గలదు
మా ప్రభుండగు పాండ్య - మహీవల్లభుండు
పూర్వ కర్మ ఫలమ్ము - పొందుట వినుము

నీ పతి కల్పిన - యాపద కతము
వినుము తెల్పెద నౌల - విశదంబు గాఁగ
విప్రుల నాలుక - విను శ్రుతుల్ దక్క-
గంటల నాలుక - గల సద్దు వినఁడు
అడుగులఁ బడకుండు - నరి నృపుల్ గాక
ప్రజలు నిందించు దు - ష్ప్రభుఁడు కాఁడెపుడు
మదమెచ్చ విద్దెయ - మావటీనికిని
యువ వారణము లొంగ - కొదరి యేగినను
స్త్రీలు కటాక్ష దృ - ష్టిం బ్రసరింప
నీ యున్నత కులీను - లీడరు మేర
ఒకనాఁడు మధుర రా - జౌక యింటి తలుపు
దట్టి దరిద్రుఁడై - తనరు కీరంతు
కాంత భూపతి రక్ష - గాక వేఱొండు
లేదైనను మఱుంగు - లేని గేహమున
నా రక్షణమె కాయ - దా ? యని కుంద
నవ్వాక్కు- కర్ణమ్ము - లందు సూదివలెఁ
గ్రుచ్చి కాల్పఁగ వడం - కును భయమందె
నట్టి రాజులకు న్యా - య్యమె వంశ గుణము
గా నొప్పు విభునకుఁ - గలుగదు కొఱఁత
కలికి ! మఱొక్క- సం - ఘటనము వినుము
పాడి యేల్బడి యందు - పావురా కొఱకుఁ
డ్రాసు నెక్కిన వాఁడు - తగ గోవు కొఱకుఁ

గొమరుని రథము చ - క్రము క్రింద దొబ్బ
నతఁడును వెలయు పు - గాఉ వంశ భవు
పొఁడి పంటలతోడ - బలిసిన చోళ ౪౫
దేశమ్మునందు ప - రా శరుఁ డనెడి
విప్రుఁడు భారత - వీర రణమున
నన్నంబు వెట్టిన - యడిదంబు దాల్చి
యఖిల సంపదలచే - నలరారు చేర
విభుని దాతృత్వంబు - విని వచ్చి యతని ౫౦
వలన స్వర్గము గోరు - పాఉలు వహ్ని
పూజతో వేదముల్ - పొలుపుగాఁ జదివి
పంచ యజ్ఞమ్ములు - పరఁగంగఁజేసి
కడఁక శమాది ష - ట్కము యజనాది
షట్కంబు గలిగిన - జన్ని గట్లొందు ౫౫
పదము దెలిపి నాల్క - వలన శాత్రవుల
గెలిచి విప్ర విజయ - కీర్తిచే వట్టి
క్రతువులతో బహు - మతులొంది తనదు
గ్రామంబు చేరంగఁ - గ్రమ్మఉ వాఁడు
పాండ్య రాజ్యంబున - వఉలు తంగాలు ౬౦
అను నగ్రహారాన - నవనీశ్వరుండు
దిగు మంటపమ్మున - దిగి కమండలువు
దండంబు గొడుగును - ధాన్యపు మూట
క్రింద నునిచి ధర్మ - మంద చరించు
ప్రభువరేణ్యుండు చి - రంజీవి యగుత ౬౫

మని సాగరమున వి - ష్ణ్వావలి సేయు
నరులఁ గదంబక - తరువుతో నఱికి
జగములకు శుభమ్ము - సమకూర్చు ఱేఁడు
సుఖియించుఁగాక వి - శుద్ధ ధ్వజాంక
మొలయ హిమాద్రిపై - నిలిపిన నృపతి
యాయు రారోగ్య భా - గ్యము లందుఁగాక
యని మది మదిమది - ననుచుండు తఱిని
తల్లిదండ్రుల వీడి - తడఁబడు నడక
ముంగురుల్ కూఁకటుల్ - మురువుగా నాడఁ
దొక్కు పల్కులతోడ - మిక్కిలి వేడ్క
నాడెడి పిల్లలా - బాడబుఁజేర
నాతఁడో బాలకు - లార ! నాతోడఁ
జదువుఁ డీ మాట నొ - సంగెద ననుడు
వార్తికుండను పాఱు - వాని పుత్రుండు
దక్షిణామూర్తి నాఁ - దనరిన వాఁడు
పాల్గాఱు నోటితో - బాలుర యెదుటఁ
దడఁబడు నాలుక - యడరువాఁడయ్యు
స్వరలక్షణము సుంత - జాఱక యుత్స
హించి యతని తోడ - నింపారఁ బలుక
మెచ్చి వాని తెలివి - మిక్కిలి పొగడి
జందెమ్ముతోడ వ - స్త్రమ్ములు నగలు
కటకముల్ మొదలగు - కానుక లొసంగి

తన యూరికి మరలె - దక్షిణామూర్తి
కట్టి తొడిఁగినవి - కాంచి యసూయ
ప్రబల వార్తికుఁ బట్టి - రక్షక భటులు ౯౦
నృపుని ధనమ్ము హ - రించినాఁడనుచు
బంధించు నంత నా - పాఱుని భార్య
వెక్కి నలందురె - వెల వెల వోయెఁ
బొరలె దైవము దూఱెఁ - బొగిలె దూపిల్లె
దుర్గాలయమ్మున - ధూప దీపాది ౯౫
కములు లేవయ్యె ద్వా - రము మూఁతపడియె
నది యెఱింగిన రాజు - పొదలు వృత్తంబు
వినిపింపుఁడన భటుల్ - విభునకు మ్రొక్కి
వార్తికు బంధించు - వైనమ్ము దెలుప
నది యోగ్యపథము కా - దని బల్కి నృపుఁడు ౧౦౦
వార్తికుఁ బిలిచి యొ - ప్పఁగ గౌరవించి
యవివేకులగు భటుల్ - దవిలించు దొసఁగు
కతన నాయేల్బడి - కడు నింద్య మయ్యె
క్షమియింపుఁడని క్షేత్ర - సంవేష్టితంబు
తంగా లనెడి యూరు - తగనిచ్చి మఱియు ౧౦౫
వయలూరు నొసఁగి య - వ్వార్తికు దార
కార్తికి దుఃఖమ్ము - కడముట్టఁ దొలఁగ
నేలపడంతికి - నెఱ సొమ్మొసంగి
కూడలి నగరానఁ - గొండల వంటి
దొడ్డ మేడలు విన - దుర్గాలయమ్ము ౧౧౦

తెఱచి యంతటఁబోక - తివిరి దొసంగు
లొనరించి నారల - ననువునఁ బట్టి
బంధించి యుంచిన - పగవారి వీడి
వారి వారి ధనమ్ము - వారికి నిండు
దొరకినదైనఁ బాఁ - తఱ నున్నదైన ౧౧౫
మఱి యెట్టిదైన నె - వ్వరి కెది దొరకు
వారిదే యగునని - వారణంబుపయి
భేరి వేయించిన - ధీరమానసుఁడు
పాండ్యుఁ డియ్యెడ నీతి - వదలిన కతము
వినుము కటక మాస - మునఁ గృష్ణపక్ష ౧౨౦
మందు కృత్తిక తోడి - దగు శుక్ర వాస
రమ్మున మధురా పు - రమ్మగ్గిఁ గాలు
నవనీశుఁడు నశించు - నను వాక్కుపుట్టె
జగతిఁ గళింగ దే - శమ్మున సింహ
పురమునను కపిల - పురమున వసువు ౧౨౫
కొమరుఁడు ననురాచ - కొమరులు పాలి
వారలు దమలోన - వారని కంటు
తలయెత్త నాఱాము - డల కొలనున్న
నేలకై పెనఁగి పే - రాలంబుసేయ
నొల్లక యుండఁగాఁ - బెల్లుగ ధనము ౧౩౦
కూడఁబెట్టఁ దలంచి - కొఱలేని విలువ
నగలఁగైగొని సింహ - నగరి కేతెంచి
యంగనతో నొక్క - యంగడివీథిఁ

జేరి గుట్టుగ సొమ్ము - చేకూర్చుచుండు
సంగముఁ డనువాఁడు - చాలియుండంగ ౧౩౫
వసువను నృపతికిఁ - బాలన మందు
తోడా నతఁడు భర - తుం డనువాఁడు
సడలించి నాఁ డహిం - సావ్రత మబల!
కఠినుఁ డోర్వఁడి వాఁడు - కాంచి సంగముని
వీఁడు శాత్రవులకు - వేగని పట్టి ౧౪౦
విభున కొప్పించి చం - పించినవాఁడు
పడఁతి నీభర్త కో - వలుఁ డనువాఁడు
నిజము సంగము చాన - నీలి యవ్వెలఁది
దిక్కుమాలిన దయి - దీనత నొంది
సద్ధర్మమే యిది - క్షత్రియులార! ౧౪౫
పాడిగాఁ దోఁచెనే - వర వైశ్యులార!
గుణుల పద్ధతియె పట్టణ వాసులార!
ఈ యూర మీరు లే - రే వేల్పులార!
అనుచు వీథులను న్యా - యస్థానములను
చుట్టి చుట్టి విసిగి - సోలి సొమ్మసిలి ౧౫౦
పదునాలుగవనాఁడు భర్తను గూడఁ
జనవెంచి కొండ కొ - మ్మన కెక్కి నిలిచి
మాకు నీ యగచాట్లఁ - జేకూర్చువారు
తక్కక యిట్టి వం - తలఁ బొందువార
లని శాపమొసఁగె న - య్యది మీకు నిప్పు ౧౫౫

డనుభవింప వలసె - నన్నుల మిన్న !
దుష్కృత ఫలములు - తొడరెడి వేళ
సుకృత ఫలమ్ములు - చుమ్మాదు కొనవు
పడఁతి నీభర్తయుఁ - బదునాల్గు నాళ్లు
చనుడు వేలుపు రూప - మునఁగాక మనుజ ౧౬౦
రూపమ్ముతోఁదోఁపఁ - దేపున ననుచు
వగ మధురాధి దే - వత పూర్వ కర్మ
మెఱిఁగించి యటనుండి - తరలినపిదప
నాహృదయేశుఁది - న్నగఁగాంచుదాక
నెమ్మది గనరాదు - నిలువనుగాదు ౧౬౫
అని దుర్గ గుడికడఁ - దనకేలనున్న
వన్నియ గాజులంఁ - బగులంగఁగొట్టి
పురము పూర్వ ద్వార - మున భర్తతోడ
నొలసిన యే నిప్పు - డొంటరి నగుచుఁ
బడమటి వాకిట - వెడలెడి దాన ౧౭౦
నని పల్కి రేఁ బవ - లను వాసి లేక
కర్తవ్య మేదియో - కానంగ లేక
భ్రాంత చిత్తయగుచు - వైఘతీరమున
మిట్ట పల్లమ్ములు - గుట్ట మెట్టలును
గండ్లు ముండ్లును లెక్క - గనక తా నడచి ౧౭౫
కడలి నడుము చీల్చి - క్రౌంచ పర్వతము
తొమ్మ చీలిచి యసు - రుల మాల్చినట్టి

కొమరుఁ డున్నెడ[1] కెఱ్ఱి - గుట్టపై కెక్కి
నడచిన వేఁగి నీ - డను నిల్చి క్రౌర్య
మాచరించితి నని - యనుతాపమంది ౧౮

పదునాల్గు దినముల - పదపడి పతిని
కనఁదగు దినమిది - యని యబలాట
పడఁ దన కీర్తిని - పలుమాఱు పొగడి
యలరులు కురియు చిం - ద్రాది దేవతలు
వచ్చి కన్నగికిఁ ద - ద్భర్తను చూపి ౧౮
మానుగ దేవ వి - మానమ్మ నందు
కొని పోయినారు నా - కుల లోకమునకు

వ॥ గరితలకుఁ విభూషణము కన్నగి వేలుపు రూపమంది ని
ర్జర వనితా జనంబులకుఁ జాలిన విందయి యొప్పె ధారణిఁ
బరమును గాన కొక్క తన భర్తనె కొల్చు సతీమణిఁ సురే
శ్వరుఁడును పూజసేయు నను పల్కు యథార్థమ యయ్యె దీనిచె

గద్యము॥

మువ్వురు కిరీటాధిపతులఁ బాండ్యవంశ ధర్మపౌరుష ర
ణంబులు తన్నగర వైభవంబులందలి యుత్సవంబులు వేలుపు
ాక ప్రేమ మయులగు దేశప్రజలు వారి సంపత్సమృద్ధి వైభ
ప్రవాహ మహిమమ్ము కాలానుకూల వర్షమ్ము నర్థ ధర్మ ప్రతిపా
కములగు జాతీయ జైత్ర క్రీడలు తీరు తీయములు గలిగి చెలఁ
తో ప్పెరుందేవితోడ సింహాసన మందపడి కెడసిన పాండ్యునితో నొ
యింత తెలియు నట్లమరిన మధురాకాండమను రెండవ భాగము.

సంపూర్ణము.

---

1. తిరుచ్చెంగున్నూరు.

## ౩. పంజికాండము

### ౨౪. పార్వతేయుల యాట

మంజ॥ గుట్టనెక్కుచుఁచిన్న - పిట్టలఁదోలి
చిలుకలఁదఱిమి దో - నెల నెలయేళ్ల
మునిఁగివచ్చిన మాకు - ముందటనున్న
వేఁగి నీడనొకర్తు - వెలఁది మా యెదలు
నడుఁకంగ నొక్కస్త - నము లేక గాయ
పడి నిల్చియుండఁశ్రీ - వల్లిచందమున
మెలఁగు వారెవరని - మేము ప్రశ్నింపఁ
గనలక యామె దు - ష్కర్మ ఫలాను
భవము వేళను పాండ్యుఁ - బట్టణమెల్ల
నశియించునట్లు నా - నాథు నామధుర
గోల్పడ్డ పాపాల - కుప్ప నే ననియెఁ
అన మేము భయపడి - యంజలిపట్టి
నిలువ వేలుపులు పూ - వుల వానకురిసి
పతితోడ నామెను - జతగొని చనిరి
తల్లిఁబోలిన కుల - దైవమ్ము మనకు
వేఱులేని కతన - వేఁట పల్లియను
గల జనులార! యా - కలికిని కొలుఁడు
మలనెత్తమున వేఁగి - చలువను నిలుచు
వనితనే మేటి దై - వముగాఁగఁగొలుఁడు
ఏకస్తనియయిన - యెలనాగ కిప్పు

డిమ్మల తఱుఁగని - ఫల మిచ్చుఁగాక
పలకలు తుడుములు - వాయింపుఁడీరు
మధ్యమ శ్రుతిలోన - మానుగఁ బాడుఁ
డలరుల యర్చన - మలరి చేయుండు
ధూపమ్ము వేయుఁడు - స్తోత్రగీతములు ౨౫
పాడుఁడు కంచియ - గోడ కట్టింపుఁ
డనుచు వేఁటరులలోఁ - బినపెద్ద పలుక
నామెఁ బూజించి రం - దతివలు పాడి
యంజనపుం బొడి - యరి దళపుఁబొడి
సిందూరపుం బొడి - చెదరంగఁ బరవ ౩౦
నింద్ర ధనువువోలె - నొసఁగుచుఁదావి
గలిగిన సెలయేటి - జలమందు కలిసి

॥ ఆడుదమా చెలి యాడుదమా
ఆడుదమా నీ రాడుదమా
ఆడుదమా చెలి అంజకు మని పొ
ల్లాడి యందములఁ గొల్ల గొనుచు దయ
వీడిన యాతని వెల్ల మేఘములు
కూడు వనమ్ముల కొండ యేటిలో ॥ఆడుదమా॥

॥ గొడవ మనకుఁ బూనుచు వాని - కొండతాలఁ
దగిలి వచ్చిన క్రొన్నీట - వెగడు పుట్ట
నేమి కారణమో యంద - ఱిట్లు కూడి
యాడినను మనసులు కుంది - వాడుచేల ? ౧

తే॥ అతని కొండ పొంబొడి తోడ - నతికి వచ్చు
క్రొత్త వెల్లువపై నింత - కోపమేల ?
అట్టి నీటిలో నాసక్తి - నాడి నంత
నుల్లములు నొచ్చుచేలొకో - యువిద చెపుమ ? ౨

తే॥ అతని కొండ పూవులతోడ - నలరివచ్చు
క్రొత్త నీటిపై వెగటుచేఁ - గుందనేల ?
అట్టి నీటఁ గొందఱు మున్న - యాడిరేని
మన మనంబు లసూయచే - మఱుఁగుచేల ? ౩

తే॥ ఇంకఁ జాలును మన కను - లెఱ్ఱ వాఱఁ
దేట నీటమునిఁగి యాడి - తిమి పయోధి
మావి మ్రాఁకును నఱికిన - శీవి కాని
పొలుపు పాడి మండలముగ - గెలుపుటాట
యాడుదము రారె చెలులార ! - యాడరారె. ౪

స్వహ॥
కడలి నడుమఁజొచ్చి యసుర - కాంతు శూర పద్మమా
మిడిగ నిల్చువాని నఱకు - మేటి భల్ల మమ్మరో !
అడరి యెఱ్ఱ మలను తెల్ల - యైన మలను చెందిలోఁ
దొడరి యేరక మనుచోట్లఁ - దోఁచు గుహుని చేతిదే. ౫

స్వహ॥
'పిణిముగ' మను నెమలినెక్కి - విమతుల పొలమార్పఁగా
నణఁగి వేల్పు దణి నుతింప - నరులఁ గూల్చు బల్లెమా
గణన కాఱు తల లిరాఱు - కైలు గలుగు సైనికా
గ్రణి కరంబు నం ధరింపఁ - గా వెలుంగు నట్టిదే. ౬

ఉత్సాహ॥
పెరుఁగుచున్న కొండఁజుట్టి - వెఱఁగు దోఁపఁదిరుగు న
య్యెఱచిదిండిఁబొమ్మ్రచీల్పనెంచి కొంచమలకుఁ దూ
పరమొనర్చు మేటి యీఁటె కాశపుష్ప శయ్యపైఁ
బరఁగి యార్గురమ్మల చనుఁబాలుద్రావు వానిదే.

ఉత్సాహ॥
చెలియ! మిరెపుఁ దీవలుల్లసిల్లు కరువ వాఁడు నా
కొలయఁగూర్చు నొవ్వి దీర్చునొళ వెఱుంగమిన్ గుహు
డెలసి వలచె నంచుఁ దల్లియెంచి వెఱ్ఱియాట యం
దెలిమి పూజరీనిఁ బిలుచుటెన్న నవ్వవచ్చెడిన్.

ఉత్సాహ॥
చెలువ పెద్ద కొండవానిచే ఘటిల్లు నంగదన్
దొలఁపఁ బూజరీఁడు వచ్చుఁ దొయ్యలి! యిది నిక్కమే
జెలువుచేష్ట నవ్వులాట చెలువుదోఁచు నతఁడు రా
నలఘు మూఢుఁడగు గుహుండు నరుగు దేర మోఱకే.

ఉత్సాహ॥
తెఱవ! యతఁడొసంగు నొవ్విదీర్ప నతఁడె వచ్చునే
నరయఁగఁ బరిహాసపాత్ర మగుఁగదే వివేకినీ!
యెఱిఁగి యెఱుఁగ కట్లు వచ్చునేని [1] బల్లెదారియే
మొఱకు; గుహుఁడె వచ్చునేని మొఱకు మిన్న యతఁడగున్

తరల॥ చెలువరో! మలనాటి మన్నెని చెలువు బొమ్మ ఘటించు సి
ల్గులఁ దొలంపఁగ బల్లెదారి వెలుంగ వచ్చునటే సఖీ!

1. గుహుని పూజారియు బల్లెముధరించి యాడెడివాఁడు కావున బల్లెద
యనఁబడియె.

కలఁక దీర్పఁగ వచ్చు నాతఁడు కంటె మోఱకు సూ! గుహ
డలర వచ్చిన నాతఁడుం దనకంటె మోఱకు ధారణిన్. ౧

ఆ॥వె॥ భిల్ల భల్ల ధారి - వెఱియాడు రంగాన
కమర వల్లితోడ - సెమిలినెక్కి
గుహుఁడు వచ్చు రాఁగఁ - గొండతేఁడు మనలఁ
బెండ్లి యాడునట్లు - వేఁడవలయు. ౧

ఆ॥వె॥ శివ కుమార ! పరులఁ - జెట్టఁ బట్టఁగఁబోకు
నీకుఁ దగిన కొలము - నెలఁత లేము
తలిరుఁ బోలు పాద - ములకు నమస్కృతుల్
చేయు వార మయ్య - చేరికావ. ౧

ఆ॥వె॥ కరువపట్టిపట్టి - కొఱవ కన్యకలకు
మేటి వేల్ప వయిన - నీటుకాఁడ !
నీదు చరణములకు - నెఱి మ్రొక్కువారము
పెద్ద లరయుపెండ్లి - పెండ్లియనుచు. ౧

ఆ॥వె॥ కొఱవ తెఱవ తోడఁ - గూడిన నీ చర
ణములకుంజోహారు - కొమరుసామి !
నీటి రేవుకడను - నిను మ్రొక్కువారము
నింద లేనిపెండ్లి - నందుకొఱకు. ౧

మంజ॥ అనిమేము పాడఁగా - నావలినుండి
వినిన యిమ్మల నాటి - విభుని యెదుటికిఁ
జని కేలు మోడిచి - వినతి నిల్చితిని
నిలిచి పల్కిన పల్కు - లెలమిని వినుము

కడిమి పూవుల మాల - కంఠమందమరఁ
గేల నీఁటియ దాల్చి - లీలగా నీవు
సుదతికై వచ్చుట - చూచిన వారు
గుహుఁడనియె తలంపు - గొనఁదగియుండ
నాఱు మొగమ్ములి - రాఱు బాహువులు ౪౦
కొఱవ తెఱవ నట్టు - గువ్వయు లేవు
కాన నీపల్లెలోఁ - గలవారు నిన్ను
గుహుఁడనుటకు నొప్పు - కొనరు మోఱకులు
అని యిటు లల్ప వా - క్యములు నేనాడ
విని వాడిన మనమ్ము - వెనుకన పోవఁ ౪౫
బోయిన మలనాటి - భూపాలకుండు
పెండ్లి సేయఁగఁబోలు - వినుము కావునను
తన స్తనమ్మునఁబుర - దాహమ్ము సేయు
కన్నగికింబ్రియ - కాంతుని సురలు
చూపిన దృశ్యంబు - పొలయఁబాడుదము ౫౦

॥ చెలి పాడుదము రమ్మ - చెలి పాడుదము రమ్మ
ఇల షేఁడు తన పాడి - తల మీఱి నడవంగ
చెలువారు నగరమ్ము - వెలి బూది యొలయించు
చెలి కన్నగిని పాడు - దమ వినుతించి
పతి రతలు వినుతించు - సతి కన్నగినిపాడు
చతురతను మన ప్రియుఁడు - చవిచూచి తనివోవ. ॥చెలి॥

మంజ॥ క్రొత్తడుల్ వినుతించి - కూర్మి సేవించు
కన్నగి క్రొమ్మేటి - గట్టున నుండు
వేలుపు లామెకు - విభుని గాన్పించి
పొగడుట వింటిమి - పొగడుద మట్లు
స్వర్గవాసులు నమ - స్కారముల్ సలిపి
వినుతింపఁగా నొక్క - వేఁగి క్రీనీడ
నిలిచిన దొక్కత - యెలనాఁగ యామె
తన భర్తతో దేవ - తా జీవితంబు
నుండి మరలి దిగి - యుర్వికి రాదు
ఆ పతివ్రత మన - మార నుతింప
నదియొక వ్రతముగా - నమర నీయూర
నాయమ పతి యిట - కరుదేరఁ గాంచు
పుణ్య వ్రతంబు నీ - పుడమి నోచినది
అని మేము పాడుచు - నాడిన కొఅవ
యాటనుగని మన - ప్రాణ నాయకుఁడు
మన త్రోవ నిలిచెను - మనమున నలరి
విల్లు నాటిన గిరి - విభు కొమ్మనుండి
కొల్లిమలను గూడఁ - గొమరార నేలు
చేర భూపాలుండు - వీర పానమున
నొనర మత్తిలి చిరా - యుష్మంతుఁడగుత.

---

## ౨౫. పర్వతదర్శనము

కడలిని కోటగాఁ - గన్న కదంబ
తరువు నఱికి హిమ - గిరి మీఁద వింటి
పడగ వేల్పులు భ్రమ - పడ నిల్పినట్టి
చేరవంశ భవుండు - చెంగుట్టువుండు
సవురైనమేడలో - యువరాజలక్ష్మి[1] ౫
యను దేవితో మాట - లాడుచునుండి
మురజంబువలె నిరం - తరము ఘోషించు
సెలయేళ్ల మొగుళులు - చెరలాడుచుండు
గిరులు వనమ్ములు - పరికింపఁదలచి
దేవితోఁబరిచారి - కా వితానమ్ము ౧౦
తో వంజినగరంపు - దోరంబు కడచి
పూఁదోటలో వేల్పు - పూఁబోండ్లతోడ
విహరింపఁగోరిన - విబుధనాథుండు
కల్పవనులు సుర - గంగ దీర్ఘికలు
మడుఁగులుకొలఁకులు - మండపములును ౧౫
నాటకశాలలు - మేటిసౌధమ్ము
లాక నూటయేఁబది - యోచనలకును
తగినట్లమర్చి చౌ - దంతిపై నెక్కి
వచ్చు వానింబోలె - వచ్చిమోదమున
గోఁగులు వేఁగులు - గుత్తులై వ్రేలు ౨౦

1. ఇళంగోవేణ్మాల్.

విరితేల తరువులు - సురపొన్నచెట్లు
పూచి యొత్తుగరాలు - పూవుల పఱుపు
పుప్పొడి పఱుపు పూ - వుల తేనెకొలకు
రొదలతోఁ బొదలు తు - మ్మెదల పిండులును
వెన్నుని యురమునఁ - జెన్నారు ముత్తె
సరివోలెఁ బ్రవహించి - గిరిఝురిదరిని
యిసుక తిన్నియపయి - నెలరారుచుండ
కొలవ యాటల ధ్వనుల్ - కొలవతల్పాడు
పాటల సద్దులు - పరమేశుపుత్రుఁ
గూర్చిన పాటల - కోలాహలమ్ము
కొట్టల దంచెడి - కొలవల యఱపు
పలకలఁబోలిన - సెలయేళ్లరొదలు
పులులతోఁ బోరు దం - తుల ఘీంకృతులును
పులుగులఁదోలు మం - చెలమీఁది యఱపు
లోదంబులంబడి - యున్న యేనుఁగులఁ
బట్టు మావంతుల - పల్లఱపులును
విడిసిన దండుచే - వెడలు నారావ
మెల్లెడఁజెవులను - చిల్లులు పఱుప
మితిలేని భూషణ - తతి మోచితెచ్చి
వినుతసంపదలతో - వెలసిన నగరి
వాకిట ప్రభుని సే - వన దర్శనములు
గలుగక కాన్కలు - కడుమోచితెచ్చి

ఎలిచిన శాత్రవ - నివహంబుఁబోలె
హస్తిదంతంబులు - నగురు కఱ్ఱలును
చందన కాష్ఠముల్ - చామరములును ౪౫
తేనెకడవలు చెం - దిరపుగడ్డలును
కస్తూరి యేల తీఁ - గలు నంజనంపు
శిలలు మిరియములు - పలు కందములును
పనసపండ్లు నరఁటి - పండ్లు టెంకాయ
లల్లంబు మామిడి - యల్లముల్లియును ౫౦
పూవులతీవలు - పోఁకగుత్తులును
శరభ వారణ సింహ - శార్దూల భల్ల
చమర కస్తూరికా - శాబకములును
జింకల దుప్పుల - చిన్న పిల్లలును
ముంగిసల్ నెమళులు - పునుఁగుపిల్లులును ౫౫
చిలుక లడవికోళ్లు - శిరములమోచి
మలల వసించువా - రలు తెచ్చినిలిచి
ఏడు తరముల వా - రేడు జన్మములు
మీకు లోఁబడెదము - మీ రాజనీతి
చిరముజయమ్ముతోఁ - జెలువొందుఁగాత ౬౦
మని జయ జయ ఘోష - మమరఁ గావించి
అవధరింపుము దేవ ! - యడవికి నడుమ
వేఁగి తరువు నీడ - వెలఁది యొక్కర్తు
స్తన మొండు నీఁగి యు - త్కటదుఃఖమంది
వేలుపుల్ వినుతింప - విభునితోఁ గూడి ౬౫

యమర లోకంబున - కరిగె నేదేశ
వనితయో ? యెవ్వరి - తనయయో ? యెవని
పత్నియో ? యిట్టి సం - భవ మిది వఱకు
కని విని యెఱుఁగమో - మనుజదేవేంద్ర !
సుగము చిరాయువు - నగుత మీ కనుచు
వేఁటరుల్ వినతిమై - విన్నవించుడును
కనుల పండువుగ భూ - కాంతు దర్శనము
సాగ నచ్చట నున్న - శాస్త్ర విజ్ఞాని
తమిళ విద్వాంసుండు - తగ నాలకించి
అప్పతి వ్రతకైన - యగచాట్ల నెల్ల
నవధరింపుమ రాజ - యని యిట్టు లనియె
మిడిమేల విధి యందె - మిషచే నొనర్చు
బన్నంబు కన్నగి - భర్తకుఁ గలుగ
రెండవ యందెతో - నృపుని యెట్టెదుర
నిలిచి కన్నగి పల్కు - పలుకు లందియను
పగులఁ గొట్టుటయును - ప్రభుదేవి యెదుట
చేయు ప్రతిజ్ఞయుఁ - జెచ్చెర నచటు
తరలి యూడ్చిన పయో - ధరముననుండి
పొడమిన యగ్గితోఁ - బురమును కాల్చు
టరయంగఁ బలికి సిం - హాసన మందు
నుండి పడుట గాంచి - యువతి దుఃఖంబు
గని భరింపక రాజు - కళ నొందె ననుచుఁ

దలఁచి పాదంబులఁ - దడవి యా యువిద
కన్నగి పలికిన కటు - వాక్యములను
వినక మనంబున - వేసట పడక ౯౦

యధినాథు దారి నే - నరిగెదఁగాక
యని తన ప్రాణమ్ము - లతని ప్రాణముల
వెదకునవియ పోలె - వీడి చనంగఁ
గోప్పెరుందేవియుఁ - గూడనే మడిసె
పాండ్యుని దుష్పరి - పాలన రీతి ౯౫

యిది యని చూపిన - యదివోలె ధర్మ
దేవత యీలీలఁ - దొరలె ననంగఁ
గన్నగి యటనుండి - కదలి యొంటరిగఁ
దనదేశ మార్గానఁ - జనక నీదేశ
మునఁ జేరినది యని - పూర్వాపరములు ౧౦౦

విడువక వాక్రుచ్చి - విభవ దేవేంద్ర!
విధి విధి నీమేలి - విజయ మితోధి
కముగ వర్ధిల్లును - గాకని పలుకఁ
బాండ్యదుర్మరణమ్ము - పరఁగుట విన్న
చేర రాజెదలోనఁ - జింతించి యనియె ౧౦౫

పతులకు ధర్మ వి - చ్యుతి చేతఁగలుగు
పరుష వాక్కులు చెవిఁ - బడు మున్నెయసువు
లూడుచు వాక్కులు - చూఁడునే చెవుల
నని ప్రాణముల వీడు - నవనీశ్వరునకు
దుర్విధి వంచిన - దుర్దండనమ్ము ౧౧౦

పాసిన ప్రాణమా - వంపు దీర్చినవి
వాన కురియకున్న - భయము జనించు
ప్రాణముల్ తపియింప - భయము మిక్కిలును
ప్రజల రక్షింపంగఁ - బాలన పూని
మాటపడుట కంజు - మంచి వంశమున ౧౧౫

జనియించు బెన్నఁగ - ష్టద మగుఁగాని
గణ్యమౌ సుఖదంబు - గాదని పలికి
కన్నగికింగల్గు - కష్టమ్ము లెఱిఁగి
వివరించు శాస్త్రతోఁ - బ్రియ వాక్కులాడి
మన్నించి రాణితో - మహిపుఁ డిట్లనియె ౧౨౦

పతి జీనముల నెడ - వదలక చన్న
కోప్పెరుం దేవియుఁ - గోవలుఁ గోలు
పోవ్వ కోపమ్మున - నావలికిఁ జను
కన్నగియు నను నీ - కాంతా ద్వయమున
వినుత పాతివ్రత్య - విధమేరి దనుడు ౧౨౫

భర్తృ మరణ దుఃఖ - భర మోర్వలేక
చనిన దేవేరికా - స్వర్గమ్ము నంద
పార సుఖమ్ముచే - కూరును గాక
భర్తృ మరణ దుఃఖ - భర మోర్వలేక
రాజును గూల్చి త - ద్రాజ్ఞిని గూల్చి ౧౩౦

పురమును గాల్చి యీ - భూమికి వచ్చు
పతి దేవతను గొల్వ - భవ్యమౌ మిగుల

భావ్య మయ్యది యని - ప్రభుదేవి యాడ
నవనీశ్వరుఁడు యుక్త - మని సమ్మతించి
మంత్రుల మోము నె - మ్మదిఁ గాంచునంత ౧౩౫
మలయమందునఁ గాక - మన వింటి పడగ
గల హిమగిరి యందు - గల రాయి గొంచుఁ
జెక్కించి తెచ్చు టు - చితమైన రీతి
ఆ ప్రతిమను గంగ - యందు కావేరి
నుంచి తెచ్చుట శుభ - మంచు వారనుడు ౧౪౦
మలయ శిలం బ్రతి - మను చేసి తెచ్చి
కావేరి నుంచుట - కడుగొప్ప పనియె
మాకులమ్మున కది - మాన్యత గాదు
జాజు తావి విరుల - జడముడి తేమ
పోవని వలువ ము - ప్పూరి జందెమమరఁ ౧౪౫
ద్రేతాగ్ని సంపద - యేతఱి గలుగు
స్వర్ఋషులతోఁగూడఁ - జలిమల జేఁడు
లేఁ బ్రాయమున భూస్థ - లిని మేల్మిగాంచు
పత్ని దైవమునకుఁ - బ్రతిమ చేయింప
నొకఱాయి యీయఁడే - నుర్విజనించి ౧౫౦
విఫలులై గౌరవ - విధు లంద లేక
చచ్చిన వారలు - చానున్నవారి
కానరఁ దెల్పిన మేని - యుండమిఁగాంచి
తన కుల పూర్వు లా - ర్యను చంద్రధరున

కొసఁగిన వియ్యాన - నొసఁగుట కాంచి ౧౫౫
యుత్తర దిశకు మే - మెత్తంగఁ గాంచి
యడ్డు నిలిచి భంగ - మందుట గాంచి
నెలవంక లేఁత వె - న్నెలగాయు జడను
మందార మాలతో - మల వేఁగిమాల
సంచుగా నుంచుట - గాంచెదఁగాక ౧౬౦
ప్రస్థానమునకుఁ - గావలయు సన్నాహ
ములను గావింపుఁడు - భూరి సైన్యముల
విందుచేఁ దృప్తిగా - వింపుఁడు బిరుదు
మగలకుఁ దగిన స - మ్మానముల్ చేసి
బయలు దేఱుఁడు - వంజి వాకిట నిలిచి ౧౬౫
ప్రస్థాన మాలిక వహి - యింత మనుడు
'విల్లవఁకోద' యఁ - విభు సచివుండు
ప్రభు జయకీర్తి శా - శ్వతముగ నిలుచుఁ
గాత మంచుఁబొగడి - కడఁక నిట్లనియె
నీ వంటిరాజులు - నిను విరోధించి ౧౭౦
కొంగుల కలనిలోఁ - గ్రుంగి మీన్పడఁగఁ
బులిపడగ నొసంగి - తలఁగి పర్విడిరి
అది దిక్కరుల చెవు - లందు చొచ్చినది
కొంకణులును కళిం - గులు కటి నాటి
వారలు గాంగులు - వంగు లార్యులును ౧౭౫
ద్రవిడులతోఁ బోరు - బవరమ్మున నందు

మీ యేనుఁగుల వేఁట - మాయుల్ల మలర
నిప్పటికిఁ గనులఁ - గప్పి నట్లుండె
మన జననిని నాక - ధుని యందు జలక
మార్చిన తఱి వేవు - రార్యరాజులకు ౧౮౦
నీ వొక్కరుండవ - యెదురయి నిలిచి
పోరు చేసిన నాఁటి - వీర వేషమును
తన కన్నులఁదెఱచి - కనిన యాతండు
సుంతయు వెఱలేని - యంతకుఁడె కద!
జలనిధి వలయిత - సర్వభూమియును ౧౮౫
ద్రవిడ దేశముగ మా - ర్పఁగఁ దలపోసి
చలిమల యందొక - శిలగొన నెంచు
నిన్నెదుర్పఁగఁ దలం - చెడు వార లీజ
గమ్మున లేరని - కడిమితోఁ బలికి
మా నరేంద్రుఁడు చలి - మలఁ జేరుటెన్నఁ ౧౯౦
బత్ని దైవమును ని - ల్పఁగ నొక్కఱాయి
తేఁగోరియే యని - తివిరి యుత్తరపుఁ
బుడ మీశులకు విల్లు - పులి మీనుచిన్నె
లమర నుంచిన లేఖ - లందింప వలయు
భూమియందలి శాత్ర - వుల వేగు మూక ౧౯౫
నగరి వాకిట నిల్వ - నగు వార లగుట
విమతుల చెవులకు - వినిపింపలేరు
కాన నుత్తర దిక్ప్ర - యాణమ్ముఁ గూర్చి

యిటఁ బ్రకటించుటయే - తగుః నన్న
నృపుఁ డొడంబడి పగ - జేంద్రంపి నట్టి
కప్పమ్ములును కాను - కలు గొని మరలి
నగరునఁ జొచ్చె న - నంతర కార్య
మారసి ప్రతి కల్ప - మందు మారాజు
పుడమి రక్షించుఁ గా - వుత మని మంత్రి
చాప కేతువు గల - చలిమల యందు
పత్నిదేవత కయి - ప్రస్తరం బొండు
తే వచ్చెఁ జేర పృ - థ్వీపతి కాన
నుత్తర దిగ్రాజు - లొగి నప్పనములఁ
గొని తెచ్చి యిచ్చి యీ - తని ప్రభుత్వంబు
నంగీకరింపుఁ డ - ట్లగుఁ గాదయేని
కడలి యందలిదైన - కడిమిని నఱకు
వార్తయుఁ జలిమల - పై వింటిపడగ
నిలిపిన వార్తయుఁ - బొలుపుగ వినుచుఁ
దేఁకువ జీవింప - మేకొంద్రు గాత
మెఱుఁగర యేని సం - సృతి మీఁదరోఁత
నూనించు తపమును - పూనుఁడి మీర
లని నృపతి శరీర - మగు సైన్య సమితి
విజయ వంత మగుచు - వెలయుఁగా కనుచు
వారణంబు పయిని - భేరి మ్రోఁగించి
ప్రకటించు తొలి మ్రోఁత - బయలుబ్బ బెరసె.

---

## ౨౬. శిల తెచ్చుట

మంజ॥ ప్రస్థాన భేరి రా - వము విన్న పిదపఁ
జెంగుట్టువుఁడు చేరి - సింహాసనమున
నిండోలగంబున - నుండి మంత్రులను
సైన్యాధిపతుల శా - స్త్రజ్ఞుల హితుల
నొప్పారఁగని యాజ్ఞ - లొసఁగి యిట్లనియె
బహుపుణ్య తీర్థసే - వలుగోరి మునులు
హిమవంతముననుండి - యేతెంచి యిపుడు
తెలిపిన పలుకులు - తృప్తిలేకుండు
మనుగడ గలిగిన - మన్నీల వాక్కు
లవి మనయొద్దనే - యడఁగునవైన
మముబోఁటి భూపాల - మార్తండుల కిల
గౌరవ భంగంబు - గావున నిప్పు
డుత్తరదేశ నృ - పోత్తమాంగముల
మోయించి కాక వ - మ్మగ శిలతోడ
గ్రమ్మఱుచోఁజేతి - కైదువు మోఁత
చేటగుఁ గోమటి - చేతికత్తియగు
మదిమది నున్నయీ - మన ప్రజనెల్లఁ
గ్రూరతఁ బీడించు - కూళ నేననుడు
తేలమాలయు వేఁప - మాలయుఁదాల్చు
చోళ పాండ్యుల పూన్కి - గేలి సలిపిరి
గాక నిన్ననలేదు - కరుణామయాత్మ !

నిన్ను వంచనమున - నిందించి యెదురు
రాజులుం గలరేమి ? - రాజశార్దూల !
క్రోధమేలనుచుఁ బు - రోహితుఁడాడ
రాసులు స్థితులును - గ్రహగతు లెఱిఁగి
పంచాంగవిషయమ్ము - బాగుగఁ దెలుపు
నైమిత్తికుఁడు లేచి - నరనాథచంద్ర !
చిర సుఖీభవ ! యొండు - చెప్పెద వినుఁడి
భూమియందలి రాజ - పుంగవులెల్ల
నీపాదపద్మముల్ - నియతి సేవింపఁ
దగిన మూర్తంబిది - తలఁచిన దిశకుఁ
బయనమిప్పుడుచేఁత - బాగని పలుక
విజయశీలనృపుండు - విని మనకత్తి
గొడుగుత్తరదిశకు - నడచుగాకనుడు
ధరణి మోచిన పాఁప - దణి వేయితలలు
వడఁకునట్లుగ మ్రోఁగెఁ - బ్రస్థానభేరి
మబ్బు చెడఁగనించు - మణులదీపముల
వెలుఁగునఁ బడగలు - వెలుఁగ దట్టముగ
విబుధులు మంత్రులౌ - వృద్ధపంచకము
బలపతు లాయము - వారెనమంద్రు
భూప మిత్రులగు వి - ప్రులు గణకులును
ధర్మశాస్త్రజ్ఞులు - తాంత్రికవరులు
జయ జయ రవము లె - సంగ దంతిపయి

గొడుగు నడిదమును - కొమరుగ నుంచి
వాకిటి బయటికిఁ - బంపిన యంత ౪౫

తాలప్రసూన హా - రాలితో వంజి
పేరు చేరిచి తాల్చు - చేరుని సేన
క్రమముగా ద్వారంబుఁ - గడచి వెల్వడియె
ఆయుధీయులకు సై - న్యాధికారులకు
విందులు చేసిన - పిదప మన్నీఁడు ౫౦

హిత విధమ్ముల నలం - కృతు లొప్పఁగొనుచు
ఎల్లమన్నెదొరలు - చెల్లించు నుపద
దయచూపి కొనఁగ ను - దయభేరి మ్రోఁగఁ
బరమేశు పదముల - విరులను చల్లి
పరులకు వంగని - శిరముతో మ్రొక్కి ౫౫

యాహుతిపొగ సరి - నలరుల వాడ్ప
మదపుటేనుఁగుపయి - ముదముతో నెక్కెఁ
పడమటి నృపునకు - భద్రమౌఁగాక
యని యనంతపురి య - నంతశయనుని
శేషమ్ముతోనిల్చి - సిరిమేల్మిపొగడు ౬౦

వారలఁజేసన్న - వలన మన్నించి
గంగాధరుని పాద - కంజాతములను
తన శీర్షమందు పొం - దఁగ నిల్పుకొన్న
వాఁడౌటఁగేడెమ్ము - బాహుపీఠమున
ధరియించి విభవంబు - మెఱయంగ వెడలె ౬౫

నాటకత్తెలు తమ - యాటపట్టులను
కేలుమోడ్పున జయ - శీల! దిరిసెన
తుమ్మి తాటిపువుల - తోఁజేర్చి కట్టు
సరులు పట్టపుటేన్గు - శిరమునఁదోఁ
మణుల గొడుగునీడ - మా గాజు ల
కసుల పండువు గల్గుఁ - గాకని పొగ
సూతులు మాగధుల్ - వైతాళికులును
జయ జయధ్వానముల్ - సలుపుచు న
వారణ వీరులు - వాజి వీరులును
సాయుధ వీరులు - చేయెత్తి విజయ
వాక్కుల వినుతింప - వాసవుఁ డసుర
పురములపైకి స్వః - పురి వీడి చన్న
పొలుపునఁ దన వంజి - పురమును వ
దళ వాయులును వారి - దళములు దం
ఘటలు పడగ సేన - కడలి తీరమున
నడచుచు నుండఁ గొం - డల వీఁపు
బుడమి ప్రీలి కసుమ - నడ త్రోవఁదొ
నగుదేర నడచి నీ - ల గిరీంద్ర భూవి
విడిసి నత్తెలుఁగుల - దడములు చుట్టి
యుండు పాశెమ్మన - నుర్వీశ్వరుం
తానేలు నేలకుఁ - దన చరణముల
నొసఁగి నడచి సెజ్జ - కొగిఁజేరునం

సీవలావలికి సే - నా వీరు లరిగి
కలియంగఁ బలుకు పే - రులివు మిన్నొరయ
విని ముని వీరు లీ - పృథివి యందింద్ర ౯౦

విభవ మందిన నృప - వీరుని కాంత
మని దిగి మెఱపు ల - జ్జను పొందుమేని
యొఱపుతోఁ దోఁప న - య్యొడయందు లేచి
కేల్మోడ్చి నిలువంగఁ - గీర్తించి శంభు
కరుణఁ గరూరునఁ - గలిగిన భూప ! ౯౫

విను మేము మలయమ్ము - గన నేగుచుంటి
మీవు హిమాద్రికి - నేగ నెంచితివి
కావున నచ్చటఁ - గలరు సద్ద్విజులు
తద్జ్ఞుల రక్ష నీ - ధర్మంబ యనుచు
నాశీర్వదించి ము - నీశులు చనుడుఁ ౧౦౦

జేర రాజునకు జే - జే యంచుఁ బలికి
కర్ణాట నటులు కొం - కణపు నట్టువులు
తమ కుల విధులకుఁ - దగిన పద్ధతుల
నిరులు క్రమ్మ దరుల - సురిఁగిన సిగను
మరులు గొనఁ దఱిమి - విరి సరుల్ చుట్టి ౧౦౫

మణి సరు లలరార - మఱుఁగు లేఁజనులు
వాలుగ మీలను - పోలు విశాల
నయనమ్ము లనువొందు - నయము పెంపొందు
కొమిరెలతో వచ్చి - కోకిలల్ పాడఁ

దేంట్ల వీణియ తలల్ - దిమ్మెత్త మ్రోఁగ
నలరు గుత్తు లలరు - నామని వచ్చె
రా రండు ప్రియులార! - రండు రండనుచు
జాతీయ గీతముల్ - చతురత తోడఁ
దేటగాఁ దలఁపులు - తెలుపుచుఁ బాడఁ,
నెలనాఁగ నీ వలం - కృతి చేసికొనుము
పిడుగుల తోడను - వడగండ్ల తోడ
నుఱుముల తోడను - మెఱుములతోడ
వాన కారేతెంచెఁ - బ్రాణేశుఁడెక్కి
చనిన తేరేతెంచెఁ - బని ముగించుకొని
యని కారు తఱి కను - వైన గీతికలు
కొడగు మదంతుకల్ - కోరికఁ బాడ,
నడఁగక మెండొడ్డు - నరి వీర వరుల
పొగ రడఁగించిన - భూపాల వరుఁడు
రాణి వాసము తోడ - రాణఁ జెలంగి
భద్రుఁ డగుత మని - వందులు పొగడ
శాస్త్రపద్ధతిఁబాడి - సరసోక్తు లమరఁ
బొగడినవారి క - పూర్వభూషణము
లలర నొసఁగి పేఁడు - కొలువున్న వేళ
నాట వెలందులు - నూట యిరువురు
అనుసారు లిన్నూట - యెనమండుగురును
తొంబది యాఱు వి - ధుల నొప్పు మీఱు

నాగమ పారగు - లైన వారలును
ఆఱు విధమ్ముల - హాసమ్ము గొలుపు
వారు విదూషకుల్ - నూఱు మందియును
తమ్మి మొగ్గల యర - దంబులు నూఱు ౧౩౫
మద కరు లేనూఱు - పది వేల సంఖ్య
కత్తిరించిన జూలు - గల వారువములు
తగ నపూర్వమ్ము లు - త్తరదేశజములు
కొలతలు పేరులు - గుర్తించియున్న
సరకుల బండ్లొక్క - యిరువది వేలు ౧౪౦
[1]సంజయుఁడాదిగాఁ - జను వేయి మంది
వచ్చినారని ద్వార - పాలకుల్ దెలుప
నాటకత్తెలు వారి - యనుచరుల్ సంజ
యునితోడ నిచటికిఁ - జను దెంత్రుగాక
యని రాజ వరుఁ డాడ - నా సభ కపుడు ౧౪౫
సంజయుఁ డరుదెంచి - సంస్తుతిచేసి
యాటవెలందుల - నూట యిరువుర
నేర్పులు వెవ్వేఱ - నిగదించి యవల
మిత్రు లుత్తరదేశ - మేదినీశ్వరులు
పలుగుండ్రు మీరొక్క - ప్రస్తరమ్మునకు ౧౫౦
వెడలుచుండితి రన్న - వృత్తాంతము విని
మేమె యా శీతాద్రి - మేలగు ఱాయి

1. సంజయుఁడు = దూతలలో మేటి.

చదలేటి తెలినీట - స్థాపనచేసి
యిచ్చటికే తెచ్చి - యిచ్చు వారమని
వినిపించి రన నరి - వీర భీకరుఁడు
బాల కుమారుని - బాలకులైన
కనకుండు విజయుండు - కడు కావరమున
నాల్కనణంచుకొ - నఁగలేక క్రొత్త
వారితో నేమేమొ - వదరినారనుచు
యముని దోడ్కొనివచ్చు - నదినేన యనుచుఁ
దెలిపి గంగను దాఁట - వలయు నోడలను
సవరింపుఁడని సుహృ - జ్జనులకుఁజెప్పు
మని పంప సంజయుఁ - డరిగిన పిదప
చతుర వాక్కంచుక - జన సహస్రంబు
అగురు గందపుఁజెక్క - లాణి ముత్తెములు
పాండ్య భూపతి పంపు - పగుదుల తోడ
ప్రాయసకాండ్రు భూ - పాలుని ముద్ర
గల శ్రీముఖమ్ము వా - రల కిచ్చియంపి
తెచ్చినయవి భూప - తతిఁజూపి చెప్ప
సామంత నృపతులు - శ్రీమంతుఁడైన
తమ పతి మేలిమి - తవిలి నుతింప
నవనీశ్వరుఁడు పాడి - యను చోటు వదలి
శాతకర్ణు లమర్చు - సరి నావలెక్కి
వడదెసగట్టున - వారెదుర్కొనుచుఁ

దెచ్చిన యుపద లా - తిథ్యముల్గొనుచు ౧౭౫
వారి యెల్లలుదాఁటి - వారిధి కంచె
గా నొప్పగను నప్ప - గఱ నాటఁజొచ్చి
యొకచోట విడిసి - తానుండిన యంత
చిత్రుఁడుత్తరుఁడు వి - చిత్రుఁడు సింహుఁ
డును భైరవుఁడు శ్వేతుఁ - డును తనుత్రుండు ౧౮౦
రుద్రుఁడు నను రాడ్వ - రులు కొందఱొక్క
యెడఁ జేరి ద్రవిడుల - యిద్ధ తేజంబు
గనుఁగొందమని యెంచి - కనక విజయులఁ
గలిసి మైత్రి యొనర్చి - కలన నెదుర్ప
వెదకుచు నోరెంబు - వేఁటాడవచ్చు ౧౮౫
సింగమ్ము గజ యూథ - ముం గని వేడ్క
యతిశయింప దుముకు - నట్లరిసేన
లోనికి దుమికి ని - ల్వున సూర్యకాంతి
నరికట్టు డాళ్ల పం - దిరి లోన భేరి
శంఖ కాహళ మురజ - ధ్వనులెసఁగ ౧౯౦
బల్లెంపు వీరులు - విల్లు వీరులును
కత్తి కేడెమ్ములు - గల వీర వరులు
దాంతికుల్ రథికులు - తౌరంగికులును
కలయంగఁ దిరుగ లో - కము కనుల్మూసి
కరి ఘటా ఘంటలఁ - గల నాలుకలను ౧౯౫
పడగ కంబాలఁ గ - ట్టెడి గగ్గిరెట్ల

నాల్కలు మణులు క్ర-న్ననఁ గదలుటలు
మాని నిశ్చలములై - మౌనమ్ము దాల్చ
తెఱఁగున దవధూళి - నెరసె దట్టముగఁ
దొలిసేన తొలిసేన - తలపడి పోర

దోర్దండములు తలల్ - తునిఁగి వేఱైన
విండ్లఁ గేలం దాల్చ - వీరుల మేని
పఱపుఁ గొండలపైఁ గ-బంధ గణమ్ము
పలకల వంటి క-న్నులు గల ప్రేత
గణము తాళమ్ముల - కనువుగ నాడె

శవములు దొరలంగఁ - జను రక్తనదుల
దలలు విరియ శాకి-నులు దూఁకులాడ
పోరు నేరుపు గల్గి - తేరుల నున్న
యుత్తర నృపుల యా-యుధ వీరవరుల
దెగటార్చి కుప్పలు - తిప్పలు చేసి

ద్విరదంబుల మెడలు - తేరి మొగ్గలును
కుదిరల వీఁపులు - చరియంగఁ గూల్చి
మహిష సాది ముహూర్త - మాత్రంబులో
బ్రాణుల బ్రమింగి గ-ట్టినఁ బ్రేఁపఁగలఁడు
అనెడి పెద్దల పల్కు - లర్థమౌనట్లు
రణ రంగమున నొత్త-రాహ వీరులను
పొడిచి గుదులు గ్రుచ్చి - పుడమిపైఁ ద్రో
చేర భూపాలుండు - చేపట్టె జయము

నాల్కు నడంచుకొ-నఁగ లేక వదరు
కనకుండు విజయుండు - కదనరంగమునఁ ౨౨౦

గొందరు రథికులఁ - గూడి కుట్టువుని
రగులు కినుక వలఁ - దగులువడంగ
జడలు దాలిచి బూది - యొడల ధరించి
కావి వలువఁ జుట్టి - కర్మందుల వలెఁ
మసకత్తి ధరించి - మద్దెలఁ దాల్చి ౨౨౫
యాటగాండ్ర కరణి - నదనునఁ దోఁచు
వేసాలు నేర్చిన - విద్దెకుఁ దగిన
వాలకంబుల నూని - వచ్చిన త్రోవ
గన కిచ్చ వచ్చిన - గండ్లలోఁ దూఱి
పోయిన పోకగాఁ - బోయె సైన్యములు ౨౩౦
దాంతికుల్ వడఁకంగ - దంతి చయంబు
నఱ్ఱుల వలె దామె-నలు గట్టి కత్తి
కోలగా నేల్బడి - యాలంబు విడిచి
యడిదమ్ము మడకఁ బెం-పారఁ జేపట్టి
చెంగుట్టువుఁడను కృ-షికుఁ డని కలన ౨౩౫
నుఱిచి చేసిన పంట - తెఱఁగుగాఁ బొగడి
కేలెత్తి మొగమెత్తి - కృష్ణుండు కంధి
కడుపును కలఁచిన - కదన రంగమును
కడలి కంచియ లంకఁ-గలిగిన పోరు
పార్థసారథి యయి - పాలించుకలను ౨౪౦

కలిపి పాడుచుఁ [1] బూర్వ - కదన జయంబు
తరువాతి విజయంబు - నిరువొందఁ బాడి
ప్రేతభూతము లాడు - విజయ రంగమున
ముకుటంబు దాల్చిన - మొగమను ప్రొయ్యి
గజము శిరంబను - కడవలో బాహు ౨౪౫
వను గంటెతో నంజు - డను వంటకంబు
వండిన ప్రేతమన్ - వంటరి మంచి
విందు వెట్టఁగఁ దిని - వెసఁ ద్రేఁచుచుండు
భూత గణమ్ములు - ప్రేత తండములు
శాకినీ చయము పి-శాచ బృందంబు ౨౫౦
ఢాకినీ వితతియు - నాకంఠముగను
విందు పెట్టిన రాజ - విజయంబు పలుపొ
గంబులఁ బొగడి యా-కల్పంబు మనుత
మనుచు దీవింపఁగా - నని మాని చేర
విభుఁ డుత్తరపు మేటి - విప్రుల జీవి ౨౫౫
తములఁ గాతురు గాతఁ - దవిలిన భక్తి
నని తన దూతల - కానతి చేసి
విల్లవన్ కోదయన్ - ప్రెగ్గడతోడఁ
బోర గెలుపుగొన్న - వీర సైన్యంబు

---

1. పూర్వ కదన జయము (మున్ తేర్ కురవై) తేరుముందర భూతప్రేతా
ు చేయు నర్తనము. గెలుపొందిన వీరులుచేయు నృత్యము. తరువాతి
యము లేక ఉత్తర కదన విజయము — (పిన్ తేర్ కురవై) తేరువెనుకనాడుట.

నడపి బంగరు కొమ్మ - లడరిన మంచు ౨౬౦
మలయందు తన మది - మన్నించు పత్ని
దేవతా ప్రతిమను - దీర్పంగ వలయు
పని కొక్క పెను కల్లు-కొనెఁ జేర రాజు.

---

## ౨౭. జల స్థాపనము

పంజ॥ కొలుచు వారలకు ని-చ్చట దివ్యసుఖము
లొసఁగు పత్నిదేవి - కొక్క విగ్రహము
చెక్కించి సంగరో-చిత వేషమునన
తనకు నగ్గంబైన - కనక విజయుల
తలలపై నెక్కించి - ద్రవిడుల శక్తి
చదురు లెఱుంగక - యెదురు వారలకు
లయకాల మృత్యువే - నయమనిపించు
తీరునఁ జేసిన - పోరుల యందు
[1] పదునెనిమిది సంఖ్య - పరఁగిన యేండ్లు
నెలలు దినమ్ములు - గలిగిన పోరు ౧
గడియలలో నయ్యెఁ - గద యని జనులు
గణుతింపఁ బ్రణుతింపఁ - గదనమ్ము జరపు

---

1. దేవాసుర యుద్ధము ౧౮ ఏండ్లు. రామరావణ రణము ౧౮ నెలల కౌరవపాండవ సమరము ౧౮ దినములు. చెంగుట్టువుని సంగ్రామము ౧ గడియలు.

చెంగుట్టువుఁడు తన - సేనలతోడ
దివిక గంగానదీ - తీరమ్ము చేరి
దివిజ వంద్యయగు ప-త్నీదేవతాఖ్య
విగ్రహమును భ_క్తి - విధి విధానమున
జలమున నుంచె న-చ్చటి రాజవరులు
మందిరమును మణి - మండపములును
తల్ప గృహమ్మును - తలిరుపందిరియుఁ
గొలఁకు నడుమఁ గల - యలరుల తోఁట
తీరగు జైత్ర జా-తీయ రంగములు
వలసిన యనుకూల - ములతో నొనర్ప
రాజరాజగు చేర-రాజు దక్షిణపు
దరిఁ దన సేనతో - దయివాఱ విడిసె
ప్రతి భట గర్వంబు - పరియలు చేసి
రంభా తిలో_త్తమా - సంభోగ కాంక్షఁ
జన్నవారు రిపులఁ - జక్కులు చేసి
యవయమ్ములు వేఱు-లై చక్షువులకుఁ
గరుణ పుట్టింపంగ - దొరలిన వారు
తమ జీవితము వెల - కమరంగ నిచ్చు
వీరులలో రణ-ధారణి యందు
సాయుధ సమరమ్ము - చదురుతోఁ జేసి
ముగిసిన వారును - మొగిసి శాకినులు
వేడ్క నాడఁగఁ దోడి - వీరులు పొగడ

చేతి కత్తులతోడ - క్షితిఁ బడ్డవారు ౩౫
పతులు చావఁగ సతుల్ - సుతులు వెంటాడ
సహగమించిన వారు - సరి భటుల్ చావ
వారి హారంబులు - వడిఁ గొను వారు
తేరులతోఁ దేరి - వీరులు చదియ
మేన నెత్రూను జె-ట్టాన జెట్టులును ౪౦
మణికిరీటము తల - మరణ దేవతయుఁ
గరుణమంద నఱకి - కనువారు జయము
మురియలై మఱువు తొ-మ్మన గాయమందు
వారలు నంగముల్ - భంగమ్ము లైన
వారలు నొచ్చిన-వారలు బాధ ౪౫
పడు వారలును మృత - బంధులు రండు
రండని పిలిచి తో-రంపు బంగారు
బాగి పూసరముల - బహుమతు లొసఁగి
పెనుప్రొద్దు నిలిచి - తద్విజయ గీతముల
వంది మాగధ జనుల్ - ప్రస్తుతి సేయఁ ౫౦
జేర భూపాలుం డ-పార మోదమ్ము
గొనియుండ, మాడలుఁ - డను విప్రవరుఁడు
వచ్చి దర్శించి దీ-వన చేసి దేవ !
మాధవి పాడిన - మాధవ సమయ
వన గీతి మహిమ మీ - కనక విజయుల ౫౫
తలల నొప్పించె నీ - పౌలమున ననుడు

నిటఁ గల శాత్రవు - లెఱుఁగని గేలి
పలుకు లాడితివి త - ద్వాక్యార్థ మేమి
వివరింపు మని పృథి-వీ విభుం డడుగ
మాడలుఁ డిట్లను - మానవనాథ !
చల్లని వనమున - జలధి తీరమున
నీరాడునెడ వేడ్క-మీఱఁ గోవలుఁడు
వినఁగ మాధవి యాల-పించిన జాన
పద గేయముల విని - గొొదగొని పూర్వ
కర్మ ఫలములు త-క్కక వచ్చు వేళ
యాసన్న మగుట న - య్యమ వీఁడి యతఁడు
సతితోడ మధురకుఁ - జాగి యచ్చోట
నరపతి దివి కేగ - మరణ దండనము
పొొందిన కోవలు - పొలఁతి నీ నాడు
చేరి యుదీచి దే-శీ యార్య విభుల
తలల సీసకముల - తలదన్ని యెక్క
రాజ ! నే వచ్చు కా-రణ మిఁక వినుము
మలయంబు వలగొని - మరలి కుమారి
నీరాడి తలవ్రాలొ ? - తీరని తలఁపొ ?
మధుర కేఁగితి నట - మన్నీల మిన్నఁ
గన్నగి యందెచేఁ - గడ తేర్చెనన్న
తద్వార్త వింటి మా-దరి నన్నుఁ గాంచి
కావలుఁడగు దోషి - కాఁడు కోవలుఁడు

ప్రభుఁడె యీ దొసఁగు ప-రాకునఁ జేసె
గొల్లత నాకడ - నిల్లడ యైన ౮౦
లేమను గావంగ-లేక వీడితిని
ప్రభుని పాలనము ధ-ర్మచ్యుతి నందె
నని యామె యా రేయి - నగ్గిని మునిఁగి
స్వర్గమ్ము చేరెఁ ద-పస్విని కౌంతి
కోపంబు పాండ్య క్రుం-గుడుతోడ నడఁగ ౮౫
నీ యిరువుర పూర్వ-కృత కర్మఫలము
నాతోడఁ దెచ్చి యీ - నాట ఫలింపఁ
జేసెనే యని చాల - చింత భజించి
ప్రాయోపవేశానఁ - బ్రాణము లీడె
పాండ్యుని మధురకుఁ - బరఁగిన చెడుగు ౯౦
కొఱఁత లేక సమస్త - మెఱిఁగి స్వస్థలికి
మరలి పుగాఱు నా-గరులకుఁ దెలుపఁ
గోడలికిని కొడు-కునకు నేర్పడిన
దుస్థ్సితి విని తండ్రి - దుఃఖించి నాఁడె
తన సంపదల నెల్ల- దానమ్ము చేసి ౯౫
[1] యింద్ర విహారమ్ము - లేడింటఁ జొచ్చి
యచ్చట ఖేచరు - లరయ మున్నూఱు
మంది శరీర సం-బంధంబు వదలు
సంబరముం గని - సన్యాసి యయ్యె

---

1. ఆయూర బుద్ధచైత్యమున నింద్రునిచే నిర్మింపఁబడిన రంగము లేడు.

సుత సతీ చింతతోఁ - బతి చింతఁదవుల
నోర్వ కాతని పత్ని - యుసుఱులఁ బాసె
కన్నగితండ్రి మ-స్కరివేష మూని
శీలసంయుతుల [1] యా - శీవకు లెదుటఁ
బుణ్య దానమ్ములు - పొనరించి యెల్లఁ
ద్యజియించి తాను స-న్న్యాసంబు గొనియె
ఆతని పత్నియు - నవియెల్ల విన్న
యంత జీవితమునే - త్యజియించె నింత
విన్న మాధవి యేసు - విమలమౌ సుగతి
నొందఁ గాంక్షించితి - సుర్విని పెక్కు
కడగండ్ల కిమ్మగు - గాణిక్యవృత్తిఁ
దవులనీయక సుతఁ - దలగింపు మనుచు
దల్లి కారఁగఁ దెల్పి - తన తొడవులను
తలఁగి యంతటఁ బుణ్య - దానముల్ చేసి
సన్న్యసించినది యీ - చందాన నేను
తెలిపిన వార్తచేఁ - దివిరి చచ్చుటయు
సన్న్యసించుటయును - జాలి పుట్టింప
గంగా జలముల ము-నుంగ వచ్చితిని
నీకు శుభమ్మగు - నృపచంద్ర ! యనుడుఁ
బాండ్యుండు మరణించు - పదపడి యతని
వీట నెయ్యవి సంభ-వించెఁ దెల్పుమన

1. శ్రమణుల యాచారములలో నొకటి ఆశీవకము.

## ౨౩. జల స్థాపనము

మాడలుఁ దనియె నీ - మఱఁదియౌ చోళు
తోడఁ జేరక యీర్ష్యఁ - దొమ్మండ్రు దాయ
లతని యాజ్ఞ గొనక - వ్యతిరేకు లగుడుఁ
దొమ్మండ్ర నొకపూటఁ - ద్రొక్కి దొమ్మాడు
చేసి యాతనిఁ దోలి - స్థితి నిల్పు శూర !
పళయఁడన్ మోకూరి - ప్రభుఁడు కాపాడు
వేము వేళ్ళం ద్రుంచు - భీకర శౌర్య !
కొర్కలో నుండిన - యర్కతేజుండు
చెళియందు నూర్వురఁ - జిన్నరుల నొక
పగటఁ గన్నగికినై - బలిగా నొసంగి
మధుర యరాజక - మహియయి కలఁత
చెందు కాలమున ద-క్షిణ సుప్రసిద్ధ
సింహాసనమ్ముఁ బ్రా-చీ దిక్కుధరము
పయిఁ దోఁచు బాల ప్ర-భాకరుఁ బోలెఁ
జంద్ర వంశమ్మున - జన్మించి నతఁడ
యధిరోహణము చేసె - నవనీ జనమ్ము
పెక్కు కల్పంబు లీ - పృథివి నేలుమని
పొగడి దీవించిరి - భూపాల తిలక !
యనిన మాడలుని వా-క్యము లాలకించి
చేర భూవరుఁడు యో-చించుచున్నంత
దమము లోకమ్ములఁ - దమి మ్రింగ విడిచి
భానుండు గ్రుంకెను - బాలేందురేఖ

సంజ కాంతుల మించు - చదలఁ గన్పడియె
భూపాలుఁ డది గని - మోదించు చుండ
జ్యోతిష్కుఁ డొకఁడు రా-జును గాంచి వినతి ౧౫౭
దేవరవారలు - దేశంబు విడిచి
వెడలి ముప్పదిరెండు - నెలలయ్యె ననుడు
పిన్నవి పెద్దవి - వెలుపి వెత్తువియు
నగు చాల శిబిరంబు - లమరిన వాడఁ
జని శిల్పనైపుణిఁ - జను వితానంబు ౧౫౮
నమరుచుఁ బెను గుడా-రముఁ జేరి చేర
రాజలంకృత శయ్య - రాజిల నుండి
మాడలుఁ బిలిపించి - మఱి యిట్లు లడిగెఁ
దొమ్మండ్రు దాయలు - దోరిన యవల
రాజపాలన మొక - రట్టు లేకున్నె ? ౧౫౯
యనుడు మాడలుఁ డిట్టు - లనియె భూపాల!
స్వర్వాసు లాశ్చర్య - చకితు లౌనట్లు
మూడు కోటలు నాశముం జే-యు జయము
పావురా కష్టంబు - వదలంగ డేగ
యాఁకలి దీఱ దే-హము గోసి యిచ్చు ౧౬౦
శిబి చక్రవర్తి యం-చిత పాలనమ్ము
గుఱి తప్పి దారెడి - నెఱియును గలదె ?
ధరయెల్లఁ గఱపుచే - వరటినయేని
కావేరి పంటలు - గల చోళ పతికి

నతని ప్రజకుఁ గష్ట - మావంత లేదు ౧౬౫
మది నమ్ముమా యని - మాడలుఁ దనుడు
నతని కేఁబది తులా-లగు పైఁడి యొసఁగి
యార్య రాజ శతంబు - నరసి మీ దేశ
ముల కీడు పొందని - సెలవిచ్చి యనిపి
తపసులై ప్రాణముల్ - దక్కించుకొన్న ౧౭౦
రాకుమారులతోడ - రాణ చెన్నారు
నెఱ్ఱని మోవియుఁ - గఱ్ఱి వేనలియు
వాలు గన్నులు లేఁత - వట్రువ చనులు
మొల్లలఁ బోలిన - తెల్లని పండ్లు
వలుఁద పిఱుందులు - తలిరు మైచాయ ౧౭౫
లే వెదురనఁ దగు - లీల బాహువులు
మెఱుపు వంటి నడుము - చిఱుత పాదములు
గలిగి వెలయు నాట-కత్తెల తోడ
నెట్టి రాజులనైన - నెదిరించి నిలుచు
దోర్దండయుతులగు - దూతలతోడ ౧౮౦
ద్రవిడ రాజుల పరా-క్రమ మొకయింత
యెఱుఁగక యెదిరించి - విఱిగిన కనక
విజయులఁ జోళాది - విభులకుఁ జూపు
వేడ్కతోఁ బంపి రా-డ్వైబుధేశ్వరుండు
మందాకినిం గల - పొందమ్మి పూల ౧౮౫
యందు మరంద మా-నందానఁ ద్రావి

యిందిందిరములు మే - ల్బొందానఁ బాడ
బాల భానుఁడు తన - ప్రభలను పరపి
తూరుపు గొండపైఁ - దోఁచిన యంతఁ
బడమటి దెస నేలు - పార్థివేశ్వరుఁడు
ఉత్తర దిశఁ గల - యొడయండ్ర గెలిచి
దక్షిణదిశ కేగఁ - దలఁచి యారేయి
ధనసంచయమ్ముతోఁ - దనరిన నగరఁ
బెద్ద కూటంబుతోఁ - బెరిఁగి యర్యముని
పోక నాఁపిన మేడ - ముత్యాల జాల
రులు ప్రేలు మేల్కట్టు - వెలయఁ బ్రక్కలకుఁ
బరుగిడు కాంతితోఁ - బరఁగు వజ్రముల
నడుమ మానికములు - నయమునఁ బొదుగు
బంగారు తగటి కా - ళ్ళంగార నొప్పు
సకినల మంచాన - సరి పుంజు తోడఁ
బెనఁగిన హంసి మై - విదురుప రాలు.
నీఁకలతోఁ గూర్చి - యేర్చిన సెజ్జ
పై నిద్ర విడిచి య - వ్వలి బయల్వెడలి
యుత్తర దిశఁ గల - యొప్పని వారి
నోడించె నీ భర్త - యోడకు మింక
మరలువాఁడను నర్థ - గరిమ గలట్టి
పాటలు దాదులు - పాడుచుండంగ
సేవలు సేయు దా - సీ జనములును

గుజ్జులు గూనులు - కువలయాధిపుఁడు
వచ్చె వన్నెలు గొమ్మ - మెచ్చగ ననఁగ ౨౧౦
వెదురు కల్లానిన - వేఁట కాఁడూని
వడిసెలతోఁ గాఁపు - వదలుట కతనఁ
గొఱ్ఱుఁదినఁగ వచ్చు - గొప్ప యేనుంగు
లలసి నిద్రింప వి - రులు బాగి తుమ్మి
సరు లుత్తరపు దెసఁ - జెరివిన గజము ౨౧౫
వచ్చు త్రోవఁ జనుము - పదమని రాజ
విజయ మసంపూర్ణ - విధ రాగములను
చేర్చి బోయతలు మం - చెలఁ బాడుచుండ
ఉత్తర రాజుల - యురు దుర్గ వితతి
చదును చేయించి య - చ్చటి గాడిదలను ౨౨౦
గట్టిన మడకతోఁ - గలియ నారుకలు
చల్లిన పైదెస - జనపతి వచ్చె
విమతుల సంకెలల్ - విడిపించునట్టి
ప్రభు జన్మదినము శు - భంకర దినము
కావున వృషభమా ! - నీవును కాఁడి ౨౨౫
మోచి దున్నుట వీడి - మురియుదు గాక
రేఁపని కాఁపులు - రేఁగి పాడంగ,
అల పెద్దయేట నీ - రాడు వారిడిన
పూలు కుంకుమ గంద - వోడి వడఁ బరవి
యింద్ర ధనుస్సుల - యెసకాన నలరు ౨౩౦

రేవుల కడ విరి - రేకుల కలువ
విరుల సరులు వేడ్కఁ - జెరివిన సిగలఁ
దమ్మి పూమొగ్గల - నిమ్ముగాఁజెక్కి
పులుఁగుల లలిని పూ - వులు విలసిల్లు
మొగిలి కొమ్మలమీఁద - సొగసుగా నిలిచి
ప్రభు నాలమంద నీ - ర్దారివుచు నుండ
గోపులు పిల్లనఁ - గ్రోవిఁ బాడంగ,
శరధి తీరమ్మున - సుర పొన్న నీడ
వలమురి సంకు పు - ర్వాల ముత్తియములఁ
గొని కలకల నాడు - కొమిరెలు కేలు
పై కెత్తి చేర భూ - పాలుండు చేరె
వినుఁడు రండాతని - విజయమ్ముఁగూర్చి
పాడుద మని చేరి - పాటలు పాడ,
నిద్దుర లేక వి - నిన రాజపత్ని
క్రాఁగుచు నుండ శం - ఖమ్ములు విజయ
సూచకముగ మ్రోఁగ - సురుచిర లీలఁ
బట్టంపు టేనుంగు - పై గొడ్గుక్రిందఁ
బ్రజ యెదుర్కొన మహీ - పతి ప్రవేశించె.

## ౨౮. విగ్రహ ప్రతిష్ఠ

మంజ॥ బంగారు జలతారు - పని నేర్పుగలది
నెలను పోలునది వె - న్నెలలు పర్వునది
యగు పెద్ద గొడుగు చా - యను భూతలమ్ము
శాంతి నొందఁగ వీర - శాత్రవ భయద
ఖడ్గంబు కెంగేలఁ - గైకొన్న విభుని
వంజి నగరమున - వనితా వితాన
మలరులు చల్లి ది - వ్వెల నెత్తికొన్న
వెలఁదులు ప్రభునకు - విజయమ్ము పలికి
పలువురు పద పద్మ-ముల వ్రాలుచుండ
నరుదెంచు నాఁటి సా - యం వేళయందు
పుడమీశు సమరంబు - పూర్తి గావించి
వెన్నంటు సాయుధ - వీర రత్నములు
కొమ్ము ఏనుఁగు పూని - క్రుమ్మిన ఱొమ్ము
బల్లెముల్ పెను గాయ - పఱచిన ఱొమ్ము
మాఱుతు కఱకమ్ము - తూఱిన ఱొమ్ము
వా లడిదమ్ముచేఁ - జీలిన ఱొమ్ము
నతివల ఱొమ్మున - నడఁగక క్రుమ్ము
కొని వచ్చు చన్నుల - మొన నులివెచ్చ
కాఁపడమ్ముగొని, య - గలు పొగగూడి
విరిసిన కరులను - గురు మేఘ మందు

తోఁచిన ముఖమును - తోయజవైరి
యందు బొమ్మల వింటి - క్రిందఁ జెన్నార
వలకాని యలరు ట - మ్ములఁ బాఱఁదోలి
కడ చూపులను దూత - యెడ సంజవేళ
మందయ్యెనని పీర - మాస్యులు పొగడ
చెన్నైన మొగము లే - వెన్నెలల్ పరప
గండుమీలు పొరలు - కైవడిఁదోఁచు
పొలుపుతోఁడను మొల్ల - మొగ్గలపంటి
ముందఱి పండ్లల్ప - ముగఁ దోఁచునగవు
మావి చివురుఁబోండ్లు - మడఁతుల వలన
యువకుల కొదవి, బొ - ట్టుంచు మొగము
నెఱి లొందు కురుల య - న్నెఱి గాంచు
మురువు గుల్కుచు నున్న - ముకుర ముం
వీణగైకొని యందు - వివిధ గీతికల
కనుకూలముగను ష - డ్జాది సప్త స్వ
రముల శ్రుతులు గాఁగ - రమణఁగావించి
పాడెడి మగువల - వలనఁ భర్తలకు
నిదుర పుచ్చంగఁ బె - న్పొందు గావించి
ప్రథిత రాజన్య శి - రస్తటీ మకుట
నీరాజిత పదుండు - చేర భూవిభుఁడు
జనులఁ బాలింప నా - తని మోము వోలె
జనములు వినుతింప - జనియించు చంద్రు

నెల్ల వారికిఁ జూపి - యిరులు తాఁ దొలఁగ
తరుణులౌ నెల్లరు - తన వెన్క నిలిచి
తనయాజ్ఞ నడవంగ - దర్పకుఁడెలమి ౪౫
జనపతియై యొప్పఁ - జంద్ర శాలలను
పూల పానుపులను - పూల పందిళ్ల
సకినల మంచాల - సౌరు వేదికల
విధుఁడు వెన్నెలలను - విరివిగాఁ బరప
మేదినీ మధ్యంబు - మేరువువోలె ౫౦
ధ్వజ పటాలంకృతుల్ - తనరు పురమ్ము
నడుమ నున్నతి గొని - యడరు బంగారు
మేడలో మణులచేఁ - బోఁడిమి మీఱు
చంద్రశాలను రాజ - చంద్రుని దేవి
[1] వేణమ్మ వెన్నెల - వేడ్క మోదింప ౫౫
నాశీస్సు లిడుచు ముత్తైదువల్ పట్టు
దివ్వియ లొకవంక - దీప్తులు గులుక
వీణా మృదంగ ని - క్వాణముల్ సెలఁగ
వింపు పండిన పాట - లెనయ నొక్కటను
కస్తూరి గందమ్ము - కలపమ్ము గొనుచు ౬౦
గుజ్జులు గూను లొ - క్కొట నిలఁబడఁగ
వ్రాయు వన్నియలు చూ - ర్ణములు పూసరులు
పేడి వాండ్రొక పంక - వే పట్టి నిలువ

1. వేణ్మాల్ అనుపద మిట్లు మార్పఁబడినది.

వలచిన కమ్మని - వాసన లగురు
ధూప పాత్రమ్ములు - తొయ్యలుల్ గొనుచు ౬౫

నంచ తెక్కల పాన్పు - నటు చుట్టి నిలువ
వలువ లద్దము తొడ - వులు చేతఁబట్టి
చేటిక లొక ప్రక్క - చేరి కై సేయఁ
జనుదెంచు రాణితో - మణిమయ చంద్ర
శాలఁ జెంగుట్టుండు - లీలతో నమరి ౭౦

లక్ష్మీకరములగు - లలిత పాదముల
నందియల్ మొరయఁ జే - యందలి ఢక్క
ఢమఢమ ధ్వనిసేయ - డాల్వాలు కనులు
వేయి తలంపుల - వెలి సేయుచుండఁ
గావి జడలు కడ - తావుల నొలయ ౭౫

కదల కందెలు చేతి - గాజులు రశన
మెదలక స్తనములు - కుదులక కుండ
లమ్ము లూఁగక వినీ - లపువేణి విరియ
కార్య యెడమప్రక్క - నలయక యుండ
రుద్రుండు సలిపిన - భద్ర తాండవము, ౮౦

విప్రులుండెడి యూర - వెలసిన యాట
[1] శాక్యుండు సలిపి రా - జన్యు దీవించి
వెడలిన పిదప నీ - లుఁడు మొదలైన
కంచుకుల్ మాడలుఁ - గై కొని వచ్చి
దౌవారికులచేతఁ - దమవార్త నంపి ౮౫

1. కూత్తచాక్కైయర్.

వారితోఁజని రాజ - పరునకు మ్రొక్కి
చోళుని పురిఁజేరి - సొంపారు వజ్ర
వరపురి పందిర - వంతి తోరణపు
దోరంబు మగధ యం - దునఁబట్టి మండ
పముగల తన మండ - పమునఁ గొల్వున్న ౯౦
తటి బంధితులగు ను - త్తర నరవరుల
తోఁ బరివారమ్ము - త్రోవఁ జూపంగఁ
జని చోళభూమి పా - లునకుఁ గేల్మోడ్చి
యంగ బలంబుతో - రంగంబు చొచ్చి
గొడుగు ఖడ్గంబు పోఁ - గొట్టుకొన్నవలఁ ౯౫
జంపంగరాని వే - సమున జీవములఁ
గాచుకోఁ దలఁచిన - కదన భీరుకుల
వెంటాడి పట్టుట - విజయలక్షణము
కాదని చోళ భూ - కాంతుండు తెలిపె
అట నుండి పాండ్యేశు - నరయఁగా నతఁడు ౧౦౦
వడదెస యొడయంద్ర - బవరానఁ గొన్న
గొడుగుకాడ జయంతు - కోలగా నచటఁ
బట్టంపు టేనుంగు - పై గొడ్గునుండి
కాన్పించి, హిమవచ్చి - ఖర భూమినున్న
'కుయిలాలువ' మ్మను - కొమరైనచోట ౧౦౫
వెలసిన శ్రీ శాంభ - వీ మహేశ్వరుల
మనసారఁ జుట్టి వం - దనము చేసియును

బవరాన నోడి తా - పసి వేషమూని
మఱిఁగి చరించు న - మ్మానవేశ్వరుల
మీఁదఁ గినుక చూపు - మేదినీ విభుని
విజయంబు మిక్కిలి - వింతయైయుండె
నని పల్కెనని నీలుఁ - డనఁగ భూవిభుని
జాజు కన్నులు మఱి - జాజు వాఱంగ
నరసి బహుశ్రుతుఁ - డగు మాడలుండు
లేచి యిట్లను రాజ - లేఖేంద్ర ! కినుక
శమియించుఁగాక శాం - తముతోడ వినుము
మిరియాలు పండెడి - ధరణీధ్ర మందు
నిద్రించు దంతులు - నెలకొనియుండు
వియలూరి భంజించి - విజయమ్ము గొనిన
పిమ్మటఁ జోళులఁ - దొమ్మండుగురను
'నేరివాయి' లనెడి - నెలవున గెలిచి
యా మీఁదట 'ఇడుంబి' - లను గ్రామ మందు
విడిసి సేనలతోడఁ - బడవలనేగి
వడదెస యొడయంద్ర - స్వర్ణదీ తీర
మందు గెల్చితి రాట్బ్ర - రందర ! నీవు
నిత్య విషయముల - నియతాత్మలకడ
నరసిన నీకిన్క - యడఁగారుఁగాక !
మీతాల్మి జీవిత - మీతఱి పెద్ద
యేటి యిసుక కంటె - నెక్కువౌఁగాక

సార్వభౌమ సుఖింపు - శాంతింపు మాలి ౧౩౦
గొనక నా పలుకులఁ - గొని విన వలతు
లోక రక్షణ కృతి - మేకొన్న మీరు
మీ యేఁడు లేఁబది - మీఱు పిమ్మటను
ధర్మశాస్త్ర విదితా - ధ్వరము లొనర్ప
కాహవ క్రతువులే - యాసించుచుంటి ౧౩౫

క్షత్రి యోచిత ధర్మ - కర్మముల్ కొఱఁత
పొందక చేయు నీ - పూర్వులలోన
పగఱ కడిమి ప్రాను - పడఁగొట్టువాఁడు
చలిమలఁ డెక్కెంబు - నెలకొల్పు వాఁడు
ఆగమ వేది ప - ద్యావలిఁ గొనుఁచు ౧౪౦

నతని స్వర్గమ్మున - కంపిన వాఁడు
న్యాయువై జీవుల - హరియింపు మనుచు
యము నడ్డు పెట్టిన - యవనీశ్వరుండు
పరుష వాగ్యవనుల - దురమున నోర్చి
పాలించి హిమగిరి - వఱకేగు నృపుఁడు ౧౪౫

సమితి సేనల తోడ - శత్రులఁ దఱిమి
వారి కోటలఁగూల్చి - వాలిన యతఁడు
అయిర మలనువేల్పు - నర్చించి రెండు
కడలుల నీరాడు - ఘన భూభుజుండు
దివి నుండి వంజికిఁ - దెచ్చి భూతముల ౧౫౦
నిలిపి సోమ మఖంబు - నెఱవేర్చు నృపుఁడు

కీర్తి గొనిన వారుఁ - గెడసిన కతన
దేహ మస్థిరమని - తెలిసితి వయ్య !
కలిమి నిల్వని దని - కరిగాఁగఁ దమిళ
నృపుల నొడ్డారించు - కృపణులయెడలఁ
బ్రకటించితివి గద - పరువమ్ము స్థిరము
గాదను విజ్ఞాన - ఘనుల పల్కులకు
భాష్యంబు వలయునే - ప్రాజ్ఞ వరేణ్య !
నరపుతో ముదిమిని - పొరయు దేహమ్ము
నీవును గాంచితి - దేవ రూపమున
స్వర్గమ్ము చేరిన - సత్ప్రాణి మనుజ
దేహమ్ముతోడఁ బృ - థ్వికి మరలినను
మరలు, మనుజ దేహి - మఱు జన్మమందు
మృగజన్మ మెత్తిన - నెత్తంగవచ్చు
మృగదేహి యంతకు - మిగుల నీచంపు
నరకలోకంబునై - నను గనవచ్చు
జీవుండు నటకుని - కైవడి నొక్క
యురువున నెల్లప్పు - డుండంగఁ బోఁడు
స్వకృతకర్మల కను - సారి జీవమ్ము
తొలఁగుమైననుట వి - జ్ఞుల సత్యవాక్కు
నీవుపూనిన ధరా - నిపుణ పాలనము
పైపయి మహిమతో - వర్ధిల్లుఁగాత
ధనముకై యిట్లాడు - దరిజేసిగాను

గౌరవదేహమ్ము - గాంచిన ధర్మ
మాచరించిన జీవ - మంతకు మించి ౧౭౫

గురుత నొందఁగ జేయు - టురవు కాదేని
సామాన్య జనములు - చను త్రోవమేలు
స్వర్గమార్గము నీకొ - సఁగు వేదవిదుల
యాజకులుగఁగొని - రాజోచితమ్ము
లైన వేలుములు నీ - వాచరింపఁదగు ౧౮౦

జేపు ధర్మము నాచ - రింతమ యనుచుఁ
దలఁచిన నీనాఁడె - తరలంగ వచ్చు
జీవముల్ కావున - జీవిత మింత
కలదని యెఱిఁగిన - ఘనులు లోకమున
నింతకుఁ గానరా - రెచ్చటనేని ౧౮౫

నీపదములఁగొల్వ - నిఖిల భూపతులు
నీపత్నితోఁగూడి - నెగడుము కల్ప
కాలంబు దనుక సు - ఖంబుగ ననుచు
న్యాయంబు పలికిన - నాలుక యనెడి
మడకతో దున్ని స - న్మహితార్థ బీజ ౧౯౦

ముల నరపతి యెద - పొలముగాఁజేసి
చల్ల నాయర్థంబు - సాగి ఫలింప
నగు నోగిరంబు న - త్యాశ భుజింప
నాల్గువేదముల వి - న్నాణంబుతోడ
పురుషార్థములు నాల్గు - పొలుపుగాఁదెలిపి ౧౯౫

పలుకు బహుశ్రుతుల్ - పాఱులవలన
మాటలుం డాడిన - మాడ్కి వేల్పులను
శాంత్యుత్సవంబుల - జరుపఁగానెంచి
చెంగుట్టుఁడార్యుల - చెఱ విడిపించి
వంజిపురము వెలు - పలి ప్రక్కలోఁతు
జలము కంచెగఁగల - యెలదోఁటలోన
నతిథులౌ రాజుల - కై కట్టఁబడిన
మందిరమునయందు - పొందుగా నిలిపి
గొప్పయజ్ఞమ్మును - కొఱలేక చేసి
మఱునాఁడు పురిఁజేరు - మాడ్కి నేమించి
యార్యరాజులకు మ - ర్యాదలు నడప
ముఖ్యమంత్రికిఁ దెల్పి - మోదమ్ముతోడఁ
జెఱసాల లన్నిటిఁ - దెఱవుఁడు నేఁడె
కప్పముల్ వలదని - కాఁపుల పన్ను
వ్రాయు గణకులకు - వరుసగాఁ దెలిపి
బలవంతులగు రాజ - వర్యులు నీతి
నడపకయున్న వి - నతి పాత్రలైన
మెలఁతల మహిమంబు - మేల్మినొందదని
పూర్వులు తెలుపు న - పూర్వవాక్యములు
కన్నగి లోకంబు - గణుతింపఁదగిన
క్రొత్తదితనమునఁ - గొఱలినదగుట
చోళభూవరునకు - వేళమ యొసఁగి
నీతిపాలనమది - నెగడమి బ్రదుకు

పలవమి పాండ్య భూ - వరునకు నొసఁగి
రాజులు తపచేయు - ప్రతినలు పూర్తి ౨౨౦
కాక యల్పంబేని - కాఁక వీడమిని
ఉత్తరదేశ రా - జోత్తరుల్ దెలియఁ
బడమటి దెసనేలు - ప్రభునకు నొసఁగి
మధురాపురమ్ము దొ - మ్మాడు గావింపఁ
దన కోప దహనాని - స్తనము మూలమున ౨౨౫
నెఱఁగించి మన మంచి - యీనాటఁజొచ్చి
సర్జక వృక్షంబు - చల్లని నీడ
నిలిచిన మగువను - నెలఱాల మలిచి
శిల్ప శాస్త్రజ్ఞులు - చిత్రంబుగాఁగ
నమరించు పత్ని దే - వాలయమందు ౨౩౦
రాజపురోహితు - రాజదైవజ్ఞుఁ
బ్రోత్సహించుచుఁ జేర - భూపాలకుండు
అమరులు వసియించు - హిమవంతమందు
నెలకొన్న దైవమ్ము - నెమ్మిసుతించి
కన్నగి రూపమ్ము - గల శిలా ప్రతిమ ౨౩౫
యందునేరుపు గల - యందంపు నగలు
తీరుగా ధరియించి - దిగ్దేవతలను
నిలిపి నిత్యోత్సవ - నిత్యహోమముల
నిత్య దానమ్ముల - నిత్య సంతృప్తి
నెగడంగఁజేయించె - నిత్యప్రతిష్ఠ ౨౪౦
రాజ పూజనముల - రాజిల్లుచుండు
సింహ విక్రముఁడగు - చెంగుట్టువుండు.

## ౨౯. స్తుతి

వ॥ కన్యాకుమారి నుండి హిమాలయము వఱకు నేకచ
త్రాధిపత్యము చేసిన చేరలాదునకుఁ బ్రతాపసూర్యుఁడగు చోళుని
కూఁతువలనఁ గలిగిన చెంగుట్టువుండు కొంగుల జయించి గంగ
తీరమునకుఁ జని యటనుండి మరలి వంజినగరము చేరిన త
నార్యరాజు లుత్తరదేశమున నొకానొక వివాహసమయంబున నే
గ్రీవముగాఁ బరియాచకముగా దక్షిణదేశరాజులు పోరుగోరి దా
వేసి హిమవంతముపై విల్లు పులిమీను పడగలఁ బ్రతిష్ఠించిన కా
మున మమ్ముంబోలిన రాజవీరు లీ దేశమున లేరైరని వచించి
వార్త నచ్చటి తాపసజనంబులు తెలుప మానికవుఁ జక్రముం
కుఱుకోల దొరలించిన వడువున గొప్ప మంచు మల ఱాయి మం
దైవమగు నన్నవార్త తన్నుఁ బ్రేరేఁచి తరలింపఁ దరలి యార
రాజుల నోడించి వారి తలలపై హిమవంతమునఁ జెక్కించిన ఱా
విగ్రహమును మోయించి గంగాతీరమున విడిసి జలస్థాపనముచే
కోపము చల్లార్చికొని వంజికి వచ్చి దేవవినుతమైన శిలాప్రతిమన
ప్రతిష్ఠచేయించిన పదంపడి కన్నగి దేవళమున సామంతరాజుల
చెల్లించిన కప్పముల విషయము వినుచున్నవేళ, నిండుచందురు
దెగడు మొగమున వాలుగలం బోలు కన్నుల నీరుచింద ధూ
గప్పిన కురులు వీఁపున విరియ, కోవలుఁడు పూర్వకర్మఫలాన
భూతికై యొక నీచుని వలన వధింపంబడుట విని, పాండ్యుని క
కేగి తన వృత్తాంతము నివేదించిన కన్నగి కన్నీరు గాంచి రా
శ్రేష్ఠుండు పాండ్యుండు నిలువున నీఱై యసువులఁ బాసిన వైనంబ

గూడలుండు తెలుప విని మహాసార్థవాహుఁడు సన్న్యసించుటయ
యతని పత్ని మరణించుటయుఁ గాంచి యధిక దుఃఖమంది చేటియ
దాదియు దేవంతియుఁ గూడి కన్నగిం గాంతమని మధురానగరమ
చేరి, యచ్చెలి తనస్తనముచేఁ జేసిన నగర దహనంబు విని న్యా
వస్తువుం బోఁగొట్టుకొన్నందున ప్రాణములు వీడిన గొల్ల మాద
యింటికిం జని యామె కూఁతురగు తపస్వినితోడ వైఘతీరము
దరిగి కొండకొమ్మన నెక్కి కన్నగి దేవళము చేరి పత్నిదేవ
యుత్సవముచేసిన చెంగుట్టునకుఁ దమవృత్తాంతము చెప్పుచున్నారు

—: దేవంతి :—

తే॥ ద్రవిడ రాజత్రయార్చిత - ప్రథితదేవి
విబుధ హిమ వన్నగంబున - వేడ్కఁ బొడమి
గంగలో మున్గి వచ్చిన - కలికి చెలిని
చోళ నాటి పైఁడి ప్రతిమ - జోటి నేను.

—: దాది :—

తే॥ రోవెలంది మాధవి యెడ - రోఁత గొనక
వల్లభుం బాత్రము చొరని - బావులున్న
దారిఁ గొని చన్న కన్నగి - దాది నేను
మా పుగాఱు బంగారు బొమ్మ కుపమాత.

తే॥ కన్నతల్లికి నొకమాటు - కానరాక
పెంచు తల్లి నాకును సుంత - పంచు విడక
పతిని దైవముగాఁ గొని - యతనితోడఁ
జన్న బంగరు బొమ్మకు - సకిని నేను.

—: దేవంతి :—

। పాపిని నైన నేను చెడు స్వప్నఫలంబును గూర్చి పల్కుచో
నీపగిదిన్ ఘటిల్లునని యింతయుఁ గానని తప్పు నాయదే?
యీపురిఁ జంటిచేఁ జలువు నేద్రైఱ వీనులఁ బడ్డ యంతనే
యోపక తల్లి యత్త యుసుఱూడ్చుట నీవును వింటివా చెలీ! ౫

—: దాది :—

తే॥ కోవలున కొక నీచుండు - కొడిమ సేయఁ
బాండ్యరాజు ప్రాణమ్ములు - పదలుట విని
యిల్లు కొల్ల విడిచి గేహ - మేవగించి
మామ సన్న్యసించుట విన - వేమి తల్లి!
తండ్రియును సన్న్యసించుట-తలఁపవేమి?

—: దాసి :—

। పతి పడు చావు నీవు పడు బన్నము లోకము చేయు నిందలున్
వెతగొని విన్న మాధవియు వేసరి త్యాగముచేసి తన్ను దాఁ
బతితసుగాఁ దలంచి యల పాపము వోవఁగ సన్న్యసించుటల్
మితమును మీఱు చింత మణిమేఖల తాపసి యౌట వింటివే?

—: దేవంతి :—

। ననుపున నొప్పగించి చను న్యాసము గావఁగ లేని యేసు లే
మనె? యని ప్రాణముల్ విడుచు మాదరికూఁతును గాంచితే చెలీ!
అనువుగ నత్తగౌరవము నందిన యయ్యమకూఁతు నియ్యమన్
జనవునఁ గాంచితే వినుత చారు వినిర్మల కీర్తిమత్సతీ!

—: రాజు :—

తే॥ ఇయ్య దేమి ? ఇయ్యది యేమి ? - ఇయ్యదేమి ?
పసిఁడి యందెలు మేఖల - వలయములును
తార హీర హారమ్ములు - దాల్చి నట్టి
మెఱుపు తీఁగ గన్పడె మిఱు-మిట్లు గొలిపి. ౯

—: కన్నగి :—

తే॥ పాపి కాఁడు పాండ్యుఁడు కానఁ - బాక వైరి
కతిథి యయ్యె నతండు నే - నతని పుత్రి
గుహుని పర్వతమున నాడు-కొనుచు నుందు
రండు చెలులార ! నాతోడ - రండు రండు. ౧౦

—: వంజి చెలులు :—

॥ తన స్తన జాగ్నిచే మధుర దాహమొనర్చి మహీశు నందెచేఁ
గొనకొని గెల్చు కన్నగిని కోరిక మీఱ భజింత మమ్మ పాం
డ్యుని తనయన్ భజింతము మహోత్తమపుణ్యచరిత్ర క్రొత్తడిన్
మన మొనరించు భాగ్య గరిమన్ జనుదెంచిన పత్నిదేవతన్.

—: గోపికలు :—

తే॥ చేర రాట్పుత్రి యని మేము - కోరి యంటి
మామె పాండ్యభూపతి పుత్రి - ననియె మనము
మన నృపాలుని కీర్తింత - మనవరతము
వేలుపుల పుత్రి పాండ్య దీ-వించుచుండు. ౧౨

—: స్తుతి :—

ఉ॥ మునుపటి కర్మహేతువున ముప్పుల నొందిన పత్నిదేవి కా
ర్చిన తనకంటినీరు తెగఁద్రెంపఁగఁ బ్రాణము వీడు పాండ్య భూ
పుని వరకీర్తి వర్ధిలుతఁ బొంపిరి వైఘ ఫలంబు నీయఁగా
సనఘుని వంశ మీధరణి నారవి తారకమై చెలంగుతన్. ౧

తే॥ పర్వతేంద్రుండు కాంచిన - భవ్య శిలను
నృపవరుల శిరములను మో-యించి నతఁడు
పృథుల సుఖియౌత మీ పెద్ద - యేఱు నిండు
ఫల మొసఁగ రాజ వంశము - ప్రబలుఁగాక. ౧

తే॥ సుదతి కన్నగి నొసఁగిన - చోళరాజు
వరసుఖము లొందుఁ గావుతఁ - బ్రథితకీర్తి
మంత మైన కావేరి స-మంచిత ఫల
మమర వర్ధిలుఁగాతఁ బు-గాఱు సతము. ౧

తరల ॥
కడలి చేలను వజ్రికోటను గాంచు బల్లిఁదుడేఁడటే ?
పొడవు మింటఁజరించు కోటలు మూఁడుగూల్చిన చోళుఁడే
మిడియు కోటలఁగూల్చు వీరుని మేదినీశ్వర ధానియై
యడరు సంగమ పట్టనం బిలనర్థిఁబాడుదమా చెలీ !

మత్తకోకిల ॥
వేలుపుల్వినుతింపఁబావుర పిట్టకై తన దేహముఀ
బోలఁగోసి తరాజు నందిడు పుణ్యుఁడెవ్వఁడె ? కోమలీ !
జాలిగొల్పిన యావుకై తనుజాతుపై రథచక్రముఀ
దోలి ధర్మము నిల్పు చోళుఁడె తొయ్యలీ ! నుతియింతమా. ౧

త్తకోకిల ॥

దిగ్గజంబులు కన్నులార్పక దిగ్భ్రమింపఁగ రాద్వరుల్
మొగ్గతిల్ల హిమాద్రి పైఁబులిమూర్తిఁ వ్రాసె నెవండటే ?
లగ్గుగాఁ దన యాజ్ఞలోనికి లాగుచోళుఁడె జోటి ! కే
లొగ్గియాతని సంగమస్థలి నొప్పుగా వినుతింతమా. ౧౮

అందగత్తెలు మందయానలు హర్మ్యగాఁదమయిండ్లఁబెం
పొంద నచ్చనగండ్లనాడుచు నొయ్య చోళధరాధిపుం
బొందఁగోరియె పాడువారలు పూవుఁబోణిరా ! పొందుచో
సుందరంబగు సంగమస్థలి చోద్యముల్ వినుతింతమా. ౧౯

రల ॥

బంతియాట

మెఱపు వోలె జ్వలించు మేఖల మెల్ల మెల్ల జ్వలింపఁగా
మెఱుఁగు ముత్తెసరుల్ నటింపఁగ మేను కుల్కుల నొల్కఁగ
తెఱవ మేలుగ బంతి యాటలఁ దేఱి నాడుదమా చెలీ !
ఎఱిఁగి యింద్రుని హారమున్ ధరియించు జేని నుతింతమా.

త్సాహవృత్తము ॥

మెఱుపుఁ దీఁగ లుర్వికిఁ దిగి మెఱసె నన్న కైవడిన్
జరగి తిరిగి యొఱగి లేచి సరగ నిక్కి నక్కుచుం
బఱగి బంతి యాట యాడి పాండ్యవిభు నుతింతమా
సుర లొసంగు పేరు దాల్చు సొబగుని వినుతింతమా. ౨౧

త్సాహ ॥

నక్కి వచ్చి చేత నిలుచు నదియుఁ గాదు చూడుమా
నిక్కి నింగి కెగసి యంద నిలుచు నదియుఁ గాదటే
యక్క ! పాండ్య పతికి జే ! యటంచు బంతిఁ గొందమా
చొక్కి వేల్పు పేరు దాల్చు సొబగుని వినుతింతమా. ౨౨

అందియకత

ఉయ్యాలాట.

ల నిలిచి చేతు లమరఁ గూర్చి నింగికిం
యూఁగుచేకపదిని తోయజాక్షి ! పాడవే
అకు వేని కీర్తి కడఁగి పాడి యూఁగవే
సులు మిడుక నూఁగి వింటి పడగఁ బాడరే. ౨౩

యంది నూఱుమంది యారివేర మూనఁగా
ోరఁ గొఱఁత లేక యన్న మిడిన చేర భూ
ర్తిఁ బొగడి వేణి త్రాఁచువోలె వ్రేలఁగా
బాఁకు నుయ్యె లూఁగి పాడి యాడుదము చెలీ !

వన భూమి మంచు కొండ నేలు నేలికై
ల్లు మీను పులియు నడరు చిన్నె లంది తా
ర్తి తోడ మెఱయు విభుని పాడి యుయ్యెలం
నాడి నడుము లల్ల బ్రమయ నూఁగరే చెలుల్. ౨౪

దంపుడుపాట

ముత్తెములను కాంచి - బ్రమానిక్రిందఁ
రోఁకలిచే దంచు - చెలులు సంగ
చోళుని కీర్తించు - మహిమ మహిమ
పాటలే పాటలు - వసుధయందు. ౨౫

ముత్తెముల్ పగడంపు - రోఁకళులను
య దంచు మధురయందు - చంచలాక్షి
కేయూరములు ధరి-యించు పాండ్యుఁ
తి సేసిన పాటలే - పాటలగును. ౨౬

తే॥ చందనపు టోళ్ళ మౌక్తిక - బృంద మునిచి
వారణము కొమ్ముతో దంచు - వంజి చెలులు
శత్రు భీకరుఁ గడిమి వృ-క్షంబు నఱకు
బైసిఁ బ్రణుతించు పాటలే - పాట లగును. ౨౮

తే॥ చేరు పదముల మ్రొక్కని - చిన్నరాజు
లతని మన్నన లందుట - యరిది యరిది
ప్రభుని పుత్రి తేజస్విని - పత్ని వేల్పె
కౌఁగిలుఁ గల్పాంత మనియెఁ జెం-గుట్టువేని. ౨౯



## ౩౦. వరదానము

ఉ॥ పత్నివేలు పచటఁ - బ్రత్యక్షమై య
దృశ్యయౌ పిమ్మటఁ - బృథ్వీశ్వరుండు
దేవంతిఁ గాంచి యో - దేవిరో ! నీవు
మఱుఁగుచుఁ బలికిన - మణిమేఖల యను
చెలువ యెవ్వతె ? సన్న్య-సింపఁ గతమ్మ ౫
తెలియఁ బల్కుమ యన - దేవంతి యంత
పరిపాలనం బభి - వర్ధిల్లు కతనఁ
గొఱలేని కలుములఁ - గొఱలి దేశంబు
తేజరిల్లుత మని - దీవించి పిదప
మణిమేఖలలు దాల్చు - మగువలయందు ౧౦
మణిమేఖల యనెడి - మడఁతి సన్న్యాస

వృత్తాంత మీరీతి - వివరింపఁ దొడఁగె
అయిదు తెగల జడ - లల్లు ప్రాయంబు
నెఱ్ఱని కొలుకులు - నెఱ్ఱని సిరలు
చల్లని చూడ్కి వం-చనము నేర్చినవి
కాని యవ్వంచన - తా నెఱుంగనిది
పవడముల్ రెండొంటు - పడఁగ నా నడుమఁ
గోవయౌ ముత్యాల - కోవ యేర్పడియె
నెద పుట్టువులు మించి - పొదలవు తొమ్మ
విరివి యయ్యె నడుము - సురుఁగుచు స్రుక్కె
కొలఁది పిఱుందులు - బలిసె నెంతయును
పుష్టంబులై యూరు - వులు నునుపెక్కెఁ
గై సేఁత యొల్లని - కరణిఁ బాదములు
నేయి పూయు చివుళ్ళ - నెఱి దయివాఱె
నలవాటు చేయమి - నభినయ విద్య
యామెను చేర రా-దయ్యెను మఱియు
నుత్తమ కులజుల - యోజ వోనెంచి
నదియుఁ గాకుండుట - నాయమ యవ్వ
మాధవి నడుగ న - మ్మగువ పుత్రికను
పిలిచి యనంగుండు - వింటితో నలరు
టమ్ములనేలపై - నావల వైచి
నిశ్చేష్టుఁ డగునట్లు - నెఱి వేణి పీడ్చి
పుణ్య దానమ్ములు - పొసఁగంగఁ జేసి

సన్న్యాస మిప్పించె - సరగ నవ్వార్త
పురమెల్లఁ బ్రాఁక ఘూ - వరుఁడు పౌరులును ౩౫
వెల యిడరాని ని-ర్మల మణి కడలి
నడుమ జాఱవిడుచు - బడుగుల కరణిఁ
గొందల మంది ర-కుంఠిత వాక్య
లఱవణ భగవాను - లను వారు తమకు
మణిమేఖల తబిసి - తనమును గొనుట ౪౦
తెలిపిన దని మాకు - సెలవిచ్చినారు
తన యంద చందముల్ - తలిరుఁ బ్రాయమున
మానిన యది యని - నేసుఁ గుంధితిని
అను పదంపడి కురు - లలయ వీడినవి
నిడు బొమల్ ముడివడి - బెడిదంబు లయ్యెఁ ౪౫
దడఁబడు పెదవులు - మడిచి నవ్వినది
పలుకులఁ దడఁబాటు - పడినది మొగము
చెమరిచెఁ గన్నులు - జేగుఱు వాఱెఁ
జేయి పైకెత్తి పీ-చినయది కాలు
కదలించినది పల్వు - రెదవడి నిలిచి ౫౦
యెఱుఁగలేని కడింది - యెఱుక గల్గినది
ఉఱిమిన యది తల - విరిసి యార్చినది
దేవతావేశయై - దేవంతి నిలిచి
కన్నగి దేవతఁ - గాంచి పూజింప

వచ్చిన యమ్మృదు - భాషిణులందు
రత్నసెట్టి తరుణి - రాజిల్లఁ గాంచు
నమడపిల్లలు, తిర్వ - నంతఃపురమున
శ్రీవిష్ణునకు సేవ - చేసెడి వాని
చిన్నకూఁతురు వచ్చి - యున్న దిచ్చటకు
పొడవు శిఖరములు - పొడవు వెదుళ్ళు
గల కొండపైని మం-గళదేవి గుడిని
గుహుని యేనుఁగు బోలు - గొప్ప రాతిపయి
దాని వీఁపుం బోలెఁ - దనరిన చోట
నీటి దొనలు చాల - నెలకొని యుండు
నవ్వానిలోఁ దెల్ల - యావ గింజలను
పోలిన నున్నని - రాలు కింశుకపుఁ
బూలఁ బోలిన సన్న - రాలును పిండి
కలిపినట్లు పరవి - కాఱు జలంబు
గల యొక పెను దొన - గలదు తద్ద్రోణి
మునిఁగిన వారలు - పూర్వజన్మంపుఁ
దెలివితోఁ జెలఁగు వా-రలు గానఁ బత్ని
కోవెల వాకిటఁ - గొమరొందు వాఁడ !
అందలి నీరె నీ - కొంద నిచ్చితిని
ఆ యట్టిఁ గుండిక - యందలి జలము
కొనుము దాని మహిమ - మిన శశి తార

లున్నంత పర్యంత - మూరఁబోవనిది
కాన నిమ్మువ్వురు - కన్యల మీఁద
నీ నీరు చల్లి ప-రీక్షింపు మిద్ది
పాషండుఁ డను నేను - పాఱుత మీఁద
నా వేశ మందితి - నని పల్క నంత ౮౦
మన్నీడు వెఱఁగంది - మాడలు మోము
గాంచు నంత నతండు - కడు సంతసించి
రాజేంద్ర ! నీ సెబ్బ-రలు నశియింప
నిదియు వినుమ యంచు - నిట్లనుఁ దాను
మాలతి యను పాఱు - మడఁతుక యోర్తు ౮౫
సవతి బిడ్డకుఁ దన - చనుఁబాలు పిండి
త్రావింప నా పాప - దైవ వశమున
మృతి నొంద నిసుగుకై - యేడ్చి తపించి
పాషండు కడఁ జేరి - వర మొండు గోర
నంగద మానుమ - యని వాఁడు బిడ్డ ౯౦
రూపున వచ్చి త - ద్రోదన ముడిపి
'కాప్పియ కుఱ్ఱడి' పేర - నొప్పిన యూరఁ
బెరిఁగి దేవంతిని - పెండ్లాడి యెనిమి
దేండ్లు చన్న పిదప - నెన్నండుఁ జెడని
తన యౌవనంపు సౌం-దర్యంబు చూపి ౯౫
గుడికి రమ్మని యామె - విడిచి యవ్వాఁడు

మంగళ దేవతా - మందిరమ్ము కడ
నుండు పాఱుండయి - యుట్టియందున్న
కుండికఁ గాచుచు - నుండుమా యనుచు
నేగిన యా విప్రుఁ - డింతకు రాఁడు

అచ్చటి నుండి నే - నా కమండలువుఁ
గొని వచ్చితిని గానఁ - గొనకొని యిపుడు
బ్రాహ్మణికడ బైలు - పడి తదంబువులఁ
జల్లుమ యని జ్ఞాని - శాస్త్ర వాక్రుచ్చె
పార్థివ తిలక ! యీ - పడుచులమీఁదఁ
బ్రోక్షించి సత్య మె-ఱుంగుద మనుచు
భూసురుఁ డా నీరు - బ్రోక్షించు నంతఁ
బూర్వ జన్మజ్ఞత - బొడముట వలన
విరహిణి వయ్యును - వినుతించి పలుకు
విభునివర్తనమును - వెగటుగఁ బలుకు
నన్ను లెక్కింపక - నాథుని వెంట
నొంటరివై చని - యొప్పని దుఃఖ
మనుభవించితివి నేఁ - గని పెంచు బిడ్డ !
మా పెను తాపంబు - మాన్పంగ రావా !
నీవు వీడిన తఱి - నీవ దిక్కనుచు
నాతో వసించు క-న్నగి తోడ నడిమి
జామునఁ బడరాని - బాములఁ బడుచుఁ

బరదేశ మేగుట - వలన నా యెడఁద
పరితపించెడి నీవు - పడసిన యిడుమ
లేను సయిఁపఁ జాలఁ - గాన నా కూన ! ౧౨౦

నా చిన్ని కోవల - నా యన్న రార !
వైకయి నుండి ని-వర్తిల్లు నేను
నగరి పిల్లల నుండి - వెగటు వార్త విని
యింటి కేగితిని ని-న్నీక్షింప నైతి
నాతల్లి! నాబిడ్డ ! - ననుఁ గానరావె ౧౨౫

ఎచట దాఁగితివో నా - కెఱుఁగంగ రావె
పిలిచి పిలిచి యిట్లు - విలపించి వెగచి
చింతించి యేఁకరి - చెంగుట్టు నెదుట
ముద్దు పల్కులు గల - ముగుద లాలయము
నెదుట నిలిచి యెలుఁ - గెత్తి యేడ్వంగ ౧౩౦

మాడలు మొగమును - మన్నీఁడు కాంచ
నతని భావ మెఱింగి - యాతఁ డిట్లనియె
తనయొద్ద దానమ్ము - గొనవచ్చు పాఱుఁ
డొందిన యాపద - డింద మదేభ
శుండంబు పిఱుఁదను - చొచ్చి తదీయ ౧౩౫

మద మడఁగించి య-మరరూపమందు
కోవలు భార్యయా- కోమలిపైని
అనురాగ మందు వా-రగుట స్వర్గమ్మ

చేర నౌ పుణ్యంబు - చేయమి కతనఁ
బత్ని వేలుపు చేరు - వంజి పురమునఁ
గన్నగిపైఁ గల - గారమ్ము కతనఁ
గోమలి తల్లియు - గోవలు తల్లి
ర_త్తనసెట్టి భా-ర్యా హృదయమ్ము
రంజింపఁ దగిన గౌ-రవముతో నొక్క-
గర్భానఁ బొడమిరి - కవల పిల్లలుగ
గొల్లత మాదరి - పెల్లగు ప్రేమ
కన్నగి యెడ నుంచు - కతన శేషాహి
తల్పుఁ గొలుచు నింటఁ - దనయమై పుట్టెఁ
గాన ధార్మికులు స్వ-ర్గమ్ము నందుటయుఁ
గరుణా మయులు ప్రేమ-గలచోఁ బొడముట
పాడిఫలమ్మను - పాపఫలమ్ము
విడువక తోడ్తోడఁ - గుడుచుచుండుటయుఁ
బుట్టినవారలు - గిట్టుచుండుటయుఁ
గిట్టినవారలు - పుట్టుచుండుటయుఁ
గాలానుసారమై - ఘటియించుచుండు
నిది క్రొత్త కా దీవు - వృషభ వాహనుని
పరమ కృపం బుట్టి - భవ్యరాజ్యంబు
వెలయఁ జేసిన పృథి-వీ పతి వగుట
వర తపః ఫలము దే-వతల రూపమ్ము

నఱచేత నున్న య-ట్లరసితి వీవు ౧౬౦
పెక్కు కల్పములు పృ-థ్వీపాలనమ్ము
గలిగి సుఖింతువు-గాక ధర్మాత్మ !
యనిన మాడలు తోడ - నవనీశుఁ డలరి
వరకవి విసుతమౌ - పాండ్యేశ ధాని
యైన మధుర కాలు-నట్లుగ నెడమ ౧౬౫
స్తన మూడ్చివైచిన - తలిరుఁ బోణియగు
పత్నిదై పంబున్న - భవ్యాలయమున
కర్చనాదికములు - హాయువుగా జపుగ
నియమించి పర్వముల్-నిత్యోత్సవములు
నెటితోడ నెఱవేఱు - తెఱఁగు గావించి ౧౭౦
దేవంతిఁగాంచి యీ - దేవాలయమునఁ
బూజాదికమ్ములఁ - బొనరింపు మనుచు
సెలవిచ్చి ముమ్మాఱు - వలగొని మ్రొక్కి
నిలుచు రాజు నెదుట - నిలిచియు యుదీచి
రాజును మాళవ-రాజును కొడగు ౧౭౫
రాజు లంకారాజు - ప్రార్థించి మేము
మాదేశములఁ జేయు - మహములు వేల్మి
తృప్తితోడ ననుగ్ర-హింపంగ వలయు
నని వేఁడఁగా వల్లె-యని యశరీరి
వినవచ్చె వినిన పృ-థ్వీపతుల్ సేన ౧౮౦

లామెకీర్తిని బహు - ప్రేమతోఁ బొగడి
స్వర్గసుఖంబందు-వారివైనమున
నానంద పరవశు-లైరి సన్మార్గుఁ
డగు మాడలునితోడ - నరిగి చేరుండు
వేలిమి సాలఁ బ్ర-వేశించు పిదప ౧౮౫
[1] నేను పత్నిగుడికి - నేగితి నచట
దేవంతిపై దేవి - యావేశ మంది
వంజినగర మండ-పమున నీ తండ్రి
కడనున్న నిను గాంచి - పుడమీశు చిన్నె
లున్న వనిన వాని - నుటిమి వీక్షించి ౧౯౦
చెంగుట్టువుని చింత - క్రుంగెడు నట్లు
కుణవాయిలను నూర - గుడిలోన నున్న
మునివరుల యెదుట - భూమి భారమ్మ
మొదలంటఁ దుడిచి యె-డఁద నంతులేని
యానంద మందు మో - క్షాధిపత్యంబు ౧౯౫
సేయు రాజ వయితి - చింతలు దీఱె
నని నా యుదంత మా-ద్యంతంబు వినుచు
స్వర్గీయ పుత్రి యా - పత్ని గుణములు
వెలయించి నట్టి య - వ్విమల వాక్యముల
స్పష్టంబుగా విన్న - సాధువర్తనులు ౨౦౦
పరులకుఁ జింతయు - బన్నముల్ నించు

---

1. ఏ తద్గ్రంథ కర్తయగు యువరాజస్వామి.

## ౩౦. వరదానము

కార్యముల్ తుటుమఱు - కరణి వీడుందు
దేవుఁడున్నాఁడని - దృఢ చిత్తులగుఁచు
ధీర విచారుల - గారవింపుండు
కల్ల జల్లుల నాడ - నుల్లమీకుండు
వెనుక నిందించుట - వెఱచి వీడుండు
పొలదిండి మదినుండి - తొలఁగ నూఁకుండు
జీవ హింసా కాంక్ష - చేరనీకుండు
దానమ్ము సేయుఁడు - తపము సేయుండు
పరులొనర్చిన మేలు - పని మఱవకుఁడు

దుష్ట సంగతులకుఁ - దొలఁగి చనుండు
కల్లసాకిరి వంక - గడఁగి పోవకుఁడు
పాటు లొందిన సత్య - వాక్కు వీడకుఁడు
ధార్మికులం జేరఁ - దలయొగ్గి చనుఁడు
అన్యాయ శీలుర - నరసి తొలఁగుఁడు

పర వనితలఁ గోర - భయముచెందుండు
లంపటందిన జీవు-లకు సాయపడుఁడు
గార్హస్థ్య ధర్మముల్ - గాపాడుకొనుఁడు
పాప కర్మమ్ములు - పఱివోవ విడుఁడు
మద్యమ్ము చౌర్యమ్ము - మదిని నీఁగుండు
కామమ్ము క్రోధమ్ము - కడముట్ట విడుఁడు
వదరుఁ బోతుల కూటు - వల వదలుండు
ధనము దేహమ్ము యౌ-వన మస్థిరములు

## అందియకత

ఆయువు పరిమితి - నటు మీఱి చనదు
రాఁదగు సవియెల్ల - రాక మానవును
మఱు జన్మమునకును - పరలోకమునకుఁ
దోడ్పడు ధర్మ గ-తుల వెదకుండు
ఎల్ల సంపదలతో - నెలరారు చుండు
మహిలోన జీవించు - మానవులార !

---

॥ కిరీటాధిపతులు చేర చోళ పాండ్యులు మువ్వురలో పడ
మటి మలనాటి నేలిన చేర కులజులు ధర్మ పౌరుష స్థైర్య
ములును వారి పురాతన నగరము మేలిమియు నందు జరుఁగు
నుత్సవ విశేషంబులును వేలుపుల రాక తత్ప్రజాసంపద
ఆహారవస్తు సమృద్ధి, జాతీయ చైత్ర గీత నటనములు,
సాయుధసేనతోఁ జని సముద్రస్థ శాత్రవుల రూపుమాపి
గంగాతీరమునకుఁ జనిన చెంగుట్టునితో నొక విధమునఁ
బరిచయ మగునట్లమరిన వంజికాండమను మూఁడవ భాగ
ముతో నందియకత సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

కం॥ శ్రీరామ సుకవివర్యుఁడు
శ్రీరామపదాబ్జ నిరత - సేవారతుఁడీ
వీరాంగన యందియకత
ధీరత్వ[illegible]మిళంబునుండి - తెనుఁగొనరించెన్.

శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్.